# భారతి

సచిత్ర మాసపత్రిక

# BHARATHI

(A TELUGU MONTHLY)

సంపాదకుడు:

శి. శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రాలయము,
మద్రాసు.
౧౯౪౦

సంపుటము ౧౭, సంచిక 3

# ప్రకటన

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (1940 సం. మార్చినెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపు లేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1940 సం. ఏప్రల్ 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన బ్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

H 2, 3, 5, 6, 8, 9, 13, 14, 15, 16, 18, 20, 34, 38, 68. J 1, 2. L 1. M 1. O 1. P 1, 2, 19. R 9. S 1, 2, 3, 25, 34, 48. T 3. V 2, 3, 14, 18. W 1.

---

## వ్యాసవిలేఖకులకు మనవి

వ్యాసాలు ఎనిమిదిపుటలకు మించకుండా ఉండాలి. కాగితానికి ఒకపెడే వ్రాయాలి. శాస్త్రీయవిషయాలనుగురించిన వ్యాసాలుకూడా ఎక్కువ పరిభాషా, ఎక్కువ వివరాలూ లేకుండా సంగ్రహంగాను, సామాన్యపాఠకునికి విషయం బోధపడేటట్టు సులభంగాను, మనస్సును కథలా ఆకట్టేటట్టు ఆకర్షకంగాను ఉండాలి. శాసనవ్యాసాలు పదిపన్నెండు పుటలకు మించేయెడల రెండు సంచికలలో ప్రకటింపవలసివచ్చును.

దేశాన్ని ఎక్కువగా కలవరపరుస్తున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయాలనుగురించీ, మనఆంధ్రుల ప్రత్యేకసమస్యలనుగురించీ ప్రత్యేకవ్యాసాలు కావాలి. సాధ్యమయినంతవరకు ఎత్తుకునే విషయంలోను, చూచే దృష్టిలోను, రచించే రచనలోను కొత్తదనంకావాలి. మన ఉద్యమాలు, మన దేశం, మనసంఘం, మనఆశయాలు భారతిలో ప్రతిఫలించేటట్టు చూడవలసిదని వ్యాసకర్తలకు మనవి.—భా. సం.



సంపుటం. ౧౭ ప్రమాది, ఫాల్గునమాసము (మార్చి 1940) సంఖ్య. 3

# పట్టాభిషేకము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

౧

నేను దరిద్రుఁడ నంచును
నేనాఁడేనియును మదిని నెంచంగాలే
దీనాఁడు ముజ్జగంబుల
నేనే నిఖిలపేద నంచు నెఱిఁగితి నెదలోఁ.

౨

నా యాయవ్యయపుస్తకం బెపుడు జన్మంబెత్తె నాఁటంగోలెన్,
నాయాయంబును మ్రింగి నావ్యయ మనంతంబై కనంబట్టు నా
కీయంగాఁదగువాఁ డొకండయిన లేఁ డీ విశ్వమం దెందు, నే
నీయంగాఁదగనట్టివాఁ డొకఁడుఁగానీ లేఁడు లోకంబునన్.

౩

చదు వసలు రాదు విద్యా
మద మెక్కువ జాఠరాగ్ని మందము జిహ్వా
కదనము భయదము నన్నుం
బ్రిదులంగాఁ జేయు నొకదరిద్రుఁడు కలఁడే ?

౪

నాదు సంసారచరిత మంతయును గుట్టు
పరుల సంసారభండారభరము రట్టు
నాకు రొట్టియకును రొట్టి నీకు మట్టి
నాకు నన్నంబు నీకు సున్నంబు చూపె.

౫

'పరిభోజ్యంబగు యౌవరాజ్యపదవిం బట్టాభిషేకం బరుల్
విరియన్ నా కొనరింపవమ్మ' యని నేఁ బెద్దమ్మ నర్థింపఁగా
'సరి నీకంటెను బెద్ద లీభరతవర్షం బేలువా రెందఱో
దొర లున్నా'రని యామె వీడ్కొనియె నా దుర్లోభముం జూపుచుః



# కవితాభిరుచి : పరిణామము

శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ

తెనుగుకవులు తమకవితయం దగుపరచిన యభిరుచులనుగుఱించి వివరించుటయే, ఈ వ్యాసముఖ్యోద్దేశము. ఒక్కొక్క కవికి నొక్కొక్కయభిరుచి యుండును అదిమారుటయు సంభవించును. ఆంధ్రసారస్వతమును సూక్ష్మదృష్టితో పరిశీలించినప్పు డిట్టి యభిరుచు లసంఖ్యాకముగ నుండుటచే నీవ్యాసమునకు ముగింపని యుండ దని తోచుచున్నది. కాన ప్రధానాభిరుచులనుమాత్రమే సేకరింతును.

'అభిరుచి' యనుపదము సారస్వతమందు బహుళముగ వ్యాప్తిగలది. వాఙ్మయమందు శిక్షబొందినవారి కెల్లరకును ఇది శ్రుతపూర్వము. దీనినే యాంగ్లేయవిమర్శకులందరును 'Taste' అని వ్యవహరింతురు. ఆభాషాతత్త్వశాస్త్రజ్ఞులీ Taste అనుపదమును 'Tangere' = to touch అను ధాతువుయొక్క రూప మందురు. రుచి(To like or to be pleased) యన, జిహ్వేంద్రియములతోనే వస్తువు నైనను స్పృశింపగామనకుగల్గు జ్ఞానమని యర్థము. అట్లే సారస్వతవిషయములందు నభిరుచి యనునది యొకానొకనికి గల విహితము, లేక యిష్టమును సూచించును. ఇది ప్రతిమానవునకును, లేదా యదృష్టవంతులయిన చాలమందికి జన్మతః యేకొలదిగనో లభించుచున్నది. అది యెట్లు ప్రవర్ధమాన మగునో వివరించుట దుస్సాధ్యము. ఒకానొకనియం దిది యాయా దేశకాలపరిస్థితులబట్టి ప్రవర్థిల్లుచున్నది.

కారణపరంపరల నరయలేముగాని, ఈ కవితాభిరుచి దినదినమును వృద్ధి నొందుట మాత్రము సత్యము. లోతుపాతు లాలోచించినచో నొకవిషయము మాత్రము పొడచూపును.

సామాన్య విద్యార్థి బాహుళ్యమునకు రమారమి పదునారువత్సరముల లోపుననే కవిత్వము నానందింపగల యోగ్యతకల్గును. ఈ ఉపజ్ఞ జన్మసిద్ధమగు నభిరుచియొక్క ఫలితము.

కాని వారిలో ననేకులం దిది యుక్తవయస్సు పొడసూపియు, జ్ఞాపకపూర్వమే నశించుటయు కద్దు. తక్కిన యల్పసంఖ్యాకులందుమాత్ర మీ యభిరుచి కేవలము కవిత్వము నానందించు దశనుండి క్రమముగ కవితారచనాభిలాషలోనికి పరిణమించుచుండును.

హిందీభాషలో 'పహ్‌లా పచ్చీస్' (The first twenty five) అనగా మొదటి పాతికసంవత్సరము లని యర్థము. మన దేశమం దీవయస్సే యావనప్రాదుర్భావమును సూచించును. ఈదశయందు యువకుడు, అందును కవిత్వానందియు, నేతద్రచనాభిలాషియు నగువాడు, బహు గ్రంథ నిష్ణాతుడై

యాద్యంతము తెలుగక, స్థిరత నెఱుగక, యాత్మీయత నెఱుగక, దైనందినపరివర్తనలకు లోనగుచుండును. చాకలివానియొద్ద మోపెడుబట్ట లున్నను నవి వానివి కావు. ఇట్లే స్వకీయమైన యభిరుచి లేనివారును నని గ్రాహ్యము. కాని కొంతకాలము గడచి యీ రెండవదశతుదియందు ఈతని కేదేని యొకకవిత యాదర్శకముగ గన్పడి హృదయము నాకర్షించి యీతని వెన్నంటును. సర్వసాధారణముగ నీకవితోత్సాహి, యీ రచన ననుకరించి కొన్నిపద్యముల వ్రాయుటయే దీనికి పర్యవసానము.

ఒకదాని నితరు లుద్గ్రంథ మనిరిగదా యని వారిపై గల గౌరవముచే నాగ్రంథమును చూచియు జూడకనే పరవశత నొందక, కృతికర్తతో కేవల మేకీభావము దాల్పక, స్వతస్సత్త్వముతో నలవరచికొనిన విమర్శకదృష్టిని భద్రముగ నుపయోగించుచు నితడు కావ్యపఠనము చేయునది మూడవదశ. ఏకవి యెట్టియానందము నీయ గల డో, యప్పు డతనికి నిశ్చయముగ దెలియును. అంత నత డిక నితరకవి ననుసరించి వ్రాయుట యుండదు. అతనికి నభిరుచి వికసించియాతని కొక వ్యక్తిత్వము నేర్పరచును.

అచ్చమై పెంపొందిన యిట్టి యీయువకవి యభిరుచినుండి యాతని మూర్తిమత్త్వమునుగాని, పృథక్త్వమునుగాని (Personality or Individuality) మనము వేరుపరపలేము. ఎవ్వనికవితాభిరుచియందు వానివ్యక్తిత్వ మచ్చొత్తినట్లు (Stamps of Personality) పొందుపడదో, యట్టివానితోడి కవిత్వవిషయవివాద ముత్సాహమును కల్గింపదు. అనగా నొక యభిరుచి, వ్యక్తిత్వ మలవరచుకొనునంత దృఢముగ లేనిచో నది యింకను ప్రారంభదశయందే యున్న దని విశ్వసింపవచ్చును. ఇదియుగాక యింకొక విషయము. మన యభిరుచులు పాదుకొను దినములలో వానిపై మన వాతావరణస్థితి ప్రభావము కొంతకొంత ప్రసరించును. మన వాతావరణము స్వప్రయోజనాభిలాషాదుల చేత నావరింపబడియుండుటచే మన యభిరుచివలన వాతావరణమును, వాతావరణమువలన నభిరుచియు కొంతగ పరివర్తన నొందుచుండును. ఇది మనయూహా కల్పితము. కాని వాస్తవము. మనుష్యప్రకృతికి నిసర్గమైన యాత్మంభరిత్వము మన దృష్టి నెట్లు సంకుచితము చేయుచున్నదో, యట్లే వాతావరణప్రభావముకూడ మనయభిరుచిని సంకుచితము చేసితీరును.

ఇట్లు మన హృదయాంతరస్థమైయున్న యభిరుచి, వస్తుసందర్శనాభినందనరూపమున బహిర్గత మగుచు నాడునాటికి ప్రబలమై 'విమర్శ'గా నెపుడు పరిణమించుచున్నదో చెప్పలేము. కాని యెట్లు మారుచున్నదోమాత్రము క్వాచిత్కముగ చెప్ప యత్నింపవచ్చును. ఇది యొకకవిరచన నింకొక కవిరచనతో బోల్చిచూచుట, యొకదానికి నింకొకదానికిని తారతమ్యనిరూపణము చేసి వానిని వర్గీకరించుట (Classifying), యొకే రచననే క్రాంతదృష్టితో పరిశీలించుట, మొదలుగాగలశక్తిసామర్థ్యములను గుదుర్చుకొని చివరకు తన తలకు మించిన పరివర్తనలకు లోనగును. దీనినే సామాన్యముగ విమర్శన మందుము. ఇట్టి యానుషంగిక పరీక్ష (Comparision) విమర్శ కాదని వాదించువారును గలరు. పైన జెప్పిన యీ యీదశా

విభజనమునకు స్పష్టమైన రేఖలేవియు నేర్ప డియుండవు. కాని కొందఱాంగ్లవిమర్శకుల వలె 'అరుభిచి'యే విమర్శ మనుకొని వాని రెంటికి నభేదత్వమును వాదింపకూడదు. సాధ్యమైనంతవఱకీ రెండుసామర్థ్యములను మనస్సునందు ప్రత్యేకించి యుంచుట యత్యవ శ్యకము.

'వర్డ్సువర్తు' మహాకవి యూహించినట్లు మనస్సు స్వాస్థ్యమును భజించునపుడు పునః పునరనుభూతికై వచ్చుభావావేగమే యథార్థమైన యభిరుచి (True taste is an emotion recollected in tranquillity). భావావేగము నకును దాని పునరనుభూతికిని కాలవ్యత్యాస మెంత యున్నను, స్వచ్ఛమైన యభిరుచి వికాసము నొందుటకు సంస్మరణ యనునది మాత్ర ముండితీరును. రుచి చూచుట యన నేమో యెఱుగని మన చిన్నినా డేపదార్థ ముల కేరుచి యున్నదో గ్రహించికొని యాయారుచుల వ్యత్యాసమును వివరించుట కుద్యమించునపుడు మనబుద్ధి కొంత ప్రయాసపడును! పోనుపోను అనుభవ మెక్కువ యగుకొలదియు నీరుచి వివేచనయందు మన బుద్ధిపడుచున్న శ్రమ యల్పమగుటచే గుర్తెఱుగ లేకుండుమే గాని యది కొంత శ్రమపడుచున్న విషయముమాత్రము కాద నలేము. అట్లే మనము గుర్తింపలేకపోవుచున్నను, అభిరుచికి గూడ కొంత బుద్ధివిశేష ము నుపయోగించి చిరానుభూతమైన రస భావమును జ్ఞప్తికి తెచ్చికొనుట యనునది యుండును.

కనుక నభిరుచికి బుద్ధి తోడ్పడుచున్నది. కాగా యింకొక విషయము. మతాచార్యులలో పెక్కురు బుద్ధినైశిత్యము గలవారు నైనను మతాభినివేశమునకు ప్రధానముగ బుద్ధిశక్తియే ఆవశ్యకము గాదు. ఎందఱో బుద్ధిశాలు లేమతమునకును జెందనివారు కలరు. ముఖ్యముగ మతజీవికి కావలసినవి యాత్మార్పణము, సంపూర్ణ దైవవిశ్వాసమును. కొందఱు కొందఱు మతగురువులకు తీక్ష్ణమైన బుద్ధి గలిగినచో నది యవాంతరప్రయోజన ముగలదే గాని ప్రధానోపయోగము గలది గాదు. అట్లే కవితాశిల్పవిషయము కూడ నని తెలిసికొనుట యవసరము. దీని యాథార్థ్యమును విచారించి చూతము.

ధర్మోపదేష్టృభావముతో మేళవించి కీచకవధయందు శిల్పాచార్యకౌశలము వెలార్చుట యనునది తిక్కనార్యుని యభిరుచి శ్రేష్ఠతకు సూచకము. అత డట్లు తనకుగల యభిరుచిని వ్యక్తముచేయుటకు ధిషణాచాకచక్యము తోడ్పడుచునేయున్నది. అయ్యును నిశితమైన బుద్ధి కవిత్వకళకు సాహాయ్యకారి మాత్రమే గాని ప్రముఖమైన కారణము కాజాలదు. ప్రపంచలీల కాదికారణమైన ప్రణయభావ మెన్నేనివిధముల నుండు నని సూచించుటకై దేశకాలపరిస్థితుల కెదురీది పింగళిసూరనార్యుడు కళాపూర్ణోదయములో చతుర్విధశృంగార వాహినులను బ్రవహింప జేయుటకు కారణభూత మైనది యాతని యభిరుచియేగదా! ఈ యభిరుచిని నిర్వహించుకొనుటకు బుద్ధి తోడగును. ఇట్లే మహాకవు లందఱకును నాణ్యమైన యభిరుచియే మార్గదర్శక మైనది.

మిల్టను మహాకవియొక్క 'పేరడైజ్ లాస్టు'ను పరిశీలించినను కవితాశిల్ప మభిరుచికి సంబంధించియుండుననియే తేటపడును. అందు కవియొక్క బుద్ధిశక్తి మహావేశ...

స్పష్టముగ పొడగట్టుచునే యున్నది. అది యద్భుత మైనది; అత్యంత మైనదియు. కాని యతని యభిరుచికి యిది కేవల సాహాయ్య మాత్రోపకారిగనే యున్నది. ఆత్మార్పణ మునదక్క, బుద్ధిమార్గమున నన్వేషించిన భగవత్సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్య సిద్ధు లెట్లు లభింపవో యట్లే కవితాశిల్పవిషయమునను జన్మసిద్ధమైన యభిరుచి యనునది లేక కేవల బుద్ధి క్లేశముచే రసానుభూతి గలుగదు. మతపరముగ కవితావిషయమును ప్రస్తావించుటచేత మతవిషయముగాని రచనకు కవితాగౌరవము లేదని 'న్యూమన్' పండితునివలె ఊహించుచుంటి నని పాఠకులు మోసపోరాదు. ఇంతకు విస్తరించు విషయ మేమనగా మతము జీవనపద్ధతికి సంబంధించినది. (Religion is a matter of living; it should be lived but not read or told.) అది విద్యాపఠనమువల్ల వచ్చునది కాదు. ఏయేటను గురియు వర్షము పంచాంగమునందు ముందుగనే సూచింపబడును. కాని యా పంచాంగమును మెలిపెట్టి పిండిన నొక్కనీటిచుక్కయు రాలదు. ఇట్లే మత గ్రంథస్థ జ్ఞానదాయకవిషయము సంగతియు. మత మనునది మతజీవిగా జీవించుటవలననే తెలిసికొనదగినది. అనగా మతాంగీకృతమైన యొకవిలక్షణ ప్రవర్తన గలిగియుండుట. దీనికి తీక్ష్ణమైన బుద్ధి ముఖ్యము కాదు. అట్లే కవితాభిరుచియు ననుభవైకవేద్యము. (It is also a life to be lived; but not read) కవితాభిమానము, కవితాప్రియత్వము, కవిత్వము (Poet-ship) ననునవి యనుభూతవేద్యములు గనుక మన కభిరుచి ప్రధానము. కావుననేయభిరుచిగలిగి యొకకావ్యార్థమును గ్రహించు విద్యార్థికి నాకావ్యకర్తకు గల యంత మేధాశక్తి యక్కరలేకయే సాగిపోవుచున్నది. సాధారణమైన గ్రహణశక్తియు, నచ్చమైన యభిరుచియు నుండిన చాలును. ఇది యభిరుచివిషయము.

ఇక నభిరుచిప్రవృద్ధిహేతువులను గురించి విచారింతము. చిన్ననాడు మనకొక వస్తువు యొక్క యాకారానాకారములను, సుగుణావగుణములనుబట్టి, యిష్టానిష్టము లేర్పడుటేగాక, యా వస్తువులను సూచించు, లేక యావస్తువులకు సంజ్ఞగా నేర్పడునట్టి పదములపైగూడ నిష్టానిష్టములు కుదురుకొనును. ఇట్లు మనకు ప్రేమానహ్యతలను విస్పష్టముగ బాల్యమందే తెలియజేయు నుపజ్ఞయే పురాజనిక్రమాగత మైన యభిరుచి యని తెలిసికొంటిమి. ఈ యభిరుచిసాహాయ్యము ననే మన మొకగ్రంథమును విమర్శనతో చదువుదుము. కొంత కొంతగ తలచూపిన ఈ యభిరుచి యింకొక గ్రంథపఠనముచే దోహదమై యాచదివిన రెంటికిని తారతమ్యమును నిరూపించుకొనుచు ప్రవర్ధమాన మగు ననిగూడ గ్రహించితిమి. కాని యొకవిషయముమాత్రము మరువరాదు. మన మెన్ని కారణముల నన్వేషించి పొందుపరచినను నభిరుచి యనునది యేర్పడుటకుగల కారణ సర్వస్వమును చెప్పితి మనుకొనరాదు.

గ్రంథ పఠనాది దోహదముల నెన్నింటిని జెప్పినను నభిరుచి ప్రవృద్ధియగుటకు మన యూహాతీతములైన యింక కొన్ని యనుకూల ప్రతికూలాదికారణవిశేషము లుండకపోవు. కనుక మన మూహింపగల్గినట్టి కొన్ని కారణములచేతను, నొక్కొకప్పు డూహింపలేనట్టియు నూహింప రానట్టియు మఱి కొన్ని కారణ

ములచేతను, నభిరుచి యేర్పడుచున్న దను కొనవలెను.

దీనిపరివర్తన నింక యోచింతము. అనేక ప్రధానాప్రధాన, అనుకూల ప్రతికూల కారణభావ సస్యములచే నభివృద్ధిని జెందుచున్న యీయభిరుచికేదారమునుండి కొన్ని సస్యముల నెత్తి చూపి, యివియే తదభివృద్ధికి కారణము లని చెప్పజూచుట యెంత యసంభావ్యముగ, నసమగ్రముగ నుండునో యట్లే యభిరుచిపరివర్తనమందును మానవశక్త్యతీతమైన యావత్కారణపరంపరను నిరూపించుటకై కొన్ని కొన్ని కారణములను జూపుటయు, నసమగ్రము నసంభావ్యము, హాస్యాస్పదముగ నుండును.

అయ్యును సాధ్య మైనంతవఱకు నభిరుచిపరివర్తనకు గలకారణముల నన్వేషింతును. సూక్ష్మముగ యోచించినచో మనజీవితానుభవము, మనోవికసనము, వాఙ్మయశిక్ష, యనేకభాషావేత్తృత, స్వజాతిధర్మము, పోషణరీతి (పెంపుతీరు), వంశపరంపర (అనువాయిత) వ్యాపారోద్యోగములు (వృత్తి) మొదలైన బహుత్వ నానావిధత్వములు కారణముగా సారస్వతాభిరుచి యేర్పడుటగాని, క్రమవికాస మొందుటగాని, పరివర్తనలకు తలయొగ్గుటగాని తటస్థించుచున్నది. 'టైన్, సెంట్ బ్యూ,' ప్రభృతులు శరీరశాస్త్రసిద్ధాంతముల బ్రయోగించి కావ్యము నెద్దాని పరిశీలించినను రచయితయొక్క దేశకాలవయోశీలమనస్థిత్యుద్యోగవిద్యాప్రావీణ్యారోగ్యాదులే గాక, స్త్రీపుంసవిభేదమునుగూడ నిర్ధారింపవచ్చునని విశ్వసించిరి.

ఈయుదాహరించిన కారణసంచయము భిన్నభిన్న వ్యక్తులందు భిన్నభిన్నముగ సంకర మొందుచుండుటచేత నొకకవి రచించినగ్రంథ మేయిరువురి వ్యక్తులందును సర్వవిధముల సమానము, సమానాంతరమునగు నభిరుచిని గల్గింపలేదు. ఒకటే దేశకాలపరిస్థితులయందు పెంపబడిన కవల (Twins) కైన నొకటే కవికృతిలోని ప్రతి సూక్ష్మాతిసూక్ష్మాంశము నొకటే గుణము నొకటే పరిమాణము గల తాత్పర్యమును కల్గించుట మానుషాతీతము, లోకాతీతము నైనవిషయము. ఇట్లే యేరచయితకు, నేపఠితకు ననన్యత్వము లేక తాదాత్మ్యము సమస్తవిషయములందును కుదురుటయు నసంభవము, దుస్సాధ్యము ననవచ్చును.

కవియు నొక వైద్యునివంటివాడు. ఏ మహావైద్యుడును తన యనుభవమునందు శరీర మనోవిషయాది వ్యాధిచిహ్న సర్వస్వములో సామ్యము గల యే యిరువురు మనుజులను చూచియుండడు. చూచినచో నే రెండువస్తువులను సర్వసమానముగ సృజింపనట్టి భగవంతునియొక్క సృష్టికౌశలమునందు లోపము గనిపెట్టినవాడగును. కనుక నది యసంభవము. కాగా నీసృష్టిలో నేకత్వమునందు భేదత్వమును, భేదత్వమునం దేకత్వమును పొందుపరచిన భగవంతునివలె వైద్యుడే రెండు మనుష్యప్రకృతులును, సర్వసమానము గాకపోయినను, ప్రధానమైన వ్యాధిచిహ్నముల ననుసరించి చాలమంది కొకటే యౌషధముచే, నొకటిగా కన్పించువ్యాధిని నివారణ చేయుచున్నాడు.

ఈ విషయమే కవికిని చెల్లును. ప్రపంచమునందే యిరువురు పాఠకులు సర్వసామాన్యమైన యభిరుచి గలవారు లేనప్పటికిని వారివారి భిన్నత్వము పోగా మిగిలిన

సామ్యములను గుర్తెఱిగి యాయాయభిరుచు లకు వచ్చునట్లే కవి రచించును. అందువల ననే మహాకవి **Keats**,

'.....................**Sure a poet is a sage,**
**A humanist, Physician to all men**"—

అని యన్నాడేమో! అట్టివాడే సర్వ సిద్ధులను బొందగల కవి. మానవప్రకృతికి సామాన్యమైన యభిరుచిని గుర్తెఱిగి తదను కూలముగ తమ కవితా విపంచీ స్వనమును మేళగించుటయే మహాకవుల యాశయము.

ప్రకృతము ననుసరింతును. ప్రకృతి యందలి ప్రతివస్తువును పరిణామము నొందు చున్నదని తజ్జ్ఞుల సిద్ధాంతము. అన్నిటను మనకు ప్రస్తుత మలవడుచున్న పాశ్చాత్య నాగరికతయే దీనికి దృష్టాంతము. ఈయభి రుచి యొక్క యుత్పత్తి ప్రవర్ధనములకు కారణముల నెట్లు వితర్కించి యేర్పరుప లేమో, యట్లే పరివర్తనమునకు హేతువుల జూపుట దుర్లభము; దుస్తరమునై యున్నది. గాలి యేల వీచుచున్నది.? సూర్యు డేల ప్రకాశించుచున్నాడు? అనినచో నేమని ప్రత్యుత్తరము నిత్తుము ?

ఇట్లే అభిరుచికి పరివర్తన మనునది నైసర్గికము. ఇది చెప్పక యెన్నికారణముల ప్రతిపాదించినను ఆ విమర్శన మసమగ్రము. అభిరుచికి పరివర్తనము, మానవునకు పార బడుటయంతటి సహజము; ధ్రువమును. ఒకానొక విధమగు సారస్వతాభిరుచి యొకా నొకజాతియం దొకానొకకాలమున నక్షేయ మగు మహాగ్నివలె చెలరేగి, యట్లే చప్పున చల్లారిపోవుచుండును. ఎన్నియో యిట్టి ప్రత్యక్షదృష్టాంతము లుండ, నభిరుచి పరిణామ ములకు లోనగుట లేదని యెవ్వరైన పల్కిన చో వారి కసలభిరుచియనునదియే యేర్పడ లేదని చెప్పవచ్చును.

మన కెంతె యిష్టమున్నను, తినగతినగ తీపియైనగాని, మొగము మొత్తును. అంత కొంత కాలము స్వాదువస్తువునే ముట్టము. అప్పుడు మన యభిరుచిలో పరివర్తన కల్గిన దనకుందుమా? సారస్వతమందును చిత్రవిచిత్రాభి రుచులు వచ్చిపోవుటయు పోయివచ్చుటయు కననగును. ఆర్థికశాస్త్రవేత్త లనేకులు ఈ పరిణామము తచ్ఛాస్త్రమునందును కలదని యొప్పుకొని దానిని పర్యాయతత్త్వము (**Cyclic theory**) అనుచున్నారు.

కొందఱ కిట్టిదానియందు విశ్వాస ముండదు. ప్రపంచము చలనము నొందక స్థిర ముగ నున్నదని వారియూహ కావలెను. ఇట్టే యభిరుచిపరివర్తన నవిశ్వసించువారి సంగతియు. కాని వారియం దాయవిశ్వాసము సైతము నిత్యము మభివృద్ధి నొందుట సిద్ధము. ఇట్టి యవిశ్వాసాభివృద్ధియు పరిణామమే యగును. ప్రత్యేకవ్యక్తులందును, పోనుపోను యుగయుగములందును నభిప్రాయములు పరి వర్తనజెందుచుండ కవితాభిరుచులం దేల అది పొడచూపకుండును? 'కోఅల్' పండితుడు తన 'Critic and Artist' అను గ్రంథమునం దిట్టి విషయములను బాగుగ చర్చించెను. 'ఫాస్నెట్, బ్రూనెటియర్, లెటోర్నో, సైమ న్డ్సు' ప్రభృతు లీవిషయముపై నధికారులు.

ఏదో యొక మహాయుద్ధమో, రాజ కీయవిప్లవమో, సంఘసంస్కారమో, యిట్టి మార్పులకు ప్రధానకారణముగ నుండును. ఆ యుగమునందలికవిత్వములో నది ప్రతిబిం

బించును. ప్రతి నూత్నయుగారంభమును గత యుగమునకు ప్రతిఘాత (Reaction). మనదగును సర్వసాధారణముగ నీ ప్రతిఘాతము వార్ధక్యయౌవనములకుగల స్పర్ధ వంటిది (Rivalry between the youth and the old people). ఒకప్పుడు ప్రకాశించిన యభిరుచి నాడునాటికి తన పరిమళమును కోల్పోవును. యువయుగారంభముతో తత్పూర్వాభిరుచి వాడిపోయి నూత్నాభిరుచి వికసించును. ఇదియు తనకాలము చెల్లిన వసివాళ్లువాడును. దీనికి ప్రతిఘాతముగ నింకొక యభిరుచి పొడసూపును. ఇదియే పరిణామము. అస్తమించిన భానుడు తిరిగి యుదయించినట్లు గతించిన యభిరుచియే యొక్కొకప్పుడు పునఃప్రతిష్ఠితమగుట తటస్థించును. ఇది యావృత్తి తత్త్వము.

కాని యొక త్రిభుజము (Triangle) నందలి రెండు కోణములు(Two angles) ౧౫౦° అయినచో మూడవ కోణము 3౦° అయితీరునని విస్పష్టముగ రేఖాగణితము (Geometry)నందు నిర్ధారణ చేసినట్లు సారస్వతవిషయములందు భవిష్యత్తును నొక్కి వక్కాణించి యావృత్తిసూత్రము నెల్లప్పుడును నిరూపింపలేముగాని, యేదో యొకవిధమగు పరివర్తన యుగయుగమునకు పొడగట్టుననిమాత్రము చెప్పగలము.

కనుక ముఖ్యాంశము లివి:—అభిరుచి జనించుటకును, అభివృద్ధిని పొందుటకును, పరిణామము నొంది నశించుటకును, పునఃపునరుద్భవించుటకునుగల సర్వకారణములను లెక్కింపలేముగాని, యది యకారణముగ సంభవింప దని మాత్రము చెప్పగలము. కవిత్వమం దిట్టివి పుట్టిగిట్టుచుండుట యాయా కవుల యభిరుచివిశేషముల ననుసరించి యుండు ననియు మరువరాదు. అందుచే వేర్వేరు కవులకు, ఆయాకాలానుసరణముగ గల్గిన యభిరుచులను, లేక 'కవితాత్మ'లను వివరముగ మున్ముందు గ్రహింపగలము.



# యుద్ధగీతి

శ్రీ అబ్బూరి వరదరాజేశ్వరరావు

"ముసరు చీకట్లలో
విసువు వేసట లేక
ఈ నిర్జనస్థలాల
ఈ మార్గమధ్యమున
ఎవరికోసము నిరీ
క్షింతువో కామినీ!
కురియు మంచుజడులకు
శరీరమ్మే వణకు
ఈ దారి తొలగి పో
వే విషాదవదనా!"

"నా వయసుకాడు యి
న్నాళ్లకిప్పుడె వచ్చు
ఈ దారి నెదురేగి
ఇచట గలియగవచ్చు"

"ఏ దూరసీమకో
ఏగి వచ్చిన ప్రియుడు
అలసించెడున నీ
ఆనందమే మరచి?"

"కలనైన జూడని య
ఖండభూభాగాల
సాగిపోయెను నాడు
సాగరములే దాటి.
ఎన్నినాళ్లాయెనో!
ఏతెంచు నీనాడు

నా ప్రాణవల్లభుడు
ఈ ప్రాగ్దిశపథాన
అతని బ్రతుకే నాది
అతనికోసమె నేను
ఆనందసమయాల
ఆపదల మే మొకటి!"

"అతనికోసము మరెవ
రైన నీప్రాంతాల
నెదురు చూతుర పడతి!
బెదరుగుండెలతోడ?"

"ఈ మినుకుమినుకు మను
తారలే ఘూకాలె
ఆ జీర్ణమందిరా
భ్యంతరములో వెలుగు
దీపికానహస్రమె
ఈ పాడుజీవికయె
ఈ ద్వారబంధాలె
ఈ యంధలోకమ్మె
వేచియున్నా రిచట
కాచియున్నా రిచట
సమరక్షేత్రమునుండి
స్వగృహాగమనమృత్యు
కళేబరమునకు స్వా
గత మిచ్చి తెచ్చికొన!"

---

# అవీ - ఇవీ

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

## మోహరివాడ

౧౯౩౯-వ సం. నవంబరు భారతిలో 'దోహారి' పదమునుగూర్చి, దాని యర్థమును గూర్చి, వ్రాసితిని. క్రీడాభిరామములోని 'మోహరివాడ'ను గూడ 'దోహరివాడఁ' జేయవలెనేమో అని వ్రాసితిని. మహారాష్ట్ర దేశమున గొడారులకు, (దోహారులకు) 'మోహారులు' అని పేరున్నదని, చరిత్ర విశారదులు ఆనంద ముద్రణాలయపండితులు శ్రీ వెంకటేశయ్యగారు తెల్పిరి. దీనిఁబట్టి 'మోహరివాడ' యన్న పదముగూడ సురక్షితమయినది. దిద్దనక్కఱ యుండదు.

## చెవపు

హారవిలాసమున 'చిఱుబంతిపసుపుతోఁ జెవపు నలఁది' అని యున్నది. పసిబాలుర, మేననుండు నెఱ్ఱమచ్చలకుఁ దెలుఁగున 'చెవ, చెవ్వ' అని వాడుక. ఇక్కడకూడ నదే యర్థము కాఁదగునుగాని, 'చెవపు' వ్రాఁత ప్రతులలో నున్నది. అఱవమున ఎఱ్ఱఁదనమునకు శివప్పు 'సెగపు' అని వ్యవహారము. అఱవపు 'శివప్పు' తెలుఁగున 'చెవపు' అయినదికాఁబోలును.

## చిగురుఁగొమ్మ

మనుచరిత్రములోని పద్యములకుఁ గొన్నింటికి నాకంటికిఁ గానవచ్చినపాఠభేదములను, నాబుద్ధికిఁ దోచిన యర్థవిశేషములను ఇక్కడ వెల్లడించుచున్నాఁడను :

అరుణాస్పదపురవర్ణన మిట్లు గలదు—

సీ. "అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి
ముది మదిదప్పిన మొదటివేల్పు
నచటిరాజులు బంటు నంపి భార్గవునైన
బింకానఁ బిలిపింతు రంకమునకు
నచటి మేటికిరాటు లలకాధిపతినైన
మును సంచిమొదలిచ్చి మనుప దక్షు
లచటినాలవజాతి హలముఖాత్తవిభూతి
నాదిభిక్షువుభైక్షమైన మాన్పు
నచటివెలయాండ్రు రంభాదులైన నోరయఁ
గాసెకొంగున వారించి కడపఁగలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నచటఁ బుట్టిన చిగురుఁగొమ్మైనఁ జేవ."

పై సీసపద్యము తొలి నాల్గుచరణములలో నాల్గువర్ణములవారివర్ణన మున్నది. ఎత్తుగీతి మూఁడుచరణములు వెలయాండ్ర వర్ణనముగాను, నాల్గవచరణము "ఆయూరఁ బుట్టినది సర్వమును సారవంతమే" యని సర్వవస్తుసామాన్య వర్ణనాత్మకముగాను ప్రాచీన వ్యాఖ్యాతలు వ్యాఖ్యానించిరి. కాని యిట్టి యన్వయమునఁ గూర్పుసొంపు గొంత కొఱవడును. సీసచరణములు నాల్గింట వేర్వేఱుగా నాల్గు వర్ణ్యము లున్నట్టు, ఎత్తుగీతి నాల్గు చరణములను నాల్గువర్ణ్యములు వేర్వేఱుగా నుండుట గాని, రెండేసిచరణముల కొక్కటిచొప్పున నాల్గు చరణములకు రెండువర్ణ్యము లుండుటగాని, లేక నాల్గింట నొక్కటేవర్ణ్య ముండుట గాని నేర్పుగలకూర్పనిపించును. ఎత్తుగీతి రెం

డవచరణము తుదిని సమాపకక్రియ గలదు. వాక్య మక్కడికి సమాప్తమైనది. వ్యాఖ్యాతల వ్యాఖ్యానరీతికి మూఁడవచరణము నా సమాప్తవాక్యము లోని కీడ్చుకొనిపోయి యన్వయింపవలెను. పెద్దనామాత్యున కిట్టి యన్వయ మభిప్రేతమయేని అతఁ డామూఁడవ చరణమును రెండవచరణముగానే నిలిపి యుండఁగలఁడు. అప్పు డన్వయసారళ్యము పొసఁగును. పెద్దన పయిపద్యమున నొక్కొక్క వర్ణ్యమును 'అచటి'ఇత్యాదిగా వేర్పఱిచి వర్ణించినాఁడు. ఈతీరును గుర్తింపవలసిన దే.

ఇవి యెల్లఁ బర్యాలోచించినపై నాకుఁ దోచినయన్వయపద్ధతి నిదె తెల్పుచున్నాఁడను: ఎత్తుగీతి నాల్గుచరణములందును వర్ణ్య మొక్కటే — వెలయాండ్రే. కాని నాల్గు చరణములలోను తొలి రెండుచరణములు నొకవాక్యము; తుదిచరణమింకొకవాక్యము. మూఁడవచరణము దేహళీ దీపన్యాయమున రెండు వాక్యములందును బొందుపడును. తొలి రెండు చరణములు వేశ్యాసామాన్య వర్ణనము; తుది చరణమునందుఁ దద్విశేషవర్ణనము. తొలి వాక్యమునకు—అచటి వెలయాండ్రు (దేవలోకమునుండి దిగివచ్చి) రంభాద్యప్సరస లయినను వంతున కెక్కఁజూచినఁ దమ పృష్ఠభాగపుఁ గోఁక (గోచి) కొంగుతో వెనుకకుఁ దొలఁగఁద్రోచి తాము ముందడుగు వేయఁగలరు: కడవఁగలరు = ముందడుగు వేయఁగలరు. ఇక్కడ 'కడప', 'కదుమ', 'కడవ'-పాఠము లున్నవి. ముద్రణమున 'కడప' గలదు. నేను 'కడవ' గైకొంటిని. ఇట్లే రెండుచరణములందును వేశ్యాసామాన్య వర్ణనముచేసి పెద్దన కడపటి చరణమునఁ దద్విశేషవర్ణనము చేయుచున్నాఁడు. 'నాట్యరేఖా కళాధురంధరనిరూఢి'ని 'అచటఁ బట్టినఁ జిగురుఁగొమ్మైనఁ జేవ.' అచటన్ = ఆయూర, పట్టినన్=పరీక్షింపఁగా — నాట్యమాడించిచూడఁగా—వంచిపట్టి చూడఁగా, చిగురుఁగొమ్మైనన్ = పుష్పితకాని - అంగసౌష్ఠవ మింకను సరిగా విరియని పసితనపు (వెల) కొమ్మ=ఆడుదికూడ, (కొనసాగుచున్న తలిరుఁ (లేఁత) గొమ్మకూడ) చేవ = చేవగలదే—గట్టితనము కలదే.

ఇంచుక వివరణము: ప్రౌఢలగు నాయూరివెలయాండ్రు రసికులకలయికలం దాఱితేఱి యనుభవజ్ఞానము గడించినవారు గాన రంభాదులతో నొరసి శృంగారరససంప్రదాయవిశేషములను నాట్యాభినయములందుఁ జూపి నేర్పు మెఱయింపవచ్చును. అది విశేషము గాదు. రసానుభవమునకుఁ దగ్గవయసింకను రాకముందే—పసిప్రాయమందే— ఆయూరివెలకన్నెలు నాట్యాదులందుఁ గడు చతురలు. అర్థాంతరన్యాసముగా నాల్గవచరణము మాత్రము వేర్పఱచిన నాయూరఁ బట్టి (వంచి) చూచిన లేఁతకొమ్మలుగూడఁ జేవ గలవే. పసివారుగూడఁ గడుఁబ్రోడలే యనియు నేర్పడును.

ఈపద్యమున 'కాసెకొంగున వారించి కడవఁగలరు' అన్నపాఠము 'గదుమఁగలరు' అన్నపాఠముకంటెను, 'కడపఁగలరు' అన్న ముద్రితపాఠముకంటెను సుందరతమము. మఱియు'అచటఁ బట్టినచిగురుఁ'అనుపాఠము కంటె 'అచటఁబట్టినఁజిగురుఁ' అన్నపాఠము సుందరతరము. తెనుఁగున 'పట్టిన...కొమ్మ' పలుకుబడికల్మికి 'నేపట్టింది మునగకొమ్మకాదులే' అని రామదాసుకీర్తన తార్కాణ.

ఈపద్యమునుగూర్చి కడపవాస్తవ్యులు, కల్లాప్రపూర్ణులు, శ్రీశేషాద్రిశర్మగారు కడప మండలమున సిగరచెట్లని చెట్లు కలవనీ, వానికిఁ జేవయుండదనీ, ఆసిగరచెట్లకొమ్మలే చిగురుకొమ్మ లనఁబడెననీ, పెద్దన, కడప మండలము వాఁడు గాన, తదనుస్మరణమున వరణానదీతీరపు టరుణాస్పద పురవర్ణనమున వానిఁ బేర్కొనెననీ యనిరి. ఈ పద్యమున వేశ్యలుగూడఁ గడపమండలమువారు గావచ్చును. 'కడపఁగలరు' పాఠ మున్నదిగదా!

## ఆనందో బ్రహ్మ

శా. "ఎందే డెందము గందళించురహిచే
    నేకాగ్రతన్ నిర్వృతిన్
  జెందున్, సంభగతప్రదీపకళికా
    శ్రీ దోఁప నందెందుఁ బో
  కెందే నింద్రియముల్ సుఖంబు గను, నా
    యింపే పరబ్రహ్మ మా
  నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నాం
    తం బర్థ మూహింపుమా!"

నాకు నచ్చినపాఠప్రకారమునఁ బైపద్యము నుదాహరించితిని. అచ్చులోను వ్రాఁతలోను దీని మఱికొన్ని పాఠాంతరములు గలవు. 'కందళింప', 'నేకాంతతన్', 'నెందెందుఁ బోక', 'సుఖింపఁగను', 'అంతర్బుద్ధి', అనునవి యా పాఠాంతరములు.

ఇందు— 'ఎందేడెందము' - ఆదిగా 'సుఖంబుగను' వఱకు రెండువాక్యములు. తొలివాక్యమున 'కందళించు'కు శ్రీ జయపురాధీశ్వరులు పొసఁగించిన ధాతుజ విశేషణత్వము సుందరము. ఈ విషయము కాదు ప్రధానముగా నే నీపద్యమునఁ జెప్పఁబూనినది.

'ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా' అన్న పాఠముకంటె 'ప్రాఁజదువు నాంతం బర్థ మూహింపుమా' అన్నపాఠము చాలసుందరమయినది. ఎట్లనఁగా: పయి పదోపన్యాసముఁబట్టి ఆనందమే బ్రహ్మమన్న యర్థము వ్యక్తపడును. కాని యింతమాత్రమున వరూథినివాదము నెగ్గదు. ప్రవరుఁ డనఁగలఁడు: 'ఇది యథార్థమే. ఆనందమే బ్రహ్మము. ఆ యానందము నాకు గృహ్యాచారధర్మానుష్ఠానమువలన లభించును' అని. అట్లనుటకు వీలులేకుండ- 'ఆనందమే బ్రహ్మము. ఆయానందము సంభోగరూపము.' అని నిరూపించుటకు 'ఆనందో బ్రహ్మ' అన్న యుపనిషన్మంత్రప్రతీకము నిచ్చి యా మంత్రమును కడముట్టఁ జదువుకొని యర్థ మూహించి చూడు మనుచున్నది. ఆమంత్ర మిది:

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్,
ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే,
ఆనందేన జాతాని జీవన్తి,
ఆనందం ప్రయ న్త్యభిసంవిశ న్తీతి."

దీనికి వరూథిని తలఁపులో నున్నయర్థ మిట్టిది:

"ఆనందమే బ్రహ్మ మని తెలిసికొనెను. ఆనందముననుండియే (సంభోగానందముననుండియే) భూతములు జనించుచున్నవి. పుట్టిన యాభూతములెల్ల నా(సంభోగా)నందముచేతనే వర్ధిల్లుచున్నవి; ఆయానందములోనికే ప్రవేశించుచున్నవి. ఆయానందమునకే యభిముఖస్థితిని బొందుచున్నవి." ఇంతకింకను బచ్చిగా వివరించి చెప్పఁదగినట్టిది వరూథినితలఁపులోనియర్థము.

వరూథిని యచ్చరపుప్పఁబోఁడి; స్వాధ్యాయానుష్ఠానపరులగు విప్రవర్యు లెందఱో

స్వర్గమునకు రాఁగా వారితోఁ బ్రసంగములు గావించి ప్రౌఢి కెక్కినది. అద్వైతులు జీవ బ్రహ్మైక్య ప్రతిపాదకశ్రుతులను, ద్వైతులు జీవబ్రహ్మవిభేద ప్రతిపాదకశ్రుతులను, ఇంక నాయావైదికమతములవారు తమతమ మత ముల కనుకూలములగుశ్రుతులను సేకరించి యుంచుకొనునట్లు, వరూథిని తృతీయపురు షార్థమే పరమార్థమని నిరూపించుటకుఁ దగ్గ శ్రుతులను గూర్చికొని నేర్చుకొనియున్నది గావలయు. పయిశ్రుతికి వరూథిని నిర్ణయించు కొన్న యర్థముచొప్పుననే నన్నిచోడమహా కవి యొకపద్యము రచించినాఁడు.

సీ. "పృథులవిశ్వంభరారథమున కిరుసుగాఁ
బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు,
కాంచనాచలకార్ముకమునకు సాటిగాఁ
జేపట్టె నెవ్వాఁడు చెఱకువిల్లు,
అవిరళ(తథ?)పాశుపతాస్త్రమ్మునకు వాఁడి
మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు
అతులితామరదానవాదిబలంబుల
గెలిపించె నెవ్వఁ డయ్యలిబలమ్ము
నట్టిజగజెట్టి మన్మథుఁ డఖిలలోక
ములకు వెఱఁగంగ జీవులమూలకంద
మతనియిలు సొచ్చి వెడలనియతఁడు గలఁడె
యతనియమ్ములఁ బడకున్న యదియుఁ గలదె?"

వరూథిని యుపనిషన్మంత్రమునకు గోచ రింపించిన క్రొత్తయర్థమును బర్యాలోచిం పఁగా ప్రవరునకు సిగ్గును, వెగటును బొడ మినవి. సంభోగవిషయమని సిగ్గు; పవిత్ర మైన మంత్రార్థము పాడుపడినదని వెగటు.

## పాఠ్యాగమ సూక్తపంక్తి

శా. "ఈపాండిత్యము నీకుఁ దక్క మఱెవెం
డేఁ గంటిమే కావునా
స్తోత్రిపాధ్యాయిని నా వచించెదవు మే
లోహో! క్రియాధర్మముల్
పాపంబుల్ రతి పుణ్యమంచు నిఁక నే
లా తర్కముల్ మోక్షల
క్ష్మీపథ్యాగమసూత్రపంక్తి కివియో
మీసంప్రదాయార్థముల్."

అన్నాఁడు. ఈపద్యమున "మోక్షలక్ష్మీపాఠ్యా గమ సూక్త(త్ర) పంక్తి కివియో మీసంప్రదా యార్థముల్" అన్నపాఠము సుందరము. మోక్షలక్ష్మిని — అచ్చరపూఁబోఁడిని కాదు— బడయుటకుగాను పాఠ్యమయిన యుపనిష న్మంత్రక్రమమునకు మీసంప్రదాయమువారు —తృతీయపురుషార్థమే పరమార్థమనువారు— చెప్పెడునర్థ మిట్టిదియా యనుట నేఁజూపిన పాఠమున కర్థము.

—ఇంకను గలదు.

---

# అభాగిని

శ్రీ దురిశేటి వెంకటరామాచార్యులు

ఎలఁ బ్రాయంపుమిటారి యార్తు దనలో నేమేమొ మాటాడుఁ; బొ
త్తులఁ బన్నుండిన లేఁతపాపఁ గను; నేదో పెన్నిధిం బాయు దృ
క్కులనేమో కని చప్పరించు; శ్రమలోఁగుఁ; అప్పలల్లార్చు; ని
ట్టుల గంగానదియొడ్డుఁ జేరె నెవరో డోలాయితస్వాంతయై.

తామరపాకుసెజ్జ నొకదాని నమర్చి, చివుళ్లు పేర్చి, తా
నామని లేఁతగాడ్పు నలనల్లనఁ గన్నులఁ దేల్చువానిఁ; గెం
దామరమోము గ్రొంగురులదాపున ముద్దులు గుల్కువాని; న
క్కోమలి బిగ్గ హత్తుఁ; గొనగోరుల నగ్రుల మీటు; మాటికిన్.

అటుల నందు వాని, నప్రొద్దు గ్రుంకున
నపర బాలభానునట్ల వెలుఁగు
కొమరుఁ జేర్చి; కొంత గుములుభానుని జూచి;
కొంత గుములు ముద్దుకొడుకుఁ జూచి.

పిల్లతెమ్మెర చెక్కుల మెల్లఁ దాఁక
నాయమాయికపుత్రుఁ డౌరా! యదేమొ?
ఎంతయో నగుఁ, జూడలే దంత; కడకుఁ
బయ్యెద మొగంబుఁ గప్పి నప్పాప మేమొ?

లేఁతవయసు; దానిరీతి పెద్దయు మిన్న;
క్షాత్రతేజ మున్న జాడ దోఁచు;
నలరుగుత్తులందు నగు నిప్పుకలు వడెఁ;
బూవుఁదేనె విసము పొరలిపడియె.

"కొమరుల నెత్తుటో; మసృణకోమల మైన కడానిమేనుఁ జే
నిమురుటో; బిగ్గమూర్కొని, ధ్వనించెడి వీణియ డెందమందు రా
గములను మేళవించుటయొ; కాక, మతే యమ యేని నింత ద్రో
హము నొడిఁగట్టునే యెచటనైన మదన్య? యభాగ్యపుత్రుఁడా!

ఏటికి నవ్వెదో? ఎఱుఁగ నీతోఁ వగన్నులమోము మాటికిన్
మాటికి విచ్చుచుండిన రమారమి యంతకు మించి నాయెదం
బీఁటిక లెత్తుచున్నవి సుమీ! చెడుగెంతయుఁ జేసినావు; నా
బోటికిఁ బుట్టి; తేమి పడిపోయిన దోయి? యదృష్టహీనుఁడా!

ఎఱుఁగలే, దింత నీ లేఁతయెడఁద; అదిగో!
ప్రళయజీమూత ఘూర్ణితార్ణవతరంగ
నిస్వనమునఁ దుపాను, దా నిన్ను నిపు, డె
డాఱఁ గొంపోవుఁ దల్లియెడందఁ బాపి.

చూడకుమోయి! తేనియలసోనలఁ జిమ్ముట మానివైచి, యీ
నాఁడు విసాలఁ గ్రక్కు నిదె నాయెద; తల్లులకెల్ల మచ్చ; నీ
వేడ? నదన్నదీజల మిదేడ? శిరీషసుమంబు మాయురే!
వేఁడివెలుంగుముందు పడవేయుట; దేనియలగ్గిఁ గొట్టుటల్."

అని యాముద్దియ, యొండుమండపమునం దాసెజ్జతోఁ డించి వా
నిని; జెంగల్వలరేకులం బయిపయి న్నిండారఁగాఁ గప్పి; క్రొ
న్నన నీరుగ్గులు పెట్టి; మూఁతనిడి; యంతం బూర్ణగంగానదీ
ఘనతోయంబుల నుంచి; జాలు గరగంగా ముక్తకంఠంబుతోఁ.

"ఓయీ! పోవుచునుంటివే? కొడుక! అయ్యో! ఘోరనీరంబు! కొం
తేయుం డెన్నఁడుఁ గాకుమోయి! ఇది హేతీభూతదుస్స్వాంత; గాం
గేయుండో మఱియెవ్వఁడో యగుము! నీకేప్రొద్దు గంగానదీ
తోయంబు ల్సుఖముండుఁ గాత! ఇనుఁడెంతో నిన్నుఁగాపాడుతన్."

అని పడియె నామె; భానుఁ డల్లంత దానిఁ
జూడ నోర్వక తోడ నచ్చోటు వాసెఁ;
బక్షు లెగసెను; దుంపురు ల్వడియె రెండు;
పారిఁబారిఁ దమంబు లంతంతఁ బొదివె జగము.

# సమాజము: కళాజీవి

శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు

A Poet's mission is to attract the voice which is yet inaudible in the air; to inspire faith in the dream which is unfulfilled; to bring the earliest tidings of the unborn flower to a sceptic world. ..................Prudent men and unbelievers have created dissensions, but it is the eternal child, the dreamer, the man of simple faith, who has built up great civilizations.

—Poet Rabindranath.

ప్రతిమానవజీవీ ఏదో ఒక 'వ్యక్తి'ని పొంది ఉంటాడు. 'ఆర్థికవ్యక్తి' కాని 'కళావ్యక్తి' కాని ప్రతిజీవిలోనూ మొదటినించీ అభివృద్ధి చెందుతాయి. 'ఆర్థికవ్యక్తి' గల జీవి సంసారతాపత్రయంలో నిమగ్నుడై, వర్తకమో, ఉద్యోగమో ఏదో ఒకటి సంపాదించుకొని ప్రాపంచికమైన అభివృద్ధి చెందడానికి జీవితాన్నంతా వ్యయపరుస్తాడు. రెండవమాదిరీ వ్యక్తి 'కళాజీవి', సంపూర్ణ వ్యక్తిత్వంలో ప్రకాశిస్తాడు. ఇతడు స్నేహ సౌహార్ద్రాలకై జీవితంలో కాంక్షిస్తాడు; కళాసాధన చేస్తూ, మానవకోటిని ప్రేమించి తన జీవితాన్ని ఉత్తమపథాలలో నడిపించి ధన్యత చెందడానికి ప్రయత్నిస్తాడు. విశాల దృష్టీ, ఆదర్శవాదమూ, విజ్ఞాన తృష్ణా ఇతనిలో నిండుకొని మానవసేవ చేయిస్తాయి.

ఈ రెండురకాల మానవులకూ గల వ్యత్యాసాన్ని శ్రీ. శ్రీ 'వ్యత్యాసం' అనే కావ్యంలో చక్కగా చిత్రించాడు సంభాషణ రూపంలో 'కళాజీవి' చెబుతున్నట్టు :—

అదృష్టవంతులు మీరు.
వెలుగును ప్రేమిస్తారు; ఇరులను ద్వేషిస్తారు.
మంచికీ చెడ్డకీ నడుమ
కంచుగోడలున్నాయి మీకు.
మంచిగదిలోనే
సంచరిస్తాయి మీ ఊహాలు.
ఇదివరకే ఏర్పడిం దాగది.
అందుకే వడ్డించిన విస్తరి మీ జీవితం.
నిశ్చల నిశ్చితాలు మీవి.
మంచిని సరించి,
మర్యాద, మప్పితం సరించి,
నడత, నాణ్యం, విలువల విషయం
నిశ్చల నిశ్చితాలు మీవి.
మీ కన్నుల చూపులు సరళరేఖలో
రేఖ చెదరితే గొల్లు మనిపోతారు.
రేఖ కదలితే వాళ్లంతా నేరగాళ్లు.
రేఖను రక్షించడానికే
న్యాయస్థానాలు, రక్షకభటవర్గాలు.
చెరసాలలు, ఉరి కొయ్యలు!
రేఖను కాపాడక తీరదు.
అభాగ్యులం మేము,
పరిహద్దులు దొరకని సంధ్యలలో మా సంచారం.
అన్నీ సమస్యలే, సందేహాలే మాకు.
వెలుగులోని చీకట్లే
ఇరులలోని మిణుగురులే చూస్తాం.
నూరు దోషాలలోని ఒక సుగుణం
నూరు పుణ్యాలలోని ఒక పాపం!

వ్యత్యాసాలూ, వ్యాఘాతాలే
అడుగడుగునా మాకు.
మా వంట మేమే వండుకోవాలి.
ఒక్కొక్కమారు విస్తరే దొరకదు.
జీవితపు సన్నని సందులకే
ఆకర్షణ మాకు.
మా దృష్టిది వర్తులమార్గం.
ఆద్యంతరహితం.
సంధ్యాజీవులం. సందేహభావులం.
ప్రశ్నలే! ప్రశ్నలే!
జవాబులు సంతృప్తి పరచవు.
మాకు గోడలే లేవు.
గోడలను పగులగొట్టడమే మా పని.
అలజడి మా జీవితం.
ఆందోళన మా ఊపిరి.
తిరుగుబాటు మా వేదాంతం.
ముళ్లూ, రాళ్లూ, అవాంతరాలెన్ని
ఉన్నా ముందుదారి మాది.
ఉన్నచోటు చాలును మీకు.
ఇంకా వెనక్కి పోతా మంటారు కూడా
మీలో కొందరు.
ముందుకుపోతాం మేము.
ప్రపంచం మా వెంట వస్తుంది.
తృప్తిగా చచ్చిపోతారు మీరు.
ప్రపంచం మిమ్మల్ని మరచిపోతుంది.
అభిప్రాయాల కోసం
బాధలు లక్ష్యపెట్టనివాళ్లు
మాలోకి వస్తారు.
అభిప్రాయాలు మార్చుకొని
సుఖాలు కామించేవాళ్లు
మీలోకి పోతారు.

—'ప్రతిభ' జనవరి, ౧౯౩౯.

సామాన్య 'ఆర్థిక జీవి' వెలుగును ప్రేమిస్తాడు; ఇరులను ద్వేషిస్తాడు. 'మంచి గదిలోనే సంచరిస్తాయి'—అతని 'ఊహలు'. 'అందుకే వర్ణించిన విస్తరి' లాంటిది అతని 'జీవితం'! ఆర్థికజీవి సమాజమర్యాదలకి కట్టుబడి ఉంటాడు. 'కళాజీవి' నవ్యభావాలకి అవి వ్యతిరిక్తమైతే తిరుగబాటు చేస్తాడు. ఆ 'రేఖను' కాపాడడానికి 'న్యాయస్థానాలూ, రక్షకభటవర్గాలూ, చెరసాలలూ, ఉరికొయ్యలూనూ'! ప్రభుత్వంకూడా ఇలాంటి వారిని ఎర్రగాచూసి, సమాజంతో కలుస్తుంది వారిని శిక్షించడానికి. అందుకే 'సరిహద్దు దొరకని సంధ్యలలో' కళాజీవుల 'సంచారం'. ఆర్థికజీవి సమాజనిబంధనలనీ, సాంప్రదాయాలనీ ప్రశ్నించక శిరసావహిస్తాడు. కాని కళాశీలికి 'అన్నీ సమస్యలే, సందేహాలే.' 'జీవితపు సన్నని సందులకే ఆకర్షణ' వారికి. 'రిస్కూ', సంఘబహిష్కారమూ వారివంతు. 'వ్యత్యాసాలూ, వ్యాఘాతాలే అడుగడుగునా' వారికి. 'మావంట మేమే వండుకోవాలి. ఒక్కొక్కమారు విస్తరే దొరకదు' అంటాడు అందుకే కళాశీలి.

కళాశీలి 'దృష్టిది, వర్తులమార్గం. ఆద్యంతరహితం.' కళాజీవులు 'సంధ్యాజీవులు, సందేహభావులు వారికి గోడలులేవు'. 'గోడలను పగులగొట్టడమే' వారి 'పని'. ఇన్నాళ్లూ గౌరవింపబడిన సమాజ నిబంధలనీ, విజ్ఞాన కళామూల్యాలనీ (Cultural Values) నాశనం చేసి, ఈ యుగభావాల కనుగుణమైన సాంప్రదాయాలనీ, విజ్ఞాన కళామూల్యాలనీ ఏర్పరచడమే నేటి కళాశీలుల వ్యాపారం. 'అలజడి మాజీవితం. ఆందోళన మా ఊపిరి'. నూతనోద్యమాలూ, నూతనాందోళనలూ ప్రారంభించి, నడిపించడమూ, మానవాభ్యుదయానికీ, విజ్ఞాన నాగరికతాభివృద్ధికీ దోహదం చేసే సర్వకార్యకలాపాలూ నిర్వహించడమూ నేటి కళాశీలి జీవితాశయం. 'తిరుగు

బాటు మా వేదాంతం.' 'రెబెల్' కానివాడు కవికాడని, మానవకోటికి నూతనసందేశాన్ని ఈయలేడని ఇతనివాదం. ఈనాటి వికృత పరిస్థితులమీద తిరగబడి, నూతనపరిస్థితులని స్థాపించడానికి కృషిచేయడానికి, ఈవిప్లవతత్త్వం. 'ముళ్ళూ, రాళ్ళూ, అవాంతరా లెన్ని ఉన్నా ముందుదారి మాది, ఉన్నచోటు చాలును మీాకు ఇంకా వెనక్కి పోతా మంటారుకూడా మీాలో కొందరు!' ఆర్థికజీవి ఉన్న పరిస్థితులతో సంతృప్తిపొందుతాడు. అందులో కొందరు ప్రతికూలం (reactionary) గా కూడా ఉంటారు. కాని, కళాజీవి నమ్మిన ధర్మానికై ముందుకు సాగడానికి ఎంత త్యాగానికైనా సంసిద్ధుడు. "ప్రపంచం మావెంట వస్తుంది. తృప్తిగా చచ్చిపోతారు మీారు. ప్రపంచం మిమ్మల్ని మరిచిపోతుంది." సామాన్య సామాజికజీవిని మానవకోటి స్మరింప నవసరంలేదు—అతడు వారిగురించి చేసినకృషి ఏమీా లేదుకాబట్టి. కాని కళాశీలిని మానవకోటి చిరకాలం గౌరవించి, అనుసరిస్తుంది. మానవాభ్యుదయానికి అతడు చేసినత్యాగం, కృషీ అతన్ని అమరజీవునిగా చేస్తుంది. 'అభిప్రాయాల కోసం బాధలు లక్ష్యపెట్టనివాళ్లు మాలోకి వస్తారు. అభిప్రాయాలు మార్చుకొని సుఖాలు కామించేవాళ్లు మీాలోకి పోతారు." ఇదీ 'కళాజీవి'కీ 'ఆర్థికజీవి'కీ గల 'వ్యత్యాసం'!

ఈ 'వ్యత్యాసం' ప్రపంచసృష్టిమొదలుకొని ఇప్పటివరకూ పరంపరంగా వస్తున్నదే. మానవాభ్యుదయవాదులు సమకాలిక సమాజంచేతా, ప్రభుత్వంచేతా హింసింపబడటం —చరిత్ర మానవాభ్యుదయవాదినే ప్రశంసించడమూ, వింతవిషయం కాదు. సోక్రటీస్ మరణదండన, జాన్ బన్‌యాన్ కారాగారవాసమూ, ప్రాచీన మధ్య కాలములనాటి పాశ్చాత్య శాస్త్రజ్ఞుల కష్ట నిష్ఠురాలూ, వారి చారిత్రక ఫలితాల నిచ్చిన కృషీ, అబ్రహాంలింకన్ తిలక్ గాంధీల జీవితసందేశాలూ, ప్రభుత్వదండనా—ఇవన్నీ కూడా నేడు చారిత్రక ప్రాముఖ్యాన్ని పొందాయి. మానవచరిత్రలో వీరి సేవానిరతి సువర్ణాక్షరాలతో లిఖింపబడతాయి. సమకాలిక ప్రభుత్వమూ, సమాజమూ తాత్కాలికంగా నిరసించినా, విశ్వజనీనమైన, అన్ని యుగాలకూ, దేశాలకూ వర్తించే వీరికృషీ, సందేశాలూ మానవకోటికి నిరంతరమూ ఆవశ్యకమైన పెన్నిధులు.

మానవుని అనుభవం నిర్మించే సంకుచితప్రపంచంలో అతని మనస్సు ఎల్లప్పుడూ పరిభ్రమిస్తుంది. ఆవ్యక్తి ఎక్కడ ఉన్నాసరే, స్వీయానుభవాన్ని మరువలేడు. భూతకాలంలోని అనుభవాలని జ్ఞాపకశక్తి రూపాన్న జాగ్రత్తచేసే శాపంలాంటిది అది. సుందరాతిసుందరమైన ప్రకృతిశోభలూ, ఆనందమయమయిన స్త్రీపురుషుల వదనాలూ, వీనులకు విందుగానుండేసంగీతమూ, సరససల్లాపాలాడే మిత్రులూ—అంతా, క్రూరమయిన భూతవిషయాలిని స్మరణకు తెచ్చే సాధనమాత్రాలే. మహాసముద్రం రీతిగా ఏకాంతవాసం మానవుణ్ణి ఆవరిస్తుంది. ఈ సంకటం నుంచి బయటపడడానికి దరిగానక ఆ సముద్రంలోనే ఈదుతాడు. మిత్రుల సహవాసంకోసం పరితపిస్తాడు; వారి సహవాసంలో అయినా తన కీచీకాదు మాయమవదా అనుకుంటాడు. స్వేచ్ఛాపిపాసి ఐ పరిభ్రమిస్తాడు. అంతా నిష్ఫలం.

అయినా, అంత అసాధ్యంకాదు, ఆనందప్రాప్తి. అప్పుడప్పుడు శారీరమానసికమయిన స్వేచ్ఛకోసం మానవజీవికి తటిల్లత రీతిగా కొన్ని సమయాలు దొరకకపోవు. నల్లమందు అలవాటున్న వ్యక్తి, వృద్ధాప్యంతో వచ్చిన బలహీనతను విస్మరించడానికని అది వేసుకొంటాడు! అవి ఆనంద ఘడియలు కావో! టాగోరు గీతాల్ని చదివి ఆనందించడం, సైగల్ సంగీతాన్ని విని ఆనందించడం — స్వర్గ సౌఖ్యాన్ని చూరగొనడమే. కాని, వింతల్లో వింత, మానవుని వక్రబుద్ధి ఇలాంటివాటిని ఆమోదించదు! ఎవరిది వక్రబుద్ధి? బురదలోపడి కొట్టుకుంటానని తెలిసీ, పైకి తప్పించుకొని రావడానికి ప్రయత్నించని వాడిదా, లేక, బురదలో పాతుకుపోయినా తానున్న హీనస్థితిని గ్రహించి, తప్పించుకొని రావడానికి ప్రయత్నం చేసేవాడిదా?

కాని, ఇందులో రెండోరక మయిన వ్యక్తినే, జీవిత సుగమపథాల నించి తప్పిన వానిగా భావిస్తుంది సమాజం. అతడు సమాజవృక్షాన్ని నాశనంచేసే విషక్రిమిగా వర్ణిస్తారు. అతన్ని జీవితమాధుర్యాన్నంతా పీల్చి పిప్పిచేసి, తిరిగీ ప్రతిసేవ చేయలేని పరాన్న భుక్కుగా చూస్తుంది. అతని ఆలోచనా పథం, స్వప్నాలు, సేవానిరతి, పారలౌకికదృష్టీ సమాజానికి చెప్పరాని విషయాలు. ఇల్లాంటి 'నిరుపయోగులు' పస్తయినా పడుండాలి, లేదా, దేశాంతరం పోవాలి. అంతే.

కళాశీలిమీద ఇల్లాంటివైఖరి సమాజం చూపడానికి ఒకటే సమాధానం కనబడుతున్నది. సామాన్య సామాజికజీవి జీవిత వ్యథలలోనుంచి తప్పించుకొని, భోగరుచిని గ్రహింపలేడు. అతడు, ప్రతివాడూ తనవలే ఉండాలని కోరడం సహజం. ఈసపకథల లోని తోకతెగిన నక్కను బోలి ఉంటుంది అతనివైఖరి. కాని, ఆకథలో చెప్పబడినట్లు కాక, ఈ నాటి వాస్తవప్రపంచంలో 'తోక లేని నక్కలే' జయిస్తున్నట్లు కానవస్తోంది. కవీ, కళాశీలీ, స్వాప్నికుడూ, శిల్పి-తమతమ జీవితాశయాల్ని గూర్చి గర్వించే వీరికి నేటి సంఘంలో ఎక్కడ స్థానం? జడదారులు, దివ్యదర్శులూ గౌరవింపబడే దినాలు గతించాయి. ఈ రోజుల్లో, వారిని చూస్తే సమాజం ఎగతాళి చేస్తుంది. రిప్ వాన్ వింకిల్ మాదిరిగా ఉంటుంది వారి అవస్థ! నలుగురూ వెంటబడి అల్లరి చేస్తారు. ఎక్కడికి వెళ్ళినా అతనికి ఆహ్వానం లేదు. అతన్ని ఏ గొడవా లేకుండా ప్రపంచం బ్రతకనీయదు. అతని జీవితాన్ని దుఃఖమయం చేయడానికి సమాజం యత్నిస్తుంది. సమాజం చేస్తూన్న పని ఘోరమైనదే! కాని, ఈ రీతి గా చేస్తూన్న తమ వినాశకార్యపు దుష్ఫలితాలు భావన చేయక సమాజం తమని నిర్దోషులుగా చూస్తుందని అనుకుంటారు. వారు చేస్తున్న పాపకార్యం ఏమిటి? జీవితాభ్యుదయ సాధనమయిన నూతన కళాసృష్టిని పోగొట్టుకోడమే కాకుండా, సౌందర్య నిర్మాణమూ, కళాసారస్వత సృష్టీ అనే మార్గాలన్నీ కూడా నిరోధిస్తున్నారు! జీవిత వ్యథలో నుంచి తప్పించుకోడానికే కళారాధన. 'కళాశీలి' సుకుమారమైన తన కళాసాధనలో విశ్రాంతి కావాలనడు. అతని హృదయం కళా (శ్రీ) చరణాంకితమూ, ఆనంద ప్లావితమూ అయి ఉంటుంది. విశ్వవీణాధ్వనులను

ఆకర్షించి పునఃప్రదర్శించడానికి చేసే అతని కళాతపస్సు సమాజాభ్యుదయానికే నిజంగా ఉపయోగపడుతుంది. మానవ నాగరికతా పరిణామాన్ని సరిదిద్దగల ప్రావీణ్యం అతని కళాసాధనలో ఉన్నది. కాని, తా నున్న వాతావరణం తనవైఖరికి వ్యతిరిక్తమయితే ఛాయాశక్తులా నిరోధిస్తాడు. అవసరమయితే, సమాజాన్నే వదులుకుంటాడు— 'లోకము తో మన కేటికనీ, లోలాక్షీ పద పోదము' అనే నేటి కవిధోరణిలో. స్వనిర్మితమైన ప్రపంచంలో ఆనందంగా జీవించాలనుకొన్న అతని నాజూకు జీవితాకర్షణని మోటుగా చూడగూడదు. అందుకే ఒక యువకవి

> 'ఏటిమలుపుల ఇసుకలంకల
> ఇల్లు గట్టిన ప్రేమయోగిని
> పట్నవాసం దుమ్ములోనూ
> బ్రతక మంటారా ?'

అన్నాడు. కళాజీవి స్వేచ్ఛాపిపాసి. కళారామంలో ప్రతిదీ ఆస్వాదింప తగినదే. తాను ఆశించిన స్వేచ్ఛ లభించనే లభించింది. షెల్లీవర్ణించిన భరతపక్షివలే స్వేచ్ఛా విహారముచేయవచ్చు. అతన్ని మృత్యుముఖాన్న పెట్టే కత్తెరబోనులూ, జాగిలాలూ అక్కడ లేవు. కాని దుష్టసమాజం ఊరుకుంటుందా? మిన్నూ, మన్నూ ఏకం చేస్తుంది. ఆఖరుకు, ఈ సామాజికవ్యక్తే జయిస్తాడు. భవబంధాలను త్రెంచుకోలేని అశక్తతలో మ్రగ్గి ఉన్న అతడు, తనవలే ఈ ప్రపంచంలోనే జీవిస్తూ ఉన్న మరోవ్యక్తి సుఖజీవనం చేస్తూండడం చూసి, ఓర్వలేడు. జీవితాదర్శాలలో తనకీ అతనికీ బోలెడు వ్యత్యాసం ఉందని గమనించడు. కొన్ని సమయాల్లో సత్యం గోచరించినా, ఏదో 'జెలసీ' సోదరవ్యక్తి ఆనంద సౌఖ్యాన్ని కూల్చమని ప్రోత్సాహపరుస్తుంది.

ఇలాంటి ఘోరకార్యాలలో, ప్రజాశక్తి విపరీతంగా విజృంభిస్తుంది. తత్ఫలితంగా ఈ కళాజీవి జీవితసౌఖ్యం పటాపంచ లవుతుంది. సామాజికజీవి విజయుడయి, సగర్వంగా ఆనందిస్తాడు! ఒక కవి తిండిలేక పస్తుపడి ఉంటే మరోకవి మృతకళేబరాన్ని—వీధి వాకిలిలో దిక్కుమాలి పడి ఉన్న మృతకళేబరాన్ని—కాకులూ, గెద్దలూ తింటూంటే — ఎంత సుందరదృశ్యం ఈమానవులకి! మంచి పని యింది! అందరిలాగూ మసలకూడదూ, మనందరికంటే ఘనుడులాగ సంచరిస్తాడు, పీడితరమా? జీవితంలోని బాధలని అనుభవింపడుట! ఆనందాన్వేషి! మంచిగుణపాఠం నేర్పాం! మంచి శాస్తి జరిగింది! ఇవీ లోకంలో వినవచ్చే మాటలు.

ఈ విధంగా, పొందదగిన శాస్త ఆనందాన్ని కోలుపోతున్నది జీవితంలో ఈసమాజం. సరి ఐనమార్గం కనబడుతూనే ఉన్నది. కాని, బుద్ధి ఆమార్గాన వెళ్లనీయదు. కళోపాసనయొక్క సద్యఃఫలితం తిండిలేక మలమల మాడడమే అని లేనిపోని సామెతలు ప్రచారం చేస్తారు లోకంలో. తలిదండ్రులు, తమ పిల్లలలో ఇలాంటి జీవితవైఖరిపై భయమూ, సిగ్గూ కలిగిస్తారు. మార్గం సుగమమే, ద్వారం తెరిచేఉంటుంది. కాని 'దర్వాజా బంద్ కరో!' అంటారు. తాము కట్టుకొన్న చీకటికొట్లలోనే దేవుళ్లాడడం దారితెలియక వెలుతురు లేక అక్కడే మసులుతారు. సౌఖ్యాన్వేషణలో వెర్రిగా పరిభ్రమిస్తారు. కాని, వారి ప్రస్తుతవైఖరులూ, సాధనాలూ, కళా-స్వతంత్రరీతుల వెగటూ, ఎన్నడు

వారిని చిరవాంఛిత ఆదర్శం పొలిమేరకు కూడా తీసుకొనిపోలే వని మాటి మాటికి గోచర మవుతూనేఉంటుంది. ఆశాజ్యోతి వెలిగించి ఉన్న ఒకేమార్గాన్ని వారు మూసి వేశారు కాని, మానవుడు చేసినపనినీ, అన్న మాటనూ ఉపసంహరించుకోడు! ప్రతిష్ఠావాంఛి అయిన మానవుడు విషాదజీవి! అనవసర మయిన ప్రతిష్ఠకోసం ప్రాకులాడి, జీవిత మూల్యాలని తనకు కాకుండా చేసుకొన్న మానవుడు, అవివేకి, జీవితంలో దుఃఖాను భవం పొందుతాడని బుద్ధిమంతు డనుకోవాలి.

Riches I spurn with contempt,  
Love my heart cannot ensnare,  
Power my soul cannot tempt,  
But for poesy I do care  
For it's so divine and so rare!  
Given it, misery I can bear.  
Let him, the fool call me vain,  
Idiotic and lacking in sense,  
So much as a glance at me let him not deign;  
I know he is miserably wrong,  
The spark of life will not hold long,  
The while it lasts let it burn bright and intense.  
After he and I have ceased,  
Oblivion will swallow him quite,  
But my name in work will increase.  
Posterity, I'm sure, will be pleased  
With the melody and hope-yielding might  
Of my verse and its pain-healing ease.

'The song of the deathless bard.'

They it is who shatter the silences  
To music: poets, painters, servants whose labors  
Build and beautify being; they it is  
Who love their neighbours.

—"Lovers of Men."



# స ం త మ స ము

శ్రీ బ్రహ్మజోస్యుల శ్రీరామమూర్తి

దారియు తెన్నుఁఱుంగని సుధాకరచేష్టల వెల్లిబుచ్చు నం
ధ్యారుణకాంతి సంగతు లొయారము నొందినమాడ్కి దోపగ౯
వారిజ దుఃఖవారి పరివారపరీవృత గర్విణీమనో
హారిణి నై సముల్లస విహారములం గొని విశ్రమించెడి౯.

అంబురుహాప్తు డంత నవరాద్రిని జేరి గుభుల్ గుభుధ్వనీ
చుంబితమైన యబ్ధి పరిశోధనలం బరిపూర్తి నేయగా
నంబర దిగ్విభాగపుటమందున బొబ్బలు పొక్కినట్లు ల
య్యెం బరితప్తవార్ధికణ హీనగతి న్నిరసించు తెక్కుల౯.

శీలము లేని భానుతరశీలురకు౯ స్తవనీయకామినీ
శీలము లొటజేసి సరసీరుహకాంతయ చందమామయై
నీలరుచిప్రమోద నవనీరదపంక్తుల నడ్డగించి తే
జోలసితుండు బోయిన యశోరథము౯ వెనుకాడ జూచెడి౯.

తమ్ముల చెల్మికానికిని దాగుడుమూత లనంగ దోచునం
దమ్మును దోప మార్గణవిధానమునందున పిల్లకాయ బె
త్తమ్ము నెఱుంగ డంచు కరతాళ కుహూకలరావ పక్షివ
ర్గమ్ముల సాయముం బడసిగాదె తమోభరు డాక్రమించెడి౯.

మాటికిమాటికి౯ మొగులమాటున జేరి రవల్ రగుల్చు నం
ధ్యాటవు లారునోయని జనాన్వయ మెల్లను తేరి చూచు నా
రాటములోన నద్దె తిమిరార్పణ మయ్యెఁ గన న్నభోపరి
స్ఫోటకరంధ్రజాలముల బోనియ మించిన స్వర్గసంపద౯.

కంజదళమ్ములం బడి చికాపికలై వరిపొట్టుమాడ్కి ముం
దంజల వేయుచుండిన హిమాకరజాలము లాగ్రహింపగా
మంజుల మందహాసమయ మంజరులం దనరారు తన్మనో
రంజకమూర్తి షోడశకళావిభవమ్ముల మాటు జేరెడిన్.

ఆకసమెల్ల బ్రద్దలయిన ట్లది యు న్నతికింప బూనగా
లేక తమోభరాకృతవిలిప్తము గావగజేసి గాయముల్
జీకువడంగ నేరమికి చీల్కల సున్నపు బొట్లు బెట్టి ప
ద్మాకరవైరిమండలము నల్లదె తారక లాక్రమించెడిన్.

ఆదిజుడైన బ్రహ్మకృతి కాస్పదమై ఎటుదిప్పి చేటుగా
బోదనుభంగి మింటిపాలముల్ పెనుపాదులు రక్షసేయ లో
కాది సమస్తనేత్ర చతురంగబలంబుల కుత్తరంబులై
మోదముగూర్చు సున్నముల బొట్లొనగూర్చెడు తారకాత్మతన్.

భానుడు క్రుంగునంతనె ప్రభాకరమార్గము లావరించి తా
రానివహమ్ము లయ్యెడ పరాకును జెందగ శోభనాలయ
శ్రీనిభమైన ప్రాకృత నిశీథినిలో దెగ యీాదియీాది దుః
ఖానతమైన పద్మినికి నయ్యెడబాటును గప్పిపుచ్చుచున్.

చుక్కలు చంద్రమండలవిశోషిత కాంతుల చెల్మిసేయ నా
ప్రక్కనె సంతరించిన శరన్నుత నీరదపంక్తులున్ యశో
భాక్కులవోలె బూరుగులపాలిటి నైజగుణమ్ము సూప బెం
పెక్కెడు నాకసమ్ము వనకేప్సితముల్ బదులీయ జూచెడిన్.

నీరము పట్టిమంచ మయి నీరసమూహములైన శారదా
కారములున్ అలంకృత వికారములై తిమిరాన్వయంబు బం
గారపు బొమ్మలై యమరగా సరియానని యెంచి శోషితాం
భోరుహతాపబంధుర సముచ్చయమైన కళంకమూర్తియై.

ఒక తెలిమబ్బు డాసి మఱియొక్కట జేరి మొగంబు ద్రిప్పి నే
రాకజలదంబుచాటున మహోత్సవలీలల నాశ్రయించి సే
వకతిమిరాన్వయుల్ గొలువ వచ్చినచో మరలించి యుంగజ
ప్రకటితచేష్టుడై భువికిఁ బఱ్వగ జూచెడు చందురుం డదే.

ఇంచుక సిగ్గులేక విరసించిన నీరజస్రవంతి గా
వించిన వీ విరాగ పదవీపథవమ్ము లనం బయోధరా
భ్యంచితమైన పూతకలశాంబుధిఁ దేలిన తెప్పలే నిశా
సంచయహాత్మలందు నవసానవిముక్తిని జేయుచుండెడిన్.



# మీరు మనోహరమైన చర్మమును పొందవచ్చును

వలపునిచ్చు సుందరమైన చర్మమును ప్రతి యొక స్త్రీ పొందవలెను. అయితే స్త్రీయొక్క చర్మమును మనోహరముగా నుంచుటకు జాగ్రత్త అవసరము. గాలిదుమ్ముసోకుటవల్ల చర్మము ముతకగా కళాహీనముగా అగును.

చర్మమును క్రొత్తగాను, శుభ్రముగా, లేతగా నుండుటకు, ప్రతిదేశములో **పాండ్సు క్రీము** ను స్త్రీలువాడుదురు. అది చర్మరంధ్రములలో దూరి, మురికిని, నూనెవిశేషమును తొలగించును. పట్టికడుగుట చాలదు. పాండ్సుక్రీము సీసానుకొనుడు. మీవేళ్ల చివరలతో క్రీమును, మీ చర్మముమీద రాయుడు. మృదువైన గుడ్డలతో దులుపుడు. మరియు కొద్దిగా వేరేక్రీమును లేలికగాపూసి, రాత్రంతయు ఆవశ్యమైన పొరను ఉంచుడు. ఈమోస్తరగా ఒక పదిహేనురోజులు రాత్రులయందు వాడుడు. అప్పుడు మీ చర్మము మృదువుగా లేతగా అవుతున్నట్లు మీకు తెలియగలదు.

పగలు గాలి, దుమ్మునుండి రక్షించుటలో శ్రేష్టమైనది
పాండ్సు వ్యానిషింగ్ క్రీము.

పాండ్స్ క్రీములు అన్నిగొప్ప స్టోరులలో దొరుకును, లేక పాండ్సు పి॥ ఒ॥ బాక్సు 144, బొంబాయి వారికి వ్రాయుడు.




# పాండ్స్ క్రీమ్

# మీ రా బా యి

శ్రీ మండి నరసింహం

గంగాసింధునదులు ప్రవహించు మైదానప్రదేశమతి విశాలమై, ఫలవంతమై, జనాకీర్ణమై యొప్పుచుండును. ఇదియే వేదశాస్త్రములందు మిక్కిలి కొనియాడఁబడిన పుణ్యభూమియగు నార్యావర్తము. ఇదియే రామకృష్ణాదిమహాపురుషులు, ధర్మసంస్థాపనార్థ మవతరించిన పవిత్రస్థానము. ఈ ప్రదేశజనులకు 'హిందీ' ముఖ్యభాష. ఈభాష సంస్కృత ప్రాకృతవికారము. ఈదేశమందలి జానపదుల పదములందును, పశుపాలురు మందలు మేపుచుఁ బాడుగీతములందును, భక్త్యావేశపరులు దేవళముల భగవంతుని ధ్యానించుకీర్తనలందును, సంగీతవిద్యాప్రవీణులు రాజసభాంతరముల నాలాపనము నేయు సుశ్రావ్యగేయములందును, నృత్యగీతవాద్యవిశారదలగు వేశ్యలు వినోదసభలఁ బాడుపాటలందును నొక్కవ్యక్తినామము తఱచుగఁ జెవిని బడుచుండును. ఆవ్యక్తియే మీరాబాయి. ప్రతికీర్తనయందలి చరమచరణము మీరాబాయినామముతో నలరారుచుండును.

ఉత్తరహిందూస్థానమున నెవరినేని మీరాబాయి చారిత్రము తెలుపఁగోరి యడిగితిమేని ప్రత్యుత్తరమిచ్చునావ్యక్తి బాలుఁడుగాని, బాలికగాని, వృద్ధుఁడుగాని, వృద్ధగాని మీరాబాయినామము చెవి సోఁకినంతనే, భక్త్యావేశముతో తల వంచి చేతులు జోడించి యామె యొక మహానుభావురా లని ప్రత్యుత్తరమిచ్చును. మీరాబాయి నెఱుంగనివారు లేరు. ఆబాలగోపాల మామె నెఱుంగుదురు. ఎఱుఁగుటయే కాదు, అభిమానముఁజూపెదరు, ఆశ్చర్యము నందెదరు, ఆరాధించెదరు, దేవతనువలెఁ బూజించెదరు. అట్టిది మీరాబాయి.

ఇంతియేకాదు. భక్తురాండ్రలో నీమెను మించినవారు లేరు. కవిత్వమం దీమె యసాధారణప్రజ్ఞఁ జూపినది. భారతదేశమందలి కవయిత్రులలో నీమె వన్నెకెక్కి యగ్రస్థాన మాక్రమించినది. పౌరుషవంతమగు, రాజపుత్రస్థానమున నొక గొప్పసంస్థాన మేలు రాజపుంగవునకు నీమె పట్టమహిషి. అట్టి మహదైశ్వర్యమును తృణప్రాయముగఁ ద్యజించి కాషాయాంబరముల ధరించి రాజాంతఃపురమును వీడి యనంతంబగు మనోహర దివ్యగీతముల నిష్టదైవతమగు శ్రీ కృష్ణునిఁ గీర్తింపఁ జొచ్చెను.

## ౧

వింధ్యభూధరమున కొకింత పశ్చిమోత్తరముగ పర్వతాకీర్ణమగు నొక ప్రదేశ మున్నది. రాజపుత్త్రులను నొక క్షత్రియకులమువా రందధికముగ నివసించుటచే, నా ప్రదేశమునకు రాజపుత్రస్థానము నామము వచ్చినది. ఈ రాజపుత్రులు స్వాతంత్ర్యప్రియులు, శస్త్రోపజీవులు. ధైర్యసాహసాది సద్గుణములు పురుషులందే గాక స్త్రీలయందును గూడ నధికముగ వ్యక్తమగుచుండును.

రాజపుత్రస్త్రీలుఁ గూడ బాల్యమునుండియుఁ బురుషోచితములగు నశ్వారోహణ గజారోహణములందును, విలువిద్యయందును, మల్లవిద్య, కత్తులతోసాము చేయుట మొదలగు విద్యలందును సుశిక్షిత లగుట యాచారము. కొన్నిక్లిష్ట సమయములందు శస్త్రాదుల ధరించి విజయలక్ష్మిని తమ నాథుల కరాలింగనమున కొడఁగూర్చిన వీరనారీమణులు లెక్కకు మీరియుండుట చారిత్రపాఠకులకు విశదమే.

రాజపుత్రస్త్రీలు ప్రాణముకన్న మానమున కెక్కుడుప్రాధాన్య మిత్తురు. అవమానమును వీరు సహింపరు. అవమాన మాసన్నమగునని హృదయకుహరమున నేమాత్రము సందియము దోఁచినను, వారు తమ ప్రాణములఁ దృణప్రాయముగఁ జూచి శరీరము నగ్నికాహుతి గావించెదరు.

రాజపుత్రులు హిందూధర్మము నాచరించెడి వారు. వేదశాస్త్ర పురాణములును, ప్రస్థానత్రయమును వీరికి ప్రమాణగ్రంథములు. గృహస్థులకు ధర్మశాస్త్రము లందు విధింపఁబడిన షోడశకర్మలు వీరిచే నాచరితములు.

రాజపుత్రులు స్వాతంత్ర్యప్రియు లగుటచేత, నీ దేశమున స్వతంత్రరాజ్యము లనేకములు వెలసినవి. ప్రతి రాజ్యము నొక రాజపుత్రరాజన్యుని పాలనమున నుండెను. వైశాల్యమున నీరాజ్యములలోఁ గొన్ని మిక్కిలి చిన్నవయ్యుఁ బరిపాలనమున, రాజ్యాంగములన్నియుఁ గలిగి పరిపూర్ణతను జూపుచుండును.

## 3

పర్వతాకీర్ణమగు రాజపుత్రస్థానమున 'మెంతా' నామమునఁ బరఁగు నొక చిన్నపల్లియ మీరాబాయి జన్మస్థానము. ఈమె తలిదండ్రులు కుటుంబగౌరవమున నేమి, కులసంప్రదాయమున నేమి, రాజపుత్రస్థానమువందెల్ల గౌరవింపఁబడుచుండిరి. పౌరుషవంతమగు రాజపుత్రస్థాన రాజ్యములందెల్ల మీరాబాయి యద్వితీయ సౌందర్యరాశి యని పేరొందెను. "చితోరు" ప్రభువు రాజపుత్రమున సార్వభౌముఁడు. వానియంతఃపురము, దేశమందలి మనోహరకుసుమ కోమలాంగులచేఁ బ్రకాశించుట యాచారము. తదనుగుణముగ 'చితోరు' యువరాజగు కుంభసింహునకు మీరాబాయి యర్ధాంగి యయ్యెను. మహారాణామరణానంతరము 'మేవారు'నకు రాణి యయ్యెను.

బాల్యమునుండియు భార్యాభర్త లిరువురు నసమాన కవిత్వవిశారదులు. కుంభసింహునకు కాళిదాసవిరచిత శాకుంతలము మహానందముగూర్చు ముఖ్యగ్రంథములలో నొకటి. ఆస్థానపండితులతో నాతఁడు తఱచుగా నాపుస్తకమందలి రసవంతభాగములఁ జర్చ చేయుచు వారి విమర్శఫలితముగఁ దేలిన శృంగారాది రసామృతమును గ్రోలుచు నానందపరవశుఁ డగుచుండును. బాల్యముననే క్షత్రియోచితవిద్యల నభ్యసించిన వాఁ డగుటచే, యౌవనావిర్భావమున కావ్యనాటకాదులందలి రసగ్రహణమునకుఁ దగిన మనఃపాటవము వాని కబ్బెను. యువరాజపదవియందే రాజ్యపాలనానైపుణ్యము నలవఱచుకొనుటచేఁ బ్రజాపాలనము వాని కెన్నఁడును క్లిష్టసమస్యలఁ గలుగఁజేయ దయ్యెను. అందుచే రాజ్యవ్యవహారములు చక్కఁబెట్టుకొనినపిదప మిగిలిన కాలమంతయు సారస్వతవిషయక చర్చలందే గడపుచుండెను. రాజపదవికన్న సారస్వతచర్చయే వానికి విశేషమోదమును గూర్చుచుండెను.

మీరాబాయి చిన్ననాఁటనే పితృగృహమున సంగీత సాహిత్యముల రెంటియందును బ్రజ్ఞ సంపాదించెను. పండితసహవాసముననో, స్వయంకృషివలననో, ప్రాక్తన సుకృత విశేషముననో గాని మీరాబాయికి మనోహర సంగీతము వశమయ్యెను. గురుసన్నిధిని శ్రద్ధాభక్తులతోఁ గావ్యములు పఠించుటంజేసి ప్రౌఢమగు సాహిత్యమీమె కబ్బెను. భర్తృగృహమునఁ బతియనురాగమువలన నీమె సాహిత్యము దోహదమంది ప్రవర్ధమానమగుచుండెను. ఈమెకు వేదవ్యాసకృత భాగవతపురాణము మనశ్శాంతినిఁగూర్చు పరమౌషధము. అందు దశమస్కంధ మీమెకుఁ బ్రియతమము. గోపీజనవిహారాసక్తుఁడగు శ్రీకృష్ణుని చర్యల వర్ణించుభాగముల కుంభసింహునితో నీమె తఱచు చర్చించుచుండును. దశమస్కంధ మంతయు భర్తకు శృంగారభూయిష్ఠముగాఁ దోఁచుచుండ, మీరాబాయివ్యాఖ్యాన ముత్కృష్ట వైరాగ్యమును వెల్లడించుచుండెను. ఆమెమతమున శ్రీకృష్ణుని చర్యలన్నియు శుద్ధవైరాగ్యబోధకములు. సహేతుక మగు నామె వ్యాఖ్యానమును భర్త ఖండింపలేకుండెడి వాఁడు. ఇందుచేత నొకొక్కప్పుడు మిథ్యామాత్సర్యమును వహించి కేవలశృంగారరసప్రతిపాదకమగు శ్లోకముల వ్యాఖ్యానముకొఱకు భార్యకిచ్చుచుండుటయు, నామె సునాయాసముగ నాశ్లోకముల నన్వయించి విశుద్ధవైరాగ్యార్థ బోధము గావించుటయుఁ జూచి యామె మేధాశక్తికి అచ్చెరు వందుచుండెడివాఁడు. దంపతులు కలసి పద్యముల రచించుచుఁ గావ్యములఁ బఠింపుచు విశేషకాలము గడపుచుండిరి. కాలక్రమమున వారివారి కవితావైశద్యము వేఱువేఱు మార్గముల వృద్ధిగాఁ జొచ్చెను. రాజపుత్రుని కవిత్వ మైహిక భూమిని, వారిభార్యకవన మాముష్మికాంతరిక్షమునను వ్యాపింపఁదొడఁగెను.

భగవంతుఁడగు శ్రీకృష్ణునిగూర్చి యామె విశేషముగఁ జదివెను. బృందావనసుందరగోపాలుఁ డీమె కిష్టదైవము. బాలకృష్ణుఁ డంతటను నిండియుండె నని యామెవిశ్వాసము. ఇతఁడే ప్రేమకు గని, ఇతఁడే విశ్వకర్త, ఇతఁడే బ్రహ్మాండమున కధిపతి. ఇట్టి పురుషుని ప్రేమింపనిదే, వానియెడల భక్తిఁ జూపనిదే, మానవు లిహపరసుఖములఁ బొందనేరరు. అట్టి సుఖప్రదాతయగు శ్రీకృష్ణుఁడు నిజాకృతితో నామెకు గోచరించుచుండెను. ఆమె తానొక గోకులములోని గోపాంగనయని భావించుకొనుటయేగాక నిశ్చయమని గూడ నమ్ముచుండెను. తదనుగుణముగఁ దాను శాశ్వతానందపదవి ననుభవించుచుండెననికూడ విశ్వసించుచుండెను. ఆమె రచించు గీతములన్నియు భగవదంకితములే. కృతిపతి సశరీరుఁడై వెలయు బృందావనవిహారమోహనబాలగోపాలచూడామణిగాని చేతనారహిత శిలానిర్మితవిగ్రహరూప శ్రీ కృష్ణుఁడు కాఁడు. కీర్తన లన్నియు నిట్టిమూర్తికే యంకితము చేయఁబడెను. ప్రతికీర్తనయు మోక్షమునకు భక్తియే సాధన మని బోధించుచుండును.

## ౪

ఇట్లు కొంతకాలము గడచెను. మీరాబాయి మహారాణి యయ్యెను. అనురాగముతో భర్తయు నామె కోరికలనెల్ల నెఱవేర్చుచుండెను. ఆమె కెట్టి లోపమును లేదు. దాసదాసీజన మామె కనుసన్నల మెలఁగుచుండెడిది. ప్రాపంచికసౌఖ్యము లన్నియు నామె కున్నవి. పతియు నేకపత్నీవ్రతుఁడు. అతఁడు ద్విగుణీకృతానురాగముతో నామె నాదరించుచుండెను. రాజ్యము స్వచక్ర పరచక్ర భయము లేక సుభిక్షముగ నుండెను. ఇట్టి నిరుపమానసకలసౌఖ్యముల ననుభవించుచున్నను, మీరాబాయివదనము కించిత్తు ఖేదమును సూచించుచుండెను. అట్టి ఖేదమున కామె కారణ మారయలేకుండెను. ఏదియో ఘనకార్యమును జేయ నెంచి, యద్దాని సాధింపనేరక ఖిన్నతను బొందిన వ్యక్తికరణి నామె గానఁబడుచుండెను.

చిన్నినాఁటనే రేకెత్తి ప్రవర్ధమానమగుచుండిన భక్త్యావేశము క్రమక్రమముగ మీరాబాయినిఁ బ్రాపంచికసుఖములనుండి దవ్వదవ్వుగాఁ దీసికొనిపోవుచుండెను. శరీరాలంకారములనెల్ల మఱచెను. గృహకృత్యముల, నన్నపానముల మఱచెను. నిద్రమఱచెను. శయ్యాదిసౌఖ్యముల మఱచెను. ఇంతయేల? ప్రాపంచికవిషయముల నెల్ల మఱచెను. ప్రతిదినమును రాత్రింబవళ్లు చెలికత్తియలతో భగవన్నామసంకీర్తనము సేయుచుఁ గాలముఁ గడపుచుండెను. ఆమె గీతారచనము నిరుపమానము. కంఠము శ్రావ్యతమము. సంగీతనైపుణ్యము అద్వితీయము. ఇందుచేత నీమె గీతములు భక్తిని వెదఁజల్లుచు మృదువగు శోకరసమును ప్రతిఫలింపఁజేయుచు, నామె హృద్గతమగు గాఢవిరక్తిభావమును బ్రదర్శింపుచున్నవి. మధుర గానలహరి నామెచెలికత్తియలు మునిఁగిపోయి తన్మయ లయి, యామెపాటుగ నాట నాడుచుఁ బాడుచు బాహ్యమును మఱచిపోవుచుండిరి.

'చితోరు' రాజాంతఃపురమున నెంతకాల మిట్లు పరమభక్తురాలగు మీరాబాయి యుండఁగలదు? గాఢనిర్బంధసహితాంతఃపురము వికసించి పరిమళమును వ్యాపింపఁజేయుచున్న భక్తిని నాలుగుగోడలనడుమను బంధింపఁజాలదు. భగవంతుఁడగు శ్రీకృష్ణునిఁ జూడక ఆమె యుండలేకపోయెను. పురిలో శ్రీకృష్ణాలయమునకు భక్తియే యామెను దీసికొనిపోయెను. స్వామిసన్నిధిని బాటలు పాడెను. ఆటలాడెను. ఆవేశమున నైమఱచెను. మూర్ఛఁ జెందెను. చెలికత్తియలు తొందరతో నామెను బట్టుకొని యుపచారములు చేసి స్మృతిఁ గలుగఁజేసి యింటికిఁ దోడ్కొనిపోయిరి.

నాఁడుమొదలు ప్రతిదిన మామె దేవాలయమున కేఁగుచు, మనోహరగీతముల భగవన్నామమును శ్రావ్యముగఁ బాడుచుండెను. ఆమె కీర్తనలు శ్రోతలందు నిజమగు భక్తిని రగులఁజేయుచుండెను. ఇందుచే శ్రోతలు పదులు, వందలు, వేలుగ నానాదిశలనుండియు వచ్చి కర్ణపేయముగ నామె పాటలను వినుచుండిరి. దైవసన్నిధిని హరిభజనమందే విశేషకాలమును గడపుచుండుటచేత నంతఃపురవాస మ్మామె కరుదయ్యెను. వందలకొలఁదిగ భక్తు లామెను గనుపెట్టియుండిరి. వేలకొలఁదిజను లామె ప్రఖ్యాతిని భారతదేశ దిశాంతములఁ గూడఁ జెప్పుకొనుచుండిరి.

౫

మీరాబాయి ప్రఖ్యాతి మొగలాయీ దర్బారునఁగూడ మాఱుమ్రోఁగుచుండెను. ప్రపంచవిఖ్యాతుఁడగు నక్బరుచక్రవర్తి ఢిల్లీనగర మేలుచుండెను. ఈతఁడు జనులసుగుణములను గ్రహించుటలో మిగులఁ సుశీలుఁడు. కళలందేమి విద్యలందేమి యారితేరిన పండితు లీతని యాస్థాన మలంకరించియుండిరి.

మీరాబాయిఖ్యాతి మొగలాయీచక్రవర్తిచెవుల బ్రవేశించి యామె కంఠమాధురిని వినఁగోరఁ బురిఁగొల్పెను. చిత్తోరుమహారాణా, మొగలాయీప్రభువునకు లొంగకపోయినను బద్ధవైరము మాత్ర మాతనితోఁబెట్టుకొనలేదు. అయినను మీరాబాయి హైందవనారీమణి. సామాన్యస్త్రీగాదు. ఉదయపురాధీశుని పట్టమహిషి. ఒకమహమ్మదీయచక్రవర్తి పూర్వ ముదయపురప్రభ్విని పద్మినిం గోరి పరాభవ మందినసంగతి నక్బరుచక్రవర్తి మఱవలేదు. భారతనారీమణులు - అందు ముఖ్యముగ రాజపుత్రస్థానవీరనారీమణులు — అవమానముకన్న మరణమే మే లని నమ్ముదురు. హైందవౌన్నత్యము, స్త్రీశీలపాతివ్రత్యమునను, బురుషులు వారి యెడఁ జూపు పవిత్రభావమునను నిమిడియున్నది. మహమ్మదీయుని స్పర్శవలనఁ గలిగిన యవమానమును, మానవతి యగ్నిఁ బ్రవేశించి పాపుకొనును. పద్మినియుఁ గోటలోని వనిత లందఱును నగ్నికాహుతులై తమతమ మానములఁ గాపాడుకొనిరని కూడ నాతఁ డెఱుంగును. మీరాబాయిసంగీతనైపుణ్యము వినుటకు సెలవిమ్మని మహారాణా నడుగుట, సమస్త రాజపుత్రస్థానములతో కయ్యమునకుఁ గాలుద్రవ్వుట యగును. ఆస్థానసంగీతవిద్వాంసుఁడగు "తానసేను"ని తో నీవిషయమై యక్బరుచక్రవర్తి యాలోచనకుఁ జొచ్చెను.

అక్బరు—సంగీతాచార్యా! వింటిరా? రాజపుత్రస్థానమున నొక భక్తురాలు సంగీతమం దసమాన పాండిత్యము గడించినదఁట! ఆమె కంఠమాధురినిఁ దనివితీరఁ గ్రోలినవారు తన్మయులై ప్రాపంచికవిషయములను మఱచి దివ్యానందపరవశు లగుచున్నారఁట!

తానసేనుఁడు—చక్రవర్తీ! పగలంతయుఁ దమ యాస్థానమున గీతామందిరమునఁ గాలము గడపుచున్న నా కెట్లు విదేశవార్తలు తెలియఁగలవు?

అక్బరు—ఈమధ్యనే మనచారులు సమీపరాజపుత్రరాజ్యములకు వార్తాగ్రహణార్థము, మన విదేశమంత్రిచేఁ బంపఁబడిరి. వారు వివిధరాజ్యములఁ బ్రచ్ఛన్నవేషధారులై సంచరించి రాజ్యపాలనాసంబంధమగు వార్తలతోపాటు నీవిశేషముఁగూడ మన విదేశమంత్రి కెఱింగించిరి. ఆతఁడు నిన్ననే నా కీసంగతి శ్రుతపఱచెను.

తాన—ఆభక్తురా లెవరు? ఆమెవంశ మెద్ది? దేశ మెచట?

అక్బ—ఆమె పేరు మీరాబాయియఁట. రాజపుత్రస్త్రీ యని తెలిసినది. అంతియకాదు. ఆమె ఉదయపురమహారాణాను పట్టమహిషియఁట.

తాన—ఆమెప్రజ్ఞ తమ కెట్లు విశదమైనది?

అక్బ—మనచారులలో స్వామిదత్తుఁడు సంగీతవిద్వాంసుఁడు. ఆతఁడే ప్రత్యక్షముగ నామె గానమాలకించి, వైహికచైతన్యమును గోలుపోయెనఁట. సోదరచారుఁడు వానికి వైహికప్రబోధముఁ గలుగఁజేసి తీసికొనివచ్చెనఁట.

తాన—స్వామిదత్తునిచే శ్రుతపఱుపఁబడిన సంగతియం దసత్య ముండదు. నిజముగ నామె గొప్ప భక్తురాలే గాక సంగీతవిద్యానిధియునై యుండవలయును.

అక్బ—నామానస మిప్పు డీభక్తురాలి గానామృతమును విన నుత్సహించుచున్నది.

తాన—ఉదయపురాధీశ్వరుఁడు తమ సామంతకోటిలోనివాఁడు కాఁడు. ఆతఁడు శత్రుకోటిలోనివాఁడును గాఁడు. అందుచేతఁ దమ కోరిక నెఱవేఱుట దుర్లభ మని నాతలంపు.

అక్బ—కుంభసింహుఁడు సామంతుఁడైనను గూడ మనకార్యము నెఱవేఱుట దుర్లభమే యగును. మీరాబాయి సామాన్యస్త్రీ గాదు. ఆమె మహారాణిఁ. మనపారితోషికము లచటఁ బనికిరావు. రాజపుత్ర

స్త్రీ లసమానమానవతులు, పరమసాహసికలు, పతివ్రతా తిలకములు.

తాన—సేవరు బహిరంగముగాఁ బోయి యామెపాటవినుట కుపాయము లేదు. సైన్యబలముచే నుదయపురమును జయింపగలరు. మీరాబాయిని చెఱ పాల నుంచఁగలరు. కాని యామె గానమును మాత్రము మీరు వినలేరు.

అక్బ—నిజమే. వారి రాజ్యమును జయించుట మనపని కాదు. అందుచే కార్యసాఫల్యమునకు వేఱు విధ మాలోచింపుఁడు.

తాన—పరివారరహితముగ మన ముద్దఱము మను ప్రచ్ఛన్నముగ రాజపుత్రస్థానమున కేగి సన్యాసి వేషధారులమై శ్రీకృష్ణాలయమున నున్నచోఁ దమ కోర్కె నెఱవేఱవచ్చును. ప్రతిదిన మామె శ్రీకృష్ణుని సన్నిధిని గానామృతము వర్షించునని గదా వేగులు చెప్పిరి!

అక్బరు—మంచి యుపాయ మాలోచించితివి. కాని నాకొక్క సందియము కలుగుచున్నది. మహమ్మదీయుఁడవను నేను పవిత్రభావముతోఁ జూడఁబడు దేవాలయము మాఱువేషమునఁ బ్రవేశించుటకైన నొప్పు కొందునుగాని, రాజపుత్రస్థానమున మన నిజస్థితి బయలుపడిన ప్రాణహాని గూడ సంభవింపవచ్చును.

తాన—రాజపుత్రస్త్రీల నవమానపఱచుటకుఁ గాని, వారి మానభంగముఁ జేయుటకుగాని మన మచటికిఁ బోవుట కాదు. పవిత్రభావముతో నామెభక్తిరస సంగీతమును వినుటకుమాత్రమే పోవుచుంటిమి. కావున నట్టిభయమున కవకాశము లేదు.

అక్బ—భయము వెనుకకు లాగుచుండ, నుత్సాహము ముందునకు లాగుచున్నది. ఉత్సాహము బలీయమైనది. వలయునేర్పాటు లన్నియు నీవే చేయుము. రేపే ప్రయాణమునకు సర్వము సిద్ధపఱుపుము. ఈసంగతి మన రాజ్యమునగూడఁ బరమరహస్యముగ నుండవలయునుసుమా!

తాన—చిత్తము. ప్రభూ! ప్రయాణమునకు సర్వము సిద్ధము చేసెదను.

తదాలోచనాఫలితముగ చక్రవర్తియుఁ దానసేనుఁడును హిందూసన్యాసివేషధారులై యుదయపుర శ్రీకృష్ణాలయమునఁ బ్రవేశించి యచట మీరాబాయి సంగీతమును వినుటకు నిశ్చయించుకొనిరి.

## ౬

మఱునాఁటి యర్ధరాత్రమునఁ జక్రవర్తియు, సంగీతాచార్యుఁడును బ్రయాణమునకు వలయువస్తువుల నేకరించుకొని యుత్తమాశ్వముల నారోహించి రాజపుత్రస్థానమార్గమునఁ బోఁజొచ్చిరి. మాఱువేషముల బ్రయనము సాగించుచుఁ గొలఁది దినములలో నుదయపురి సీమఁ జేరఁగలిగిరి. ఉదయపురి నొకసత్రమున విశ్రమించి, వేకువనే లేచి, వారు కాషాయాంబరముల ధరించి మేన విభూతి నలఁది, యురుత రుద్రాక్షమాలికలఁ బొంకుపఱచి దండకమండలువులఁ బూని, బ్రహ్మతేజము ముఖముల తాండవింపఁ గైలాసనాథుఁ డిరువేసములఁ గైకొనెనా యనుసందియము చూపరులకుఁ గొల్పుచుండిరి. వా రాగ్రామమున సద్బ్రాహ్మణ గృహము లైదింట మాధుకరవృత్తి భోజనాదికముల గ్రహించి సత్రముఁ జేరుకొని భైక్ష మొకమూలఁ బాఱవైచి, తమతోడనే తెచ్చికొనిన యాహారము భుజించి వ్యాఘ్రాజినముల విశ్రమించిరి. ఆరాత్రి శ్రీకృష్ణాలయ మందే విశ్రమింప నిచ్ఛతో నచ్చటికిఁ జని యందొక మంటపమం దాసీనులైరి.

మీరాబాయియు నలవాటుచొప్పున నాఁటి రాత్రిగూడ గృహకృత్యములఁ దీర్చికొని చెలికత్తియ లిరువురు వెంటరా నాలయముఁ జొచ్చెను. గర్భాలయమునఁ బూజాదికముల నెఱవేర్చి స్వామిప్రసాదమును గ్రహించి మీరాబాయియు చెలికత్తియలును ముఖమంటపమున నాసీన లైరి. ఇంతదనుక వేఱొకమంటపమున విశ్రమించియున్న సన్యాసు లిరువురును ముఖమంటపముఁ జేరి వారివేషముల కుచితముగు తావులఁ గూరుచుండిరి. అర్చకుఁడును వారికి భక్తితో స్వాగత మిచ్చి, ఉదయపురప్రభ్వి స్వామిసన్నిధి భజనగావించునదనియు, విననిచ్ఛగింతురేని తమ కెట్టి యభ్యంతరము లేదనియు నెఱుకపఱచెను. సన్యాసులును నారా

యఁణయని పలుకుచుఁ దమ యంగీకారమును సూచించిరి.

సన్న్యాసులవలన నిట్లు ప్రోత్సహింపఁబడి మీరాబాయియు చేటికనుండి వీణియ నందికొని కోకిలనుఁ దిరస్కరించు పంచమస్వరమున కంఠ మెత్తి పాడఁదొడఁగెను. గానము నిరుపమాన మని చెప్పుట పునరుక్తియగును. పశుపక్ష్యాదులేగాక మానవులుగూడ చేష్టలఁ దొఱంగి గానసుధను కర్ణద్వయమునఁ గ్రోలుచు నిష్కళంకానందాబ్ధి నోలలాడుచుండె నని చెప్పుట యతిశయోక్తియుఁగూడ కాదు. మూలాధారాది షట్చక్రంబుల రేచక పూరక కుంభకవిధుల వాయుధారణమున భేదించికొని భ్రూమధ్యభాగంబున నిశ్చల ధ్యానము నిల్పి, సహస్రారమున వెలుఁగుచుఖండ దేదీప్యమాన పరమాత్మస్వరూపుని జ్ఞాననేత్రమున వీక్షించి యపారానందవారాశి నోలలాడు రాజయోగివిధమున, మీరాబాయిసంగీతాకర్ణనమున మొగలాయీ సార్వభౌముఁడు బహిరింద్రియవ్యాపారము లుడిగి నిర్వికల్ప సమాధ్యవస్థను దాల్చెను.

ఇట్లు అక్బరుచక్రవర్తియు, సంగీతాచార్యుఁడును మాయాసన్న్యాసివేషముల మీరాబాయిగానమును విని ప్రాప్తమనోరథులైరి. శ్రీకృష్ణాలయమునఁ గనులార మీరాబాయిని జూచిరి. గానామృతమును చెవులు దనియఁ గ్రోలి తన్మయులైరి. భక్తిపూరితగానవర్షముచే బరవశులై యింద్రియవ్యాపారమును మఱచి చక్రవర్తియు నామెపాదములఁ బడి మోక్షమార్గ ముపదేశింపు మని వేడికొనెను. తానసేనునివలన నంతలో నక్బ రైహిక ప్రబోధమునంది తెలివిఁదెచ్చుకొని, తనవస్త్రమునుండి రత్నహారము నొకదానిఁదీసి వినయపూర్వకముగ నద్దాని నామె కర్పించి, "అమ్మా! భక్తశిరోమణీ! దీనుఁడనగు నేనిచ్చు నీయల్పబహుమానమును నీ వంగీకరించి శ్రీకృష్ణునికంఠమున నీ పవిత్రహస్తములతో నలంకరింపుము" అని చెప్పెను.

మీరాబాయియు నా హారమందికొని, నిమేషమాత్ర మద్దానిఁ బరీక్షించి మాయాసన్న్యాసివేషధారి యగు నక్బరుచక్రవర్తితో నిట్లనియె: "యతివరా! హార మమూల్యమైనదిగఁ గన్పట్టుచున్నది. సన్న్యాసివగు నీ కెట్లు లిది లభ్యమైనది ?"

అక్బరు — తల్లీ! స్నానకాలమున యమునలో నా కీ హారము దొరకినది. నీ కిష్టదైవమగు శ్రీకృష్ణుఁడే దీని ధరింప నర్హుఁ డని నే నిట్లు చేసితిని.

వారి భక్తి త్యాగములకు మీరాబాయి సంతసించి విగ్రహకంఠమున నా రత్నహార ముంచెను. చక్రవర్తియు, సంగీతాచార్యుఁడును కృతార్థులై ఢిల్లీకిఁ బోయిరి. మీరాబాయియుఁ బూజాదికమును ముగించి యింటికిఁ బోయెను.

౭

నాఁడు సీతారామచంద్రుల పరస్పరానురాగభంగమున కొకమాయాసన్న్యాసి యెట్లు కారణభూతుఁడయ్యెనో, నేఁడుగూడ మీరాబాయి కుంభసింహమహారాణాల పరస్పరానురాగభగ్నము నొనర్ప నీ యక్బరు చక్రవర్తి మాయాసన్న్యాసివేషమునఁ గారణభూతుఁడయ్యెను. అమాయకురా లీమె దీని నేమియు నెఱుఁగకుండెను.

చక్రవర్తి దయాళుఁడు. స్వయముగఁ గష్టముల ననుభవింప నిచ్ఛగించును గాని, తనమూలమున నితరులకారణముగ బాధ లందుట కోర్వఁడు. ప్రచ్ఛన్నవేషమునఁ బోయి మీరాబాయిపాటల వినుటచే నా యమ కెట్టి హానియు నుండ దని వారియూహ. తన యుద్దేశానుసారము కార్యసరణి నడచిన నెట్టి యపాయము నామె కుండకపోవును. తా నొకటి దలఁచిన దైవ మొండు దలంచును. రత్నహార మొక్కటియే నోరు లేని జడపదార్థ మయ్యు, సునిశిత బుద్ధిమంతుల కన్న నెక్కుడు నేర్పుతో సన్న్యాసుల నిజ వృత్తాంతములను వెల్లడింపఁ గల్గెను. తత్ఫలితముగ మీరాబాయి భర్తృప్రేమకు దూర మైపోయెను. ఇట్టి విపరీత ఫలము వచ్చునని యక్బరున కేమాత్రమైన ననుమానముండియుండిన స్వసుఖమైన విడనాడు వాఁడు గాని, పరులకు వచ్చు నాపదల సహింపనేరని సరళస్వభావుఁడతఁడు. ఇట్టి విషమఫలము చేకూరునని యాతఁ డెన్నఁడు నూహించలేదు. పొరపా టొనరించుట

మానవస్వభావము. అక్బరుకూడ చక్రవర్తియే యయ్యు మానవుఁడే!

శ్రీ కృష్ణవిగ్రహ కంఠ రత్నహార మీయామె పండువంటి కాఁపురమును భగ్నము సేయ నిజముగ వజ్రాయుధమే యయ్యెను. సంసారసౌఖ్యమును బోఁగొట్టి భర్తప్రేమకు నీమెను దూరము చేసివైచెను. హార మమూల్య మగుటచే, నది యెట్లాలయము చేరినదియు పలువురు చెప్పికొనుచుండిరి. హారప్రదానము మహారాణా చెవులఁగూడఁ బడెను. ఆతఁడద్దానిఁజూడఁ గోరి తెప్పించి పరీక్షకులకుఁ జూపి మూల్యము దెలుపఁ గోరెను. వారద్దాని బరీక్షించి విలువ యొకకోటిరూప్యము లుండునని చెప్పిరి. పరీక్షకులలో నొక్కఁడు మొగలాయీచక్రవర్తికి రెండుసంవత్సరముల క్రిందట నీహారము నే నొకకోటిరూపాయిల కమ్మియుంటినని నిశ్చయముగఁ జెప్పెను. దీని యాధారమున సన్యాసుల జాడ దెలుపఁగ వేగులవాండ్రను మహారాణా కఠినముగ నాజ్ఞాపించెను. ఎంతకాలము మాయా సన్యాసివేషమున నక్బరుచక్రవర్తి లోకులకన్నుల మూయఁగలఁడు? ఎంతకాలము మాయ దాఁగఁగలదు? మహారాణావలన నీయఁబడిన గడువు దాఁటకమున్నె వేగులవాండ్రు సన్యాసుల జాడల నెల్ల కనిపెట్టి, వివరము లన్నింటితో మహారాణాకు నివేదించిరి. మఱునాఁ డుదయముననే మహారాణా కుంభసింహుఁడు సింహాసనాసీనుఁడై మంత్రి పురోహితసేనాపతి దౌవారికాది సమస్తరాజోద్యోగి బృందసమేతముగ కొలువు దీర్చి రత్నహారవృత్తాంతమును బహిరంగసభలో వివరించి, సన్యాసుల వృత్తాంతమును వారలక్బరు తానసేను లగుటయు, చారులనిర్ణయమును పండిత పరిషత్తున కెఱింగించి, శాస్త్రానుకూలముగ నభిప్రాయ మీయఁగోరెను.

పండితులును దీర్ఘముగ వితర్కించి మహమ్మదీయమతస్థుఁడగు ఢిల్లీచక్రవర్తి యక్బరు మాఱువేషమున నాలయము ప్రవేశించి మీరాబాయిచేతికి రత్నహార మిచ్చుటయు, నామె గ్రహించుటయు చర్చించి, కులశీలమునకును, సతీధర్మమునకును, రాజపుత్రమానినీమణుల యాదర్శప్రాయమగు మానమునకు నీయమ మీరాబాయి చేసిన చర్య భిన్నమని వారి నిశ్చితాభిప్రాయమును వెల్లడించిరి.

అంతటితో సభ చాలించి కుంభసింహుఁడొక్కఁడే యిట్లు తలపోయఁజొచ్చెను. మొగలాయీ చక్రవర్తియే తనభార్యను జూడవచ్చెననియు, నామె సంగీతము నాకర్ణించి రత్నహారము నామెకు కానుకగా నొసంగె ననియు, వానిచేతులనుండియే మీరాబాయి స్వయముగఁ బరిగ్రహించె ననియుఁ బూర్తిగ ఋజువయ్యెనుగదా! ఇంక నేమి కావలెను? మీరాబాయి మానభ్రష్టురాలయ్యెను. ఆమెకతమున మహారాణావంశమంతయు నపకీర్తిపాలయ్యెను. మహారాణా కీయపకీర్తి భరింప శక్యము గాకుండెను.

మీరాబాయి శిరమును ఛేదింప వెంటనే రాజాజ్ఞ యొసంగఁబడెను.

౮

ఘోరాతిఘోరమగు నీవార్త దవాగ్నివలెఁ బట్టణ మంతయు నిమేషకాలములో వ్యాపించెను. ప్రజలు మీరాబాయి నెఱుఁగనివారు కారు. ఆమె పరమపతివ్రత యనియు, భక్తలోకమున కెల్ల నాయకమణి యనియు, నిష్కళంకచరిత యనియు వారికిఁ దెలియును. ఇందుచేఁ బ్రజలెల్లరు గుజగుజ వోవుచుండిరి. వార్తపై నాధారపడి కార్యకలాపము జరుపు రాజులును, వారియనుచరులును, ఎంత మేధాసంపత్తి కలిగినవారయ్యు, యుక్తాయుక్త విచక్షణమున సామాన్యజనుల హృదయానుభావమున కెప్పుడును సాటి రారు. ప్రజల హృదయాంతస్థన్యాయస్థానమున మీరాబాయి పరమపతివ్రతాశిరోమణి, భక్తాగ్రేసరురాలు, సుశీల, సతీమణి.

అందుచే రాజాజ్ఞ నెఱవేర్చుటకు సేవకులలో నొక్కఁడును సాహసింపకుండెను. అటు లొకరివెనుక నొకరుగ వందఱు తనయాజ్ఞను మన్నింపఁ దిరస్కరించిరి. తుదకుఁ దనయాజ్ఞను పాలింపఁ దానే సిద్ధమై యొక పాత్రమునిండ విషముఁ గొనివచ్చి తన సమక్షమునఁ ద్రాగుమని భార్య కాజ్ఞ నిడెను. మీరాబాయి పరమపతివ్రత గావున భర్తృవాజ్ఞను మిక్కిలి సంతోషముతోఁ జెల్లించివైచెను. అపకీర్తి నీవిషముతోఁ గడిగికొంటి నని మహారాణా యానందించెను

కాని భగవద్విలాసము వేఱుగ నుండెను. ఆమె త్రాగిన విష మామె కమృతతుల్య మైనది. నిజముగ నటులే యగుచుండును. సత్యముపై నాధారపడినవారికెల్ల భగవంతుఁడు సన్నిహితుఁడై తల్లి బిడ్డను గాపాడుపగిది, కంటికి రెప్పవోలె సదా రక్షణ మొసఁగుచుండును. అందుచేతనే కాఁబోలు నామె కావిష మమృత మైనది. చేయునదిలేక మరణింపుమని కుంభసింహుఁడు ఆజ్ఞాపత్రమును స్వహస్తమున లిఖించి మీరాబాయి కందఁజేసెను. ఈ దారుణమారణపత్రమును రాజభటుఁ డొకఁడు కృష్ణాలయమునఁ బూజాదికమును ముగించి యంతఃపురమునకు మీరాబాయి మరలుచుండ నందఁ జేసెను. దాని నామె చదివికొని ప్రత్యుత్తరముగఁ దా నాయాజ్ఞను శిరసావహించి యాచరించెద నని మాత్రము చెప్పి ప్రత్యుత్తరమందలి ఘోరసమాచారమును దనచెలులకెఱింగించినచో వారు విషాదము నందెదరని తలంచి యేరికిని జెప్పక, యతిశాంతముతోఁ దన నివాసమున కేఁగెను.

నాఁటి యర్ధరాత్రమున నామె యొక చిన్న వస్త్రము ధరించి కోటను వీడెను. ఆమె వెడలుట యెవ్వరు నెఱుంగరు. ఇట్లామె తిన్నగఁ బోయి యొక నదీతీరముఁ జేరెను. దేశము పర్వతమయ మగుటచే, నది శరవేగమునఁ బాఱుచుండెను.

నిమేషమాత్ర మామె శ్రీకృష్ణుని మనసార ధ్యానించి, భర్తృపాదముల మానసమున నమస్కరించి, తీరమందలి యొక గండశిల నారోహించి గంభీర ప్రవాహమం దుఱికెను. తరువాత నేమి జరిగినదియు నామె యెఱుఁగదు. పడుటయె తడవుగ నామె కిహలోకచైతన్యము వాసిపోయెను. బాహ్యము నామె మఱచెను. స్మృతి దప్పెను. అయినను మృతినందలే దను జ్ఞానముతో మాత్ర ముండెను. అప్పు డొక దివ్యాంగన, తేజోరూపవతి మీరాబాయి నాలింగనముఁ జేసికొని యిట్లు చెప్పెను. "బిడ్డా! మహాపతివ్రతవు గాన నీ వతనియాజ్ఞ నుల్లంఘింపక నదీప్రవాహమునం బడి మరణింప నెంచితివి. కాని యంతకన్న నుత్కృష్ట కార్యము నెఱవేర్పుకొఱకు నీవు జన్మించితివి. దానిం జేయక తీరదు. పతివ్రతాధర్మమున కది భిన్నము కాదు. మానవలోకమున కంతటికిని సౌఖ్యము నాపాదించు నుత్కృష్ట భక్తిమార్గమును బోధించి వారిని దరింపఁ జేయు మహనీయకార్యము నీయం దున్నది. ఈ కాలమున జనులు తరింపఁగల మార్గమును భక్తి సూచనచేయుచున్నది. లోకమునకు భక్తిమార్గము చూపు భారము నీయం దున్నది. నీవు దాని నాచరింపుము."

## ౬

మీరాబాయి కన్నులు విప్పెను. సూర్యభగవానుఁడు గగనమధ్యభాగము నలంకరింపుచుండెను. నదీప్రవాహ మామె నప్పు డొడ్డునఁ జేర్చెను. చూచుసరికి భయంకరవేగమునఁ బాఱునది ప్రవహించుచుండెను. కనుచూపుమేర నామె కెవ్వరును గానరాలేదు. మీరాబాయి లేచి కీర్తనలఁ బాడుచు ముందునకు నడువసాగెను. కొంతదూరము నడువనడువఁ గొందఱు పసులకాపరు లామెకు గోచరించిరి. వారి నామె పలుకరించి పవిత్రయాత్రాస్థానమగు బృందావనమునకు మార్గముఁ జూపుమని కోరెను. వారామెకు క్షీరము లాహారముగ నొసఁగి బృందావనమునకు మార్గముఁ జూప నామెతో నేఁగిరి. గానమం దెట్టి యాకర్షణశక్తి కలదు? మార్గమందలి గ్రామము లన్నియు దివ్యమాధుర్యమున నొప్పారు హరినామాంకితగానామృతముచేఁ బూరింపఁబడుచుండెను. స్త్రీలుఁ, బురుషులును వారి వారిపనులను విడిచిపెట్టి మార్గమునఁ బోవుచుండు నావ్యక్తినిఁ జూడవచ్చిరి. బాలబాలికలు వారియాటపాటలఁ గట్టిపెట్టి హరీ! హరీ! యని కేకలిడుచు నామెవెంటఁబడుచుండిరి.

మీరాబాయి నడచుచునే యుండెను. ఆమె యంగీకరింపకపోయినను కానుక లీయఁగలిగితి మని కొందఱు తృప్తిఁజెందుచుండిరి. ప్రశస్త భోజనపదార్థము లనేకులు భక్తితో నామెకు సమర్పించుచుండిరి. కాని క్షీరముదక్క నన్యమేదియు నామె యంగీకరింపకుండెను. కొందఱు స్త్రీలుఁ, బురుషులును గృహముల వీడి సర్వస్వముఁ ద్యజించి యామె వారించుచున్నను, మరలక వెంటఁబడి భక్తిపారవశ్యమున నామెతోఁ జనుచుండిరి. ఈరీతినొకరొకరుగ నామెవెంటఁ జనువారు వృద్ధియై వేలకు మించియుండిరి. తుదకుఁ బుణ్యక్షేత్రమగు బృందావన మామె చేరుసరికి వెంబడించినవారి

సంఖ్య మితిమీరెను. వారిభక్తి యున్మాదావస్థకుఁ జేరు వయ్యెను. భూతప్రమథాదిగణంబులు తన్నుఁగొలువఁ గైలాసనాథుని యర్ధాంగి బృందావనవిహారుఁడగు శ్రీకృష్ణుని సేవింప వచ్చెనో యన్నట్లు మీరాబాయి చూపట్టెను.

## ౧౦

బృందావనమున మీరాబాయి చేరిన సంగతి దేశ మంతటను వ్యాపించెను. శ్రావ్యమగు నామె పాటలు వినఁబడని చోటే లేదు. పల్లెటూరి గుడిసెలలో నామెపాటలే! పశువుల మందలలో నామెపాటలే! దేవాలయములలో నామెపాటలే! రాజవీధులలో నామెపాటలే! 'చితోరు' రాజ్యమున నామెతోఁ బరిచయముగలవా రందఱు నామెను జూడఁ ద్వరగ బృందావనమునకుఁ బయనమైరి. ఆమెతోఁ బరిచయము లేనివారుగూడ నామెను దర్శించుటకును, ఆమెసంగీతామృతమును గ్రోలుటకును, ఆమెవలన భక్తిమార్గము గ్రహించుటకును వేనవేలు పుణ్యక్షేత్రమునకుఁ జేరుకొనుచుండిరి. మీరాబాయి ప్రఖ్యాతమగు నుదయపుర సామ్రాజ్యమునకుఁ బ్రభ్వి గాదు. ఆమె యిప్పుడొకభిక్షుకి. బాధాభూయిష్ఠమగు నీ భూతలమును స్వర్గతుల్యముగఁ జేయఁగలుగు నొకానొక మహద్వ్యక్తి.

## ౧౧

బృందావనమం దొక్క యారామమున రూపగోసాయినామక భక్తాగ్రగణ్యుఁడొక్కఁడా శ్రమము నిర్మించుకొని ముక్తి ప్రదుఁడగు బాలగోపాలుని చింతనమున కాలముఁ గడపుచుండెను. ఈతఁడు భక్తుఁడేగాక పరమవైరాగ్య సంపద గలవాఁడు. వేదశాస్త్రముల నామూలాగ్రముగ నెఱింగిన మహాజ్ఞాని. కాంతాకనకములు మానవుని నైహికమునకు బంధించు బలవత్తమములైన రజ్జువులనియు, నసంగశస్త్ర మొక్కటియే వాని ఛేదించు సాధనమనియుఁ దరువాతనే భక్తిజ్ఞానములను రెండు నొక్కల సంపాదించుకొని మోక్షనిధానముఁ జేరుట కాముష్మికాంతరిక్షమున నెగుర సమర్థత వచ్చుననియు వానినమ్మకము. దీని కనుగుణముగ నాతఁడు స్త్రీల ముఖములను, ధనమును వీక్షింపకుండునట్లు ప్రమాణము గైకొనెను.

బృందావనముఁ జేరిన కొలఁదిదినములకే రూపగోసాయిచారిత్రము మీరాబాయికి వినవచ్చెను. వానివలన భక్తినిగూర్చి వినఁగోరి దర్శనార్థము గోసాయికి సందేశమంపెను. తన శపథము ననుసరించి గోసాయియు నామె ప్రార్థనమును దిరస్కరించెను. అందుపై నామె యిట్లు వానికిఁ బ్రతిసందేశ మంపెను:—"బృందావన పుణ్యక్షేత్రమున శ్రీకృష్ణుఁడను నొక్కఁడే పురుషుఁడు గలఁడు. మిగిలినవా రందఱును స్త్రీలే. ఆ పరమాత్మునియం దమితానురాగముతో వా రెల్లరును గాలముఁ గడపుచుందురు. కావున వా రెల్లరును గోకులశ్రీకృష్ణుని కాంతాజనమే! బృందావన మంతయు నా మహామహుని యంతఃపురము. పరపురుషుఁ డందుఁ జొర రాదు. రూపగోసాయి యాపరమపురుషునంతఃపురమున రహస్యముగఁ బ్రవేశించియుండిన, నాతఁ డాక్షణముననే బయటికిఁ బోవు టుత్తమము. ఆలస్యముఁ జేసిన గోపాంగనలలో నొకరికైన నాతఁడు కనఁబడకపోఁడు. పట్టువడినతోడనే గోపికలు తమ ప్రాణవల్లభుఁ డగు శ్రీకృష్ణునితోఁ జెప్పకమానరు. గోకులకాంతావిహారరతుండగు శ్రీకృష్ణభగవానుఁ డట్టి యంతఃపురద్రోహినిఁ గ్రమశిక్షఁ జేయక విడువఁడు. ఈ రహస్యమును రూపగోసాయి ముందుగా నెఱుంగుఁగాక."

జ్ఞానాత్మకమగు నీ సందేశ రహస్య మారూపగోసాయి గ్రహించి, మీరాబాయి నిరుపమానభక్తాగ్రేసరురా లని తెలిసికొనెను. వెంటనే తనస్థానమున కామె నాహ్వానముచేసెను. మీరాబాయి వచ్చి వాని పాదములకు నమస్కరించి జోడించిన చేతులతో నెదుట నిలిచియుండెను.

రూపగోసాయి—బిడ్డా! నావలన నేమి వినఁగోరి నీ విట వచ్చితివి ?

మీరాబాయి—తండ్రీ! నీనివాసమున, నీసన్నిధి నన్నుండనిమ్ము. నీముఖమున సంతతము భగవన్నామము వినఁగలభాగ్యము నా కబ్బఁజేయుము.

రూప—అమ్మా! నీ విక్కడనే యుండఁగోరుటచే నేను ధన్యాత్ముఁడను. దానిఁగూర్చి నీ వంతగాఁ బ్రార్థింపవలయునే? నీవంపిన సందేశమే నీభక్తిజ్ఞానముల వెల్లడిచేయుచున్నది. తల్లీ! నన్ను ననుగ్రహించి

భక్తిమార్గము నా కుపదేశింపుము. నన్ను నీశిష్యునిగ నంగీకరించి యుపదేశ మనుగ్రహింపుము. నామ్రొక్కు గైకొనుము—అని సాష్టాంగపడెను.

తుదకు వారుభయులు నొకరి కొకరు శిష్యులైరి. నృత్తగీతములతో బృందావనమున శ్రీకృష్ణుని సన్నిధిని బరమానందముతో మీరాబాయి కాలముఁ గడపుచుండెను. వేలకొలఁది స్త్రీలుఁ బురుషులు నీమెఁ జేరి హరిసంకీర్తనముఁ జేయుచుండిరి. మృదుమధురమగు నీమెగానము బృందావనమును స్వర్గముగ మార్చివేసెను. ఈమె పాటలు దేశమం దెల్లెడల మాఱుమ్రోఁగుచుండెను. హిమాలయపర్వతముల నీమెపాటలే వినవచ్చుచుండెను. పవిత్రమగు గంగాయమునలు ప్రవహించు నార్యావర్తమున నీమెపాటలే వినవచ్చుచుండెను. సింధునది ప్రవహించు పాంచనదమున నీమెపాటలే వినవచ్చుచుండెను. గంగాసాగరసంగమస్థానమున నీమెపాటలే వినవచ్చుచుండెను. తుదకు దక్షిణదిగ్భాగమున సేతుతీరమునఁగూడ నీమెపాటలే వినవచ్చుచుండెను. ఇది యది యన నేల? ఆసేతుహిమాచలము బృందావన శ్రీకృష్ణాలయమంటప ప్రదేశమున మీరాబాయి పాడిన పాటలే వినవచ్చుచుండెను.

౧౨

ఉదయపుర సంస్థానమున 'చిత్తోరు'నం దీమె పాటలు వినఁబడలేదని యెవ రనుకొనఁగలరు? చిత్తోరులోని ప్రతివీథిలోను సందులోను చిన్నదనక పెద్దదనక ప్రతి గృహమందును మీరాబాయి నామాంకిత గేయములే వినఁ బడుచుండెను. మహారాణాయయిన కుంభసింహుని చెవిని సంతతమును దనభార్య మీరాబాయినామము పాటలయందలి యంకితరూపమునఁ బడుచునే యుండెను. మీరాబాయి సామాన్యవ్యక్తి కాదు. అమానుష శక్తి సామర్థ్యములతో నాత్మ రాజ్యమున విహరించు విశేషవ్యక్తి. అట్టిరాజ్యమున మహారాణాప్రభుత్వము సాగదు. దాని నాతఁ డెఱుఁగును. మీరావారు రాజకుటుంబమున కపకీర్తిఁ దెచ్చిన దని నమ్మి విడనాడిన మహారాణా ఇపుడు కన్నులు దెఱచి నిజముగ మీరాబాయి ఘనమగు కీర్తినే తెచ్చిన దని తెలిసికొనెను. అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన మీరాబాయిని విడిచినవాఁడే యతఁడు. పరమపతివ్రత యగు మీరాబాయిమరణమును గోరి విషము ద్రావించినవాఁడే యతఁడు. విష మమృతము కాఁగా జేయునది లేక తనంతటఁ దానే మృతి నందవలయు నని యాజ్ఞాపత్ర మిచ్చినవాఁడే యతఁడు. నాఁడు శ్రీరామచంద్రుఁడు తనభార్య సీతాదేవిసాధ్వి యని యెఱింగియుఁ బ్రజాపవాదమునకు వెఱచి యెట్లు నిండుచూలాలి నట్టడవిలో డిగనాడెనో యట్లే నేఁడు మహారాణాగూడ మ్లేచ్ఛుఁ డగు నక్బరుచక్రవర్తి స్పర్శ మీరాబాయికిఁ గలిగిన దను నపవాదమును జనులచేఁ బడయనొల్లక ఆమెను విసర్జించెను. ఇట్లు చేసినను జనుల యనురాగమును బడయఁగల్గెనా? ఈ జనులే యామెఖ్యాతివలన నాకర్షింపఁబడి బృందావనమునకు మున్ముందు పరుగులిడఁ దొడఁగిరి. ప్రపంచమంతయు నామెను భూషించుచుండ, మహారాణా యొక్కఁడుమాత్రము మీరాబాయి యెడ ననూయాద్వేషములఁ బ్రకటించుట, లోకనిందకు గుఱియగుట దప్ప వేఱుకాదు.

ఈసంగతి నెఱిఁగి మాఱువేసమున నొక్కఁడే బృందావనమున కేఁగి శ్రీకృష్ణాలయ మంటప ప్రదేశమున నాసీనయై భగవంతుని గూర్చి మనోహరగీతములు శ్రావ్యముగఁ బాడు మీరాబాయిని చూచెను. అప్పుడు వారిరువురకు నిట్లు సంభాషణము జరిగెను.

మహారాణా— (మాఱువేషమున) పుణ్యాత్మురాలా! భిక్షము పెట్టుము.

మీరాబాయి — నేనే భిక్షపై నాధారపడియున్నాను. నీ కెట్లు భిక్ష పెట్టఁగలను? భాగ్యవంతుల గృహముల కేఁగుము. అచట నీకు భిక్ష లభింపఁగలదు.

మహారాణా — నిజమగు భిక్షుఁడు భిక్షువులనే భిక్ష మడుగును.

మీరా—అట్టియెడ నేను నీ కట్టి భిక్షఁ బెట్టగలను?

మహారాణా — ప్రేమ—అని చెప్పుచు తన నిజరూపమును బ్రకటించెను.

మీరాబాయి—ప్రాణవల్లభా! నేఁటికి జ్ఞప్తికి వచ్చితినా? (పాదములకు

మహారాణా—లెమ్ము. భ్రమకు పాలై నిన్ను నెక్కువంతలఁగూర్చిన పాతకిని నేను. ఏకగ్రీవముగ లోకులు నిన్నుకల్మష వని ప్రకటించినను వినవైతిని. సేవకు లందఱును శిరశ్ఛేదనాజ్ఞను దిరస్కరించినను కారణ మరయలేకుంటిని. ఉదకు నిమేషకాలమున ప్రాణాపహరదక్షమగు దారుణవిషము నీచే నాసమక్షమునఁ ద్రావించితిని. అయ్యది నిస్తేజమై భగవత్సంకల్పమును సూచించుచున్నను మూర్ఖుఁడనై గ్రహింపలేక పోతిని. కాని భగవంతుఁడు పూర్ణానుగ్రహమును నీయందుఁ జూపి నన్ను మహోత్కృష్టమగు కార్యమునకు సాధనముగా నెఱవేర్చియే కాఁబోలు నదివలని యపాయ మించుకంతయు నీకుఁ గలుగకుండఁ గాపాడెను. క్షమ నీయం దధికముగఁ గలదు. నాతప్పుల సైరించి నన్ను క్షమింతు వని వేఁడుచున్నాను.

మీరా—జీవితేశా! నీదాసినగు నే నీయాజ్ఞల భక్తితో నెఱవేర్చుట నావిధి. ఔచితిని విడనాడి నన్ను క్షమింపు మని వేఁడుట తమకు తగనిపని. నన్నుఁ గష్టములపాలు చేసితిరని వగవకుఁడు. మీయాజ్ఞల శిరసావహించి యాచరించుటయే నా కానందము.

మహా—మీరా! లెమ్ము. పయనము కమ్ము. ఉదయపురమునకుఁ బోదము.

మీరా—చిత్తము. బృందావననాథుఁడును, నాకిష్టదైవమునగు శ్రీకృష్ణుని దర్శింపక మఱలు టనుచితము.

మహా—అట్లే చేయుదము. పూజాద్రవ్యముల సేకరించి యాలయమునఁ బ్రవేశింతము.

వెంటనే పూజాద్రవ్యములతో దంపతు లిరువురు భక్తజనసముదాయము వెంటరా గర్భాలయములోని కేఁగిరి. నాఁడు శ్రీరామచంద్రునిచే నట్టడవిని విడువఁబడిన నిండుచూలాలు సీతామహాదేవి పతిపాదముల స్మరించుచు వాల్మీకిమహామునియాశ్రమమున నుండి కుశలవులఁగని, వారిఁ బెద్దవారిగఁ జేసి తిరిగి భర్తయగు శ్రీరాముఁడు తన్నయోధ్యకుఁ గొనిరాఁ బునర్దర్శనమొసఁగినపుడు, భూదేవికిఁ దా బిడ్డయగుటచే నెట్లా పతివ్రతను తనలోఁ జోటిచ్చియుంచికొనెనో, యట్లే యుదయపుర రాజ్యమునకుఁ గొనిరాఁ సుకూహాళి యగు మహారాణా సమక్షమునఁ దన ధర్మపత్ని, మీరాబాయి శ్రీ కృష్ణునిఁ గీర్తింపుచుండ నావిగ్రహ మామె గానామృతమునకుఁ గరఁగెనో యనునట్లు నిలువున రెండు భాగములుగ వీడ నామధ్య మీరాబాయి ప్రవేశించెను. వెంటనే విగ్రహభాగములు రెండును గలయ నామె యదృశ్యయైపోయెను. భర్తయుఁ బరివారముఁ జూచుచుండఁగనే మీరాబాయి శరీరముతో శ్రీకృష్ణునియందైక్యమును బొందుట వీరి నాశ్చర్యమున ముంచివైచెను. భక్తజనలోక మామెను పరమభక్తురాలుగ నంగీకరించెను. ఆమె కీర్తనలు వేదవాక్యములకన్న నెక్కుడుప్రమాణములు. ఆమె భక్తమాలికలో నాయకమణి.



# బాంకుల దివాలాలు

## (రిజర్వు బ్యాంకు ఇండియను బ్యాంకుల అత్తగారు)

శ్రీ కొచ్చెర్లకోట సత్యనారాయణమూర్తి

"పసరంబు పాడైన పసులకాపరి తప్పు,
ప్రజలు దుర్నయులైన ప్రభువుతప్పు"
—రామలింగేశ శతకము.

నిరుడు, మనం చూస్తూ చూస్తూవుండగా, మన కళ్లయెదుట, ట్రావంకూరు కొచ్చిను క్విలాను బాంకు అనే మహాసౌధం పునాదులు సహితంగా కదిలి నేల కూలింది. ఆటుపిమ్మట దానికి సంబంధించినవీ, సంబంధించనివీ, దగ్గరవీ, దూరానవీ, అనేక బాంకింగు సౌధాలు దడదడ నేలపడ్డాయి. "వీవడ్డీలేకుండా ఐదు లక్షలు రూపాయలు తనవద్ద డిపాజిట్టు కట్టి షెడ్యూలు లిస్టులో చేరిన ఇంత పెద్దబాంకూ, దీనితోపాటు ఇన్ని ఇతర బాంకులూ కూలిపోతూవుంటే రిజర్వుబాంకు వారు అల్లా తెల్లపోయి చూస్తారేం? ఇట్టి చిక్కు పరిస్థితులలో వారి పూచీ యేమిటి?"అని అనేకులు ప్రశ్నించారు "అల్లరి చేయకండి! మేము రావలసిన టైము ముందుంది; ఇప్పుడు గాదు"అని రిజర్వుబాంకువారు అల్లరి అణిచి, ఆ హంగామా అంతా సర్దుకున్న తర్వాత ఇండియనుబాంకుల మరామతుకోసం వకచిత్తు బిల్లును టైటపెట్టారు.

"ఇంపీరియలు బ్యాంకు, ఇండియను బాంకుల అత్తగారు" అని విద్యాసాగర పాండ్యా కాబోలు అన్నాడు. ఇప్పుడా అత్తగారిపదవి రిజర్వుబాంకుకు సంక్రమించింది. అది తన బాధ్యతలను గమనించకుండా, ఇండియను బాంకులకుమాత్రం శ్రీరంగనీతు లుపన్యసిస్తూ, వాటిలోపాలను మాత్రమే ఎన్ని, ఆలోపాలను తనకు అనుకూలమైన విధంగా సవరించడానికి పూనుకుంది.

అసలు, రిజర్వుబాంకుకు ఈ అత్తగారిపెత్తనం ఎక్కడనుంచి వచ్చింది? దానికి ఇతరబాంకులకీ వుండవలసిన సంబంధం ఏమిటి? ఈసంగతులు తెలిసినవారే అరుదు. రిజర్వుబాంకు కూడా ఏదో వకరకం బాంకీ అనీ, ఎక్కడో ఢిల్లీలోనో వుందనీ అన్న దూరభావమేగాని ప్రజల నిత్యజీవితానికీ ఆబాంకుకీ వుండే సంబంధం ఎటువంటిదో అనేకులు ఎరగరు. అల్లా ఎరక్కపోవడంలో ఆశ్చర్యంలేదు కూడాను. దేశంలో ఆర్థికపరిస్థితులు ఏదో యథాప్రకారంగా సాగిపోతూ వున్నంతకాలం ఆబాంకుప్రసక్తి ప్రజల కక్ఖరలేదు; అమలులో వున్న ఆర్థికవిధానంలో అది వేలుపెట్ట నక్ఖరలేదు. ఆర్థికచక్రం సరిగా నడవక కొంత అలజడి కలిగినప్పుడే ప్రజలదృష్టి ఆబాంకుపై పుకు మళ్లడం. ఈమధ్య రూపాయిమారకం తగాదాలలో రిజర్వు బాంకుప్రశంస కొంత టైటకు వచ్చింది. తిరిగి ఈ బాంకుల దివాలాలలో రిజర్వుబాంకుయొక్క పూచీని గురించి తీవ్రంగా ఆలోచనలు టైలుదేరాయి. రిజర్వు బాంకు మన నౌకరా? లేకపోతే, మనమీద ఒకటో రకం కలక్టరీ హోదాగల అత్తగారా? అన్న ధర్మ సందేహాలు కలిగాయి.

ఈ రిజర్వుబాంకువంటి కేంద్రసంస్థలను నడపడంలో అసలుమార్గదర్శి బాంకు ఆఫ్ ఇంగ్లాండు. అది ఎంతో మడి గట్టుకుని అంటూ మైలా తగలకుండా చాలా జాగ్రత్తగా వున్నసంస్థ. ఇంగ్లీషుగవర్నమెంటులో మార్పులూ, పార్టీల కక్షలూ, పార్లమెంటకి ఎన్నికల అడావుడ్లూ-వీటితో అది ఎంతమాత్రం కలియజేసుకోదు. హైకోర్టును గవర్నమెంటు అధికారాన్నుంచి సర్వస్వతంత్రంగా వుంచితేనేగాని ప్రజలకు న్యాయం జరగదన్నవమ్మకం వున్నట్లే, ఈబాంకుఆఫ్ ఇంగ్లాండును పార్టీ గవర్నమెంటుల మార్పులనుంచి స్వతంత్రంగా వుంచితేనేగాని ఆర్థికచక్రం సక్రమంగా నడవదని ఇంగ్లాండులో మొదలు

నమ్మకం వుండేది. ఆమధ్య మద్రాసులో సినీమాలో ఒకదృశ్యం చూపించారు. స్యూయెజు కాలవను తవ్వడానికి సంకల్పించిన రోజులకథ అది. స్యూయెజు కాలవను తవ్వడంకోసం ఏర్పడ్డ కంపెనీలో ఇంగ్లాండుదేశం వాటాలు కొనాలని ఇంగ్లీషుప్రధానమంత్రి డిస్రేలీ నిశ్చయించాడు. అందుకు కావలసిన పైకం అప్పియ్యవలసిందని ఇంగ్లీషుబాంకు మేనేజరును అడిగాడు. ఇది అంతగా లాభప్రదమైన వ్యాపారమని బాంకుమేనేజరుకు తోచలేదు. "ఎక్కడో ఎడారిలో ఒక పిల్ల కాలవను తవ్వించడంకోసం కోట్లాది పైకం బాంకులోనుంచి అప్పిస్తానా?" అని ధిక్కరించి జవాబు చెప్పాడు. ఆరోజులలో బాంకు ఆఫ్ఇంగ్లాండుకు అంత స్వతంత్రం వుండేది. కాని ఇప్పుడా పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. ఐరోపాలో నేడు ప్రతిదేశంలోనూ విజృంభించిన నిరంకుశాధికారుల కొత్తకొత్త ఆర్థికకార్యక్రమాలను అమలులో పెట్టడానికి ఈ రిజర్వుబాంకులు మొదటిబలైనాయి. నాజీజర్మనీలో, హిట్లరుపరిపాలనలో ఆ మార్పు స్పష్టంగా వెల్లడి అయింది. హిట్లరుయొక్క విపరీత ఆర్థిక కార్యక్రమాలకు తల ఒగ్గనని జర్మను ఫెడరలు బాంకుమేనేజరు డాక్టరు షాటు ఎదిరించాడు. తన పనికి రాజీనామా ఇస్తానన్నాడు. "జర్మనుబాంకు అధికారిగా వుండి, నా ఆర్థికనీతిని అమలులో పెడతావా? లేకపోతే జర్మనుజైలులోకి వెడతావా? ఈ రెండింటిలో నీ కేది ఇష్టమో చెప్పు"మని హిట్లరు డాక్టరు షాటును అడిగాడట. జర్మనుబాంకు నూతన నాజీసిద్ధాంతాలకు తలఒగ్గక తప్పిందికాదు. ఇదేవిధంగా యూరోపులో ఇంచుమించు ప్రతిదేశంలోను రిజర్వు బాంకులు కడచిన పదేళ్లలో ప్రభుత్వాధికారం కిందకు వచ్చాయి. ౧౯౨౯ తర్వాత ఈపద్ధతులమీద కొత్తగా ౧౪ దేశాలలో రిజర్వుబాంకులను స్థాపించారు; ఇదివరకే రిజర్వుబాంకులు ఏర్పాటైయున్న పదిదేశాలలో పూర్వపువిధానం పూర్తిగా మారిపోయింది. ఈమార్పులన్నిటి ముఖ్యఉద్దేశం ఒక్కటే: రిజర్వుబాంకును, అన్ని బాంకులమోస్తరుగా కేవలం బాంకు వ్యాపారం చేసుకునే సంస్థగా మాత్రమే పరిగణించరాదు; దేశంయొక్క ఆర్థికాభివృద్ధినిసరించి అది మునపటికన్న ఎక్కువబాధ్యతను వహించాలి అని. ఈమార్పులను నాలుగురకాలుగా విభజించవచ్చును:—

౧. రిజర్వుబాంకుమీద గవర్నమెంటుకు మునపటికన్న ఎక్కువ అధికారం వుండాలి;

౨. వర్తకవ్యాపారాలకి అప్పులిచ్చే బాంకుల మీద రిజర్వుబాంకుకు మునుపటికన్న ఎక్కువ కంట్రోలూ, బాధ్యతావుండాలి;

౩. రిజర్వుబాంకు ఇతరబాంకులకు తాకట్ల మీద అప్పులిచ్చే పత్రాలస్వభావం మారిపోవాలి; ఆ లిస్టులో ఇదివరకు లేని అనేకరకాలైన కొత్తపత్రాలనుకూడా చేర్చివాటిమీదకూడా అవసరాన్నిబట్టి అది అప్పులియ్యవచ్చును;

౪. రిజర్వుబాంకు చట్టాలను పై షరతులకు అనుకూలంగా మార్చాలి; అని.

ఇప్పుడు ఈదేశాలన్నిటిలోను రిజర్వుబాంకుయొక్క ముఖ్యోద్దేశం, దేశంయొక్క ఆర్థికవిధానాన్ని దేశాభివృద్ధికనుకూలంగా నడపడము; అంతేగాని ఇతర బాంకులమోస్తరుగా తానుకూడా కమకవృత్తిని ముడిచి పెట్టుకొని కూర్చొని లాభాలు సంపాదించుకోవడం కాదు, అని స్పష్టం అయింది. రిజర్వుబాంకుల ఈ కొత్త బాధ్యతల స్వరూపం నిరూపించడంకోసం, కెనడా, అమెరికాసంయుక్తరాష్ట్రాలు, ఆస్ట్రేలియా దేశాలలో కడచిన పదేళ్లలో అమలులోకివచ్చిన చట్టాలలోనుంచి కొన్ని ఉదాహరణలను ఇస్తున్నాను:—

దేశములో వున్న వివిధపరిశ్రమలకు, బాంకుల వద్దనుంచి, పరపతి సరిగా పుడుతోందో లేదో కనుక్కుంటూవుండి, అందుకు తగిన ఏర్పాట్లు చేయవలసిన బాధ్యత రిజర్వుబాంకుది; వర్తకవ్యాపారాలకు అప్పులిచ్చేబాంకులు, తమ పెట్టుబళ్లనూ, డిపాజిట్లనూ, దేశంలో వున్న ఆర్థిక పరిస్థితులకు తగిన లెవెలులో ఉంచుకునేటట్లు చూడవలసినబాధ్యత రిజర్వుబాంకుది; ఆబాంకులకు ధనసహాయం కావలసివున్నప్పుడు రిజర్వు బాంకు ఆలోచించవలసినప్రశ్న, ఆబాంకులు అందుకు తగిన హామీ ఇచ్చాయా, లేదా, అని కాదు; దేశం యొక్క ఆర్థికపరిస్థితులనుబట్టి బాంకులకు ఎక్కువ

పరపతి ఏర్పాటుచేయడం ఎంతవరకు అవసరం? ఆ పరపతిని ఏర్పాటుచేయడానికి అనుకూలమైన మార్గా లేమిటి? అని; దేశంయొక్క బాంకింగువిధానాన్ని సక్రమమైనపద్ధతులమీద నడపడానికి రిజర్వుబాంకు ముఖ్యమైన సాధనం; "దేశంలో వున్న బాంకు లన్నీ ఒకేరకం వ్యాపారానికి పెట్టుబళ్లు పెట్టడం అసంభవం కాబట్టి", అమెరికను ఫెడరలుబాంకు, ఇతరబాంకు లకు తాకట్లమీద అప్పు లియ్యతగ్గ హామీపత్రాల లిస్టులో తొమ్మిదిరకాలు పత్రాలుమాత్రమే చెప్పబడి వున్నప్పటికీ, ఇంతమాత్రాన ఇతరరకాలు పత్రాల మీద అప్పులు ఇయ్యగూడ దని నిషేధం లేదు అనీ, సమయానుకూలంగా ఇతరరకాలైన హామీలనుకూడా అంగీకరించి అప్పు లీయవచ్చుననీ, అమెరికను ఫెడ రలుబాంకుచట్టం స్పష్టంగా చెబుతోంది.

రిజర్వుబాంకుల బాధ్యతాస్వభావం నిరూ పించడానికి యీ ఉదాహరణలు చాలును. ఇట్టి పరిస్థితులలో నిరుడు మనదేశంలో సంభ వించిన బాంకుల దివాలాలలో రిజర్వుబాంకువారు షెడ్యూలు బాంకులకైనా ఎంతమాత్రం సహాయం చేయలేదు. అందుకు వారు చెప్పేసమాధానం ఏమిటి? "ట్రావంకూరు నేషనలు బాంకువారి వ్యాపారాన్ని గురించి ఇంకా కొన్ని వివరాలు కావాలని అడిగాము; అవి మాకు రాలేదు; అందువల్ల మేము ఏవిధమైన సహాయం చేయలేకపోయాము" అని. ఆరోజులలో రిజర్వుబాంకుచర్యను హిందూపత్రికలో ఒకరు ఈ విధంగా వర్ణించారు. "తన లాయర్ల సలహామీదనే తాను ఈవిధంగా నడుచుకుంటున్నానని రిజర్వుబాంకు చెప్పింది. ఆబాంకు చెప్పేదేమంటే: ఆక్టుప్రకారం మూడు నెలలలో చెల్లించవలసిన ప్రోనోట్లమీద తాను అప్పులీయవచ్చును; అడిగిన తక్షణమే చెల్లింపవలసిన ప్రోనోట్లు అట్టివికావు. బాంకులు సామాన్యంగా అప్పులిచ్చే ప్రోనోట్లు అన్నీ అడిగినవెంటనే చెల్లింప వలసినవి. కాబట్టి వాటి హామీమీద బాంకులకు తాను అప్పు లీయజాలదు; అంతే కాదు. ధాన్యంకొట్లు వగై రాల తాకట్టుమీదకూడా అప్పు లీయడానికి చట్టం ప్రకారం తనకు అధికారం లేదు. అనగా మనదేశంలో బాంకులు అప్పులిచ్చే రెండు హామీలమీదా, అనగా మామూలు ప్రోనోట్లమీదా, సరుకులకొట్లమీదా, రిజ ర్వుబాంకు అప్పు లీయరాదు: ఇది రిజర్వుబాంకు తనచర్యను సమర్థించుకుంటూ చెప్పిన వ్యాఖ్యానం. షెడ్యూలుబాంకులకు మిక్కిలి అవసరంగా సహాయం రావలసిన కష్టపురోజులలో రిజర్వుబాంకునుంచి వారి కేవిధమైన సహాయం రాలేదు-అడిగినవెంటనే చెల్లింప వలసిన ప్రోనోట్లు మూడునెలలతర్వాత చెల్లింపవలసిన ప్రోనోట్ల రకంకిందకు వస్తాయా రావా అన్నది ముఖ్య మైన విషయమే కావచ్చును. కాని చట్టం అనుమానా స్పదంగా వున్నప్పటికీ దేశ కాల పరిస్థితులతో దానిని సమన్వయం చేసి ప్రజలకు నష్టం కలుగకుండా బాంకు లకు సాయపడవలసినపూచీ రిజర్వుబాంకుమీద వుంది. రిజర్వుబాంకు ఈవిధంగా తప్పించుకొన చూడడం కంటే తనపైకం సురక్షితం అవునాకాదా అని ఆలో చిస్తే ఇంకా బాగుండేది. ప్రత్యక్షంగా చట్టం నిషే ధించనంతకాలం రిజర్వుబాంకు షెడ్యూలు బాంకు లకు సహాయం చేయవలసిందే."

క్రియలో రిజర్వుబాంకు, ఇతర బాంకులకు చేసినసహాయం— బండి సున్నా! ఇకముందైనా రిజర్వు బాంకు ఈవిధంగా తప్పించుకొని పోడానికి అవకాశా లుండగూడదని నిస్సందేహంగా చెప్పవచ్చును. "అత్త పోగొట్టినది అడుగోటికుండ; కోడలు పోగొట్టినది కొత్తకుండ" అన్నట్లు, రిజర్వుబాంకు తనలోపాలను మరిచిపోయి ఇండియనుబాంకులలోపాలను సవరించ బూనడం తనకే చెల్లును.

ఈమధ్య అమలులోకి వచ్చిన ఇన్సూరెన్సుసవరణ చట్టం, కంపెనీల సవరణచట్టం, మోస్తరుగానే బాంకు చట్టంకూడా ప్రత్యేకంగా అవసరమని అందరూ అంగీ కరించాలి. కాని మనంచేసే చికిత్సలు అసలురోగాన్ని పెంచరాదు; మొదటికే ముప్పు తేరాదు. రిజర్వుబాంకు వారు సూచించినట్లుగా, ఏచట్టా లైనా బాంకులో డబ్బు దాచుకున్నవారిని కాపాడ గలిగివుండాలి. అందుకు సందేహం లేదు. కాని వారుసూచించే సవరణలు ఆ వుద్దేశాన్ని నెరవేర్చగలవా అన్నదే సందేహం.

తగినంత మూలధనం లేకుండా బాంకీలను, బ్రాంచీ ఆఫీసుల్నీ స్థాపించడం కేవలం పొరపాటు మాత్రమేకాదు; ప్రమాదంకూడాను. ఐదువేలరూపాయలైనా మూలధనం లేకుండా ఢిల్లీలోను బొంబాయిలోను బ్రాంచిఆఫీసులు పెడుతూవున్న బాంకుల్ని మనం ఎరుగుదుం. అట్టి అకృత్యాల కికమీదట తావుండగూడదు అన్నమాట నిజమే. కాని వాటి కుండవలసిన మూలధనం, డిపాజిట్లు, మొత్తాలను నిర్ణయించడంలో అన్ని బాంకుల్నీ రిజర్వుబాంకువారి చట్టంలో సూచింపబడ్డట్లు ఒక్క కొలతబద్దతో కొలిస్తే లాభం లేదు. అన్నిటి పరిస్థితులూ ఒక్కమాదిరిగా వుండవు. చిన్న బాంకుల కర్యేశ్య ఆఫీసు ఖర్చులు వేరు; పెద్ద బాంకులకు వేరు. చిన్న ప్రదేశాలలో చిన్న బాంకులకే డిపాజిట్లు విరివిగా వస్తాయి; పెద్ద బాంకులకు వడ్డీ తక్కువ అని డిపాజిట్లు రావు. పెద్ద పట్నాలలో పెద్దబాంకులంటే ఎక్కువ నమ్మకం వుండి రేట్లు తక్కువైనా వాటికే ఎక్కువ డిపాజిట్లు వస్తాయి. అప్పుల విషయంలోకూడా అంతే. పల్లెటూళ్లలో చిన్న సంస్థలకు చిల్లర శ్రీమహాలక్ష్మి: పెద్ద సంస్థలకి అట్టి చిన్న వ్యాపారాలు గిట్టింపుకావు. కాబట్టి సంస్థలనుబట్టీ స్థలాలనుబట్టీ నిర్ణయింపులు మారుతూ వుండాలి. రిజర్వుబాంకువారి సూచనలు చిన్న సంస్థలను తలయెత్తుకోనీయకుండా అణిచివేస్తాయి అని అనేకులు భయపడుతున్నారు. చిన్నచిన్న వ్యాపారస్థులు, వ్యవసాయదారులు, పరిశ్రమలు వున్నంతకాలం చిన్నబాంకులుకూడా దేశానికి ఎంతో అవసరం. వాటిని నిర్మూలించడానికి ప్రయత్నించడం చాలా సాహసకార్యం. అవి క్రమక్రమంగా అభివృద్ధి కావడానికీ, ఒకదానితో మరొకటి ఐక్యమై బలం చేకూర్చుకోడానికీ మనం తోడ్పడాలి గాని అంత మందించడం భావ్యం కాదు. వాటివిషయంలో ఈబిల్లు తగినంత సానుభూతి చూపడంలేదు.

పైగా ఈబిల్లు చట్టం అయితే అనేకబాంకులు తమ మూలధనాన్ని వక్కసారిగా హెచ్చించవలసి వుంటుంది. అందులో ఎన్నో ఇబ్బందులున్నాయి. అవన్నీ వాటాలకోసం వక్కసారిగా మార్కెట్టుమీద పడితే ఆవాటాలగతి ఏమి కావలసింది? బాంకువాటాలధరలు పడిపోతే అందువల్ల ఎన్నో కొత్తచిక్కులు ఉత్పన్నం కాకమానవు.

బాంకులు తమడిపాజిట్లలో నూటికి కనీసం ౩౦ వంతులైనా రొక్క రూపంగాను, గవర్నమెంటు పత్రాలలోను వుంచుకోవాలన్న నియమం అందరికీ అందుబాటులో వుంటుందా? ఇంపీరియలుబాంకు ఉచితంగానో, లేదా ఏ ౧½ వడ్డీకో తనడిపాజిట్లను తెచ్చుకుంటుంది. ఆపైకొన్ని నూటికి ౩ రూపాయలు లభించే గవర్నమెంటుపత్రాలలో వుంచితే కడుపులో చల్ల కదలకుండా నికరంగా లాభం తేలుతుంది. ఇతరబాంకులు నూటికి ౩, ౪ వరకూ ఇస్తేనేగాని డిపాజిట్లు దొరకవు. వారు నూటికి ౩ రూపాయలు మాత్రమే వడ్డీ వచ్చే గవర్నమెంటుపత్రాలలో ఆపైకం వుంచితే వాటిగతి ఏమికావాలి? అవి తమ వాటాదార్లకి లాభాలు ఎల్లా పంచిపెట్టగలవు? లాభాలు పంచిపెట్టని బాంకులలో డబ్బెవరు వేస్తారు? కాబట్టి ఈనియమంవల్ల అవి నానాటికీ క్షీణింపుకు రాకతప్పదు. దేశకాలపాత్రాదులను గమనించకుండా బాంకులన్నింటికీ ఒకేపరిమితిని నిర్ణయించడం తగదు. బాల్యావస్థలో వున్నవాటికీ, యవ్వనంలో వున్నవాటికీ, నడివయస్సులో ఉన్నవాటికి వేర్వేరుమోతాదు లుండాలిగాని ఒకేమోతాదు పనికిరాదు.

ఈ చట్టంసందర్భంలో, రిజర్వుబాంకువారు ఈదేశంలో పాతుకుపోయిన విదేశీమారకం బాంకుల మాట మరిచిపోయినట్లుంది. మన కోస్తాలలో పనిచేస్తూవున్న విదేశీవర్తక నౌకా కంపెనీలు ఇండియను నౌకా కంపెనీలను అణగదొక్కి వేస్తూవున్నట్లే, విదేశవర్తకంలో ఈ విదేశీమారకం బాంకులు దేశవాళీ బాంకుల్ని తలయెత్తుకో నీయకుండా చేస్తున్నాయి. నూటికొక్క దేశవాళీబాంకు ఏలండనులోనో ఆఫీసు పెట్టుకుని విదేశవ్యాపారం నడుపుకుందామని సాహసించినా, ఈవిదేశబాంకులు సంఘాలుగా చేరి, ఆ ఇండియనుసంస్థను ఎదగనీయడంలేదు. రిజర్వుబాంకువారు ఈ మారకంబాంకుల్ని సమదృష్టితో చూస్తున్నాము అని వ్రాశారుగాని క్రియలో అది సమదృష్టి

కాదు. వారి చిత్తుబిల్లుప్రకారం, బాంకులు తమ డిపాజిట్లలో నూటికి ౭౫ వంతులు రొక్కంగాగాని, గవర్నమెంటు పత్రాలలోగాని, పౌనులలో వ్రాయబడ్డ హుండీలలోగాని, ఈదేశంలో వుంచవచ్చునట! ఈ మారకంబాంకుల వ్యాపారం పౌనులతో వుంటుంది కాబట్టి వాటికి చట్టం ఎట్టి ఇబ్బందినీ నష్టాన్నీ కలగచెయ్యదు! అవి వ్యాపారం చేసే హుండీబిల్లు, పౌనులలో ఇండియాలో ఉంటుంది; ఆపౌనులు మాత్రం లండనులో వుంటాయి ఇక అట్టి బాంకు దివాలా తీస్తే ఆ డబ్బంతా అదివరకే లండను చేరి వుంటుంటుంది కాబట్టి మన డిపాజిటర్లకు మిగిలేది 'మృత్తికాచమే' మట్టి!! ఇండియను బాంకుల దివాలాలను గురించి ఇన్ని కట్టుదిట్టాలు చేయబూనిన రిజర్వుబాంకువారు మారకంబాంకులను తలపెట్టకపోవడం ఎంతో శోచనీయమైన విషయం!!!

ఈచిత్తుబిల్లులో రిజర్వుబాంకుకీ షెడ్యూలు బాంకులకీ వుండేసంబంధం విశదం చేయబడ్డట్లు అగపడదు. పూర్వం కథలో "దేవతావస్త్రాల"లాగ షెడ్యూలులిస్టులో చేరిన బాంకుల హోదా చాలా దృశ్యాదృశ్యంగా అగపడుతోందిగాని స్పష్టంగాలేదు. రిజర్వుబాంకువారు, బాంకులలో ప్రజలు దాచుకున్న డబ్బును సంరక్షించడం తమ ముఖ్యోద్దేశ్య మంటున్నారే! అదినిజమే అయితే తమ ఉపదేశాలు కొంచెం తగ్గించుకొని వారినిగురించి కొంచెం ఎక్కువ శ్రద్ధను ఏల తీసుకోరు? తమకు ఎంత కష్టమైనప్పటికీ షెడ్యూలు బాంకుల వ్యవహారాలను తడవతడవకూ కనుక్కుంటూవుండాలి; వాటిమీద మునపటికన్న ఎక్కువపూచీ వహించాలి. అది కష్టమైనపని అయితే కావచ్చునుకాని ఆపూచీనుంచి తప్పించుకోవడం రిజర్వుబాంకువంటి కేంద్రసంస్థయొక్క లక్షణంకాదు. తాతాచార్యుల ముద్రవేస్తరుగా షెడ్యూలు లిస్టులో చేరడంతోటే ఆబాంకులు అన్ని తప్పిదాలకీ అతీతమైనాయి అని డిపాజిటర్లను భ్రమపెట్టడం న్యాయం కాదు. కొన్ని షెడ్యూలు బాంకులు ఆవిధంగా "మేము షెడ్యూలులిస్టులో చేరాము, మీడబ్బుకిక భయం లేదు. మాబాంకులో మీడబ్బును దాచుకోవచ్చును" అని ప్రకటిస్తున్నాయి. "నేతిబీరకాయ" వంటి "షెడ్యూలుబాంకు" అన్న నటనను దంభాన్ని ఇకముందు సాగనీయకూడదు. షెడ్యూలు బాంకులలో మన పైకాన్ని నిర్భయంగా దాచుకోవచ్చునన్న ధైర్యం సామాన్యడిపాజిటర్లకు సైతమూ కుదిరేటంత సురక్షితంగా అవి వుండాలి. 'షెడ్యూలుబాంకు' అన్నపదం ప్రజలనమ్మకానికి గుర్తుగా వుండాలి.

అదిగాక, మన బాంకుల దివాలాలకు ముఖ్య కారణాలు మేనేజర్ల, డైరక్టర్ల, అసమర్థతా, మోసబుద్ధీ అని చెప్పాలి. బాంకు మేనేజర్లూ డైరక్టర్లూ ప్రజలసొత్తుకు గార్డియన్లవంటివారు. వారు తమపూచీని గుర్తెరిగి సక్రమంగా ప్రవర్తించకపోతే తగినంతకఠినశిక్షకు పాత్రులయేటట్లు చట్టంలో నిబంధన లుండాలి. ఆ శిక్ష, ఇకముందు అట్టినేరాలు రాకుండా భయం కలుగజేసేటంత కఠినంగా వుండాలి. ఎట్టివారు ఆపనులకు అర్హులు? అన్నవిషయమై చట్టంలో కొన్ని నియమా లుండాలి.

ఇటువంటివిషయాలు కొన్ని ఈచట్టంలో ఆలోచింపవలసినవి వున్నాయి. ఇది చాలా ముఖ్యమైన బిల్లు. ప్రజలు అందరికీ సంబంధించినదేగాని ఏదో కొద్దిమంది ఇంగ్లీషు చదువుకున్నవారికి మాత్రమే సంబధించినది కాదు. కాబట్టి దీనిని మనవా రందరూ తగినశ్రద్ధతో పరిశీలిస్తారని నమ్ముతున్నాను.



# మాతృవందనము

శ్రీ భీమన

రసదీప్త, మ్మభిరామధామ, మమృతారామమ్ము, శృంగారకా
వ్యసుమారాధ్యరమాలయమ్ము, మధుగేయ, మ్మాదిరాగేశ్వరీ
రసనారంజిత శింజినీ ఝుణఝుణ ద్రాజత్పదన్యాస, మీ
వసుధారాణి తెనుంగువాణిచరణద్వంద్వ మ్ముపాసించెదన్.

నీరజ పారిజాతహాసనీ రజనీకుసుమస్రవ జామృత
శ్రీరుచమైన నిర్ఝరుల జేరి కులాసగ నాడు కూతులన్
వారివిచిత్రిత ప్రసవవల్లుల బోల్చుకొనంగలేక, సాం
ధ్యారుణనేత్రయై వెదకు నాంధ్రికి భక్తి నమస్కరించెదన్ !

కోటల కేళికాటవులా ? ఘోరగిరీగహనాంతరమ్ములో ?
మేటికుమారవీరులా ? తమిఁ జెరలాడు మృగేంద్రకోటులో ?
నాటికి నేటికిఁ విభజన మ్మొనరింపగ లేక, గాటపుం
గాటుకచూపులఁ సుతుల గాంచెడు తెన్గుసతిఁ స్తుతించెదన్.

శ్యామలసస్యపుష్కలము, స్వాదుఫలాభము, క్షేత్ర మేమొ ? ల
క్ష్మీమహనీయనాట్యముసుమీ! చెలిమైనది భాగ్యదేవి !! అం
చా మధుమూర్తికౌగిట నుషస్సుమనస్సుమనోజ్ఞమైన మా
శ్రీమహి, నాంధ్రభూమి, నభిషిక్త నొనర్చెద నాత్మపీఠికన్.

మబ్బుల నింద్రచాప మన భారతి వీట వసంతబాలగా;
కబ్బములందు గీత, వరగానములందున వాణివీణ, గా;
అబ్బురమౌ స్వయంప్రతిఫలాకృతదివ్యరుచుల్ వెలార, త
బ్బిబ్బులు పొందు విశ్వకవిబిడ్డ తెలుంగుకు కేలు మోడ్చెదన్.

ఈ వనసీమలందె నటియింపగనిమ్ము, నిరంతరమ్ము, శ్రీ
దేవిపదమ్ము, లందియలదే తొలిగానముగా; ప్రభావసం
జీవులు మా తెలుంగుల వసింపగ నిమ్ము, త్వదీయపాదప
ద్మావరణమ్ములో; విలయ మప్పుడునుఁ విడనాడకీశ్వరా !!

# బదరీనారాయణయాత్ర

శ్రీ మంత్రిప్రగడ నరసింహం

రెండవ భాగము

### గురుతు అక్షరములు

[ఏ] – ఒకటవతరగతి మకాం – చట్టీ. [బి] – రెండవతరగతి చట్టీ. [సి] – మూడవతరగతి చిన్న చట్టీ. [పో] – పోస్టుఆఫీసు. [టి] – టెలిగ్రాంఆఫీసు. [ఆ] – ఆసుపత్రి. [వై] – వైద్యశాల. [బా-కం] – బాబా కంబళీవాలా ధర్మశాల.

### మంజిలీలు

**హరిద్వారము:** ఇది హిమవత్పర్వతములకు పోవుటకు ద్వారము.

శ్లో. అయోధ్యా మధురా మాయా
కాశీ కాంచీ అవంతికా
పురీ ద్వారవతీ చైవ,
సప్తైతే మోక్షదాయకాః.

అని చెప్పబడిన మోక్షదాయకములగు సప్తపురములలోను నిది యొకటి. మాయాపురి యని చెప్పబడినదే హరిద్వారము. ఇప్పటికినీ, పట్టణములోని కొంత భాగము మాయాపురి యనియే పిలువబడుచున్నది. గంగానదికి ఒడ్డున నుండుటచే బహురమణీయముగా నుండును. ఇక్కడ గంగాదేవి దర్శనమైనది మొదలు, మనసులో నొక విధమగు ఆనందము జనించును. ఈపురమున, హిందూసనాతనధర్మము బాగుగా నిలచి యున్నదని చెప్పవచ్చును.

ఇక్కడ, యితరమతస్థులు శాశ్వతముగా నివసించకూడదని, స్థిరవసతి సంపాదించకూడదని, నియమముకలదట. రిజిస్ట్రారుఆఫీసుకు, రిజిస్టరీకి వచ్చు ప్రతిపత్రములోను, ఆయాఆస్తులను "మతాంతరులకు సంక్రమింపజేయము" అని యొకవరతు తప్పక యుండునని, హరిద్వారము రిజిస్ట్రారుగారు నాతోఁ జెప్పి యున్నారు. ఇంత పెద్దగ్రామములో, నొకమసీదు గాని, క్రైస్తవులచర్చి (**Church**) గాని కానరాదు. పట్టణ సరిహద్దులలో, మేకలు, గొర్రెలు మొదలగు వాటిని చంపగూడదనియు, పక్షులను కొట్టగూడదనియు, చేపలను పట్టగూడదనియు, సారాయి, బ్రాంది, మొదలగు మత్తు పదార్థములు, అమ్మగూడదనియు నిబంధనకూడా గలదట. పట్టణములో ఒక్కకసాయి దుకాణమైననూ కనబడదు. నదిలోని చేపలు గొప్ప పరిమాణమునకు పెరిగి, వేలకొలది పెంపుడుచేపలవలె, నీటిలో దిగినవారి కాళ్ల చుట్టూ నిర్భయముగా తిరుగుచుండును. అహింస యీపురమున యెంత చక్కగా నెలకొని యున్నదో చూడుడు!

ఇక్కడ, శాస్త్రప్రకారము బ్రహ్మచర్యము జరుపు, బ్రహ్మచర్యాశ్రమములు కలవు. వేదాధ్యయనముచేయుచు, బ్రహ్మచారులు గురువువెంట బోవుచుండగా చూచుట కన్నులపండువుగా నుండును. వానప్రస్థులకు వానప్రస్థాశ్రమ మొకటి కలదు. ప్రాచీన విద్యలను నిలబెట్టుటకు, ఋషికులము, గురుకులము, అనుసంస్థలున్నూ, ఆయుర్వేదకాలేజీలు, ఔషధములు శాస్త్రరీత్యా తయారుచేయు ఆలయములుకూడా కలవు. ఎక్కడ చూచిననూ వేలకొలది సాధువులు కనబడుచుందురు.

పట్టణ మంతయూ, ఆహ్లాదకరమగు మతసంబంధ వాతావరణముతో నిండియుండును.

హరిద్వారమునకు సమీపముననే, పూర్వము దక్షప్రజాపతి యజ్ఞముచేసిన యజ్ఞశాల కలదు. దక్షుని హోమకుండమును, "సతీకుండము" అను పేరున, సతీదేవి నిర్యాణము నొందిన ప్రదేశమును జూపుదురు.

ధర్మశాలలు, సాధువులకు సదావర్తులు, రొట్టెలు యిచ్చు ధర్మసంస్థలు, అనేకములు కలవు.

మదరాసీయులకు చాలా సౌకర్యమగు ధర్మశాల, "మదరాసీధర్మశాల" యను పేరున, వి. పెరుమాళ్ల శెట్టి అందు సన్సు యొక్క యాజమాన్యము క్రింద జరుగుచున్నది.

**హృషీకేశము:** [ఏ] - [పో] - [టె]- [బా. కం]-[ఆ] ౧౫ మైళ్లు.

ఇదియు నొక గొప్పక్షేత్రము. ఇక్కడ సరస్వతి యను చిన్నవది గంగానదిలో కలియును.

బాబా కంబలీవాలా ధర్మసంస్థలకు కేంద్రస్థానము. పంజాబీధర్మశాల యను నొక గొప్ప ధర్మశాలయు, యింకా చాలా యితర ధర్మశాలలును గలవు.

గంగానది యిక్కడ బహువేగముగా నుండును.

ఇక్కడ చూడదగినవి: (౧) రామచంద్రమందిరము: బహురమణీయమగు నవీనాలయము.

(౨) భరతాలయము: అయిదవ శతాబ్దములో కట్టబడిన ప్రాచీనాలయము.

(౩) స్వర్గాశ్రమము:

(౪) కైలాసాశ్రమము: శ్రీ జ్ఞానానందస్వామి వారి శిష్యులు శ్రీ ప్రణవానందస్వామిచే స్థాపింపబడినది.

**మునికీరేతీ:** [సి] ౧౬ మైళ్లు. ఇక్కడ, కూలీల యేజన్సీలు కలవు.

**లక్ష్మణఝూలా:** [సి] - [బా. కం.] ౨ మైళ్లు. ఇక్కడ గంగానది పడమటియొడ్డునుండి తూర్పుటొడ్డునకు దాటుటకు, స్తంభములు లేకుండా ఉక్కుపగ్గములచే వ్రేలాడకట్టబడిన గొప్పవంతెన (**Suspension bridge**) కలదు. హిందూదేశములోని యిట్టివంతెన లన్నిటిలోను నిది గొప్పదని చెప్పెదురు.

గంగ పడమటియొడ్డున మోటారురోడ్డు, తూర్పు ఒడ్డున కాలినడకమార్గము కలవు.

గంగానదిలో స్నానమున కిక్కడ చాలా బాగుండును.

ఇక్కడ చూడదగినవి: (౧) లక్ష్మణస్వామి యాలయము, (౨) బ్రహ్మచర్యాశ్రమము.

**గరూర్ఖాచట్టీ:** [సి] ౨ మైళ్లు.

**ఫూల్‌వారీ:** [సి] ౨ మై.

**గులార్‌చట్టీ:** [బి] ౨ మై.

**నయామోహన్:** [బి] ౩ మై.

ఇక్కడవరకూ రోడ్డు నిదానముగా నుండును. ఇక్కడనుండి మార్గము నాలుగు మైళ్లు యెక్కుడు.



౧. లక్ష్మణఝూలావద్ద గంగానది

**చమోటీ బిజానీ:** [సి] ౨ మైళ్లు.

**బర్ఘీబిజానీ:** [బి] ౧ మై.

**కుండుచటీ:** [సి] ౩ మై.

**బందర్‌భేల్:** [సి] ౩ మై. గంగయొడ్డుననున్నది.

**మహాదేవ:** [బి] ౩ మై.

**నెమాల్‌చట్టీ:** [సి] ౪ మై. రోడ్డు యెక్కుడుగా నుండును.

**కండిచట్టీ:** [బి]-[వై] ౩ మై.

వ్యాసఘట్టు : [బి] - [పో] [బా. కం.] ౮ మై.

ఇక్కడ నుండి ౩౬ మైళ్లు రోడ్డు భట్టి సారా వరకు నిదానముగా నుండును.

ఉంరాసు : [సి] ౫ మై.

దేవప్రయాగ : [ఏ] - [పో] - [టి] - [బా. కం]- [వై] ౮. మై.



౨. లక్ష్మణఝూలా సస్పెన్షన్ వంతెన

భాగీరథి, అలకనంద నదుల సంగమమున నున్నది. ఇక్కడనుండి యొకరోడ్డు భాగీరథియొడ్డున, యమునోత్రి, గంగోత్రులకుఁ బోవును. ఇంకొకమార్గము అలకనందా నది యొడ్డున బదరీ నారాయణమునకుఁ బోవును. ఈ గ్రామము రెండు భాగములుగా నున్నది. రెంటికి నడుమను నదిపై వంతెన కలదు. పడమట నున్న గ్రామము తెహరీరాజ్యము వారిది. తూర్పుభాగము బ్రిటిషుగవర్నమెంటుకు చేరినది. హరిద్వారములోగాని, హృషీకేశములో గాని కూలీలను, డోలీలను యేర్పాటు చేసుకొననివారు, యిక్కడ యేర్పాటు చేసుకొనవచ్చును.

కులాసుచట్టి : [సి] ౫ మైళ్లు.

రాణీబాగ్ : [బి] ౨౩ మై.

కొల్ట : [సి] ౧౩ మై.

రామాపురం : [బి] ౨ మై.

విల్వకేదార్ : [బి] ౨౩ మై.

శ్రీనగరం : [ఏ ] - [పో] - [ర ] - [ బా. కం.] - [ వై] ౩ మై. ఇది యీ రోడ్డుమీది గ్రామము లన్నిటిలోను, పెద్ద గ్రామము. అనేక షాపులు కలవు. అన్ని వస్తువులు దొరకును. రెండు మూడు ధర్మశాలలు గలవు. ఇక్కడవరకు మోటారురోడ్డు శీఘ్రములో తెరువబడును.

సుకృత : [సి] ౫ మై. ఇది చాలాఉన్నప్రదేశము.

భట్టిసేర : [బి]-[పో] - [బా. కం.] ౩ మై. దేవ ప్రయాగమొదలు యిక్కడవరకు రోడ్డు నిదానముగా నుండును. ఇక్కడనుండి రుద్రప్రయాగవరకు బహుకష్టము. మూడుకొండలు ఎక్కి దిగవలసియుండును. మధ్య కంకారాలో మకాం చేయవలయును. ఇక్కడ చక్కని కొండ నీటిప్రవాహము కలదు.

కంకార : [బి] ౩౩ మై. చట్టీలకు సమీపమున చక్కని కొండనీటిప్రవాహము కలదు.

నార్కోట : [సి] ౨౩ మై.

గులాబ్‌రాయి : [బి] ౩౩ మై. ఇక్కడ బసకు అనుకూలముగా నుండును. చట్టీల యొద్ద మామిడి చెట్లు కలవు. నీడగా నుండును.

రుద్రప్రయాగ : [ఏ] - [పో] - [టి] - [బా. కం] [ వై ] ౩ మై. అలకనందా, మందాకినీ నదుల సంగమస్థానమున నున్నది. మందాకినియొడ్డున నొకరోడ్డు కేదార క్షేత్రమునకుఁ బోవును. అలకనందయొడ్డున మార్గము బదరికి బోవును. కంబళీవాలా ధర్మశాల బహు జనసమ్మర్దము గాను, చీకాకుగాను ఉండును. పాయిఖానా లేదు. నదుల సంగమమునకు సమీపమున, స్వామి సచ్చిదానందయను జాత్యంధులగు యతీశ్వరులు "రుద్రనాథజీ మందిరము" అని బాటసారులకు, పరిశుభ్రమగు గదులు కట్టించినారు. నీటివసతి,

పాయిఖానాకూడా కలవు. వీరు ధర్మవైద్య శాలకూడా పెట్టించిరి.

ఈ ప్రదేశ ముష్ణముగా నుండును.

**శివానంది:** [బి] ౪ మై.

**హరిఆశ్రమం:** [బి] ౮ మై. ఇది సదుపాయమగు చట్టీ. ఇక్కడ దుకాణములో బిస్కట్లు మొదలగు చాలాసరుకులు దొరుకును.

**ఖమేరా:** [పి] ౩/౪ మై. హరి ఆశ్రమమునకు బహు సమీపమున నున్నది.

**గౌచార్:** [పి] ౩ మై. వాయు విమానముల స్టేషను. ఢిల్లీనుండి, హరిద్వారమునుండి, వాయువిమానము లిక్కడికివరకువచ్చును.

**ఖాటువాపీపల్:** [బి] ౨ మై.

**కర్ణప్రయాగ:** [ఏ] - [పో] - [టి] - [ఆ] - [బా. కం] ౮ మై.

పిండారి గంగ, అలకనంద సంగమప్రదేశము.

**కమలగిరి:** [సి] ౨ మై.

**ఉమ్మట్ట:** [సి] ౩/౪ మై.

**జయకంది:** [సి] ౧౪ మై. మంచి నీటివసతి కలదు.

**నంగాసు:** (లంగాసు) [బి] ౨ మై. ఇక్కడ పెద్దచట్టీ కలదు. ముందుమకాముకు పోవులోపల కొండ ఎక్కుడు, దిగుడు కలవు.

**సోనల:** [బి] ౩ మై.

**నందప్రయాగ:** [ఏ] - [పో] [టి] - [వై]- ౩ మై. పెద్దగ్రామము, మందాకినీ, అలకనందానదుల సంగమస్థానము. చాలా దుకాణములు కలవు.

**మిట్టనః** [సి] ౩ మై.

**కోహేడ్:** [పి] ౨ మై. వంతెన దాటినతర్వాత మంచి చట్టీయున్నా, దానిసమీపమున మంచి జల ధారయు కలవు.

**చమోలి:** [ఏ]- [పో] - [టి]- [ఆ]- [బా. కం] ౨ మై. చాలా పెద్దగ్రామము. అనేకమంది ఆఫీసర్లమకాం.

**మఠచట్టీ:** [బి] ౨ మై. తోటలుగల చల్లని ప్రదేశము. చమోలీకంటె, మకాం చేయుటకు యిక్కడ ఎక్కువ బాగుండును. ఇక్కడనుండి అరమైలు రోడ్డు ఎక్కుడుగా నుండును.

**చింకా:** [సి] ౧ మై.

**బవాలా:** [సి] ౧ మై.

**సియాసేన్:** [బి] ౨ మై. ఇది మంచి మకాం. చట్టీలు బాగుండును.

**హాట్:** [సి] ౧ మై. వంతెన దాటిన తర్వాత రోడ్డు ఒకమైలువరకూ ఎక్కుడు.

**పీపల్కోటి:** [బి]- [పో]- [బా. కం] ౨ మై. చాలా దుకాణములు కలవు. మృగముల చర్మములు, చామరములు అమ్మబడును.

**గరూర్ హగంగ:** (గరుడగంగ) [సి]- [బా. కం] ౮ మై. ఇక్కడ నదీస్నానమున కనుకూలముగా నుండును. ఇక్కడనుండి చలి ప్రారంభమగును.



౩. చట్టీ: రాణీబాగ్

పూలుదుస్తులు ధరించ నవసరమగును. రోడ్డు కొంతవరకూ యెక్కుడు.

తంగాణి: [బి] ౨ మై. మంచిచట్టీ, ధర్మశాల కలవు. పాతాళగంగవరకూ, రోడ్డు ప్రమాదకరముగా నుండును. వర్షముకురిస్తే కష్టము.

పాతాళగంగ: [సి] ౨ మై. నదీస్నానము బాగుండును. కాని, చట్టీలు అసహ్యముగా నుండును. ఈగలబాధ చాలా యెక్కువ.

గులాబ్‌కోటి: [బి] ౨ మై.



౮. పర్వతములనడుమ అలక్నందానది

కుంబార్: [బి]౩ మై. చాలామంది బసచేయుమకాం.

ఖనేటి: [సి] ౨ మై.

ఘూర్‌కులా: [సి] ౧ మై. సుమారుగా పెద్దచట్టీ.

సింగధార: [బి] ౨ మై.

జోషీమఠం: [బి] — [పో] — [టె] — [బా. కం] — ౧ మై. ఇది శ్రీరావల్‌గారి శీతకాలపు మకాం. బదరియాలయము మూయబడిన యారుమాసములు, వారిక్కడ నుందురు.

ఇక్కడ మఠము శ్రీ శంకరాచార్యులవారు స్థాపించి, శ్రీ త్రోటకాచార్యులవారిని మఠాధిపతిగా నియమించిరని చెప్పుదురు. అప్పటినుండియు, నేటివరకు యిక్కడను, బదరిలోను, మఠాధిపతులు మలయాళం బ్రాహ్మణులు.

గొప్పపదవిగల బాటసారులకు బసయిచ్చుటకు రావల్‌గారితాలూకు మంచి బంగాళా యొకటి కలదు. ఇక్కడనుండి బదరివరకు మార్గము కష్టము. విష్ణుప్రయాగవరకు రోడ్డు ౨ మైళ్లు గొప్పదిగుడుడు.

విష్ణుప్రయాగ: [సి] ౨ మై. విష్ణుగంగ, అలకనంద సంగమము.

బల్‌దామా: [సి]- [బా. కం] ౧ మై.

ఘాట్‌చట్టీ: [సి] ౨౩ మై. ఇక్కడ చట్టీ వృద్ధియగుచున్నది. ఒక పరిశుభ్రమైన చట్టీ క్రొత్తగా కట్టబడినది. ఇది బాటసారుల కద్దె కివ్వబడునని వింటిని.

పాండుకేశ్వరము: [బి] - [బా. కం]-]పో] ౨౩ మైళ్లు. సుమారుగా పెద్దగ్రామము. మృగముల చర్మములు, చామరములు ఖరీదుకు దొరకును.

ఇక్కడ శ్రీ రావల్‌గారిగృహ మొకటి కలదు. చట్టీలకంటె సదుపాయముగా నుండును.

వినాయకచట్టీ: [సి] ౨ మై.

లంబఘుర్: [సి]-[బా. కం.] ౧ మై. ధర్మశాల, చట్టీలుకూడా బహు అశుభ్రముగా నుండును.

హనుమాన్‌చట్టీ: [సి] - [బా. కం.] ౩ మైళ్లు. ఇక్కడనుండి బదరికి పోవుమార్గములో చాలా చోట్ల మంచుపై నడువవలసియుండును. మంచు, గడ్డగా కాక, తడిసిన తెల్లమట్టికయినుకవలె నుండును. జోళ్లు తొడుగుకొని, చేతికర్ర ఆనుకొనుచు, జాగ్రత్తగా నడువవలయును. రోడ్డు చాలాభాగము యెక్కుడు.

బదరీనాథ: (పూరి)-[బి]-[పో]-[టె]-[ఆ]-౫ మైళ్లు.

---

## మూడవభాగము

## నాప్రయాణపు దినచర్య (Diary)

౨౬-౪-౧౯౩౯ : మదరాసునుండి, పెషావర్ ఎక్స్‌ప్రెస్‌లో ఉదయము ౭-౪౫ గంటలకు బయలు దేరితిని. నావెంట, వంటబ్రాహ్మడు సోమన్న మాత్ర ముండెను. నాకుటుంబమువారు, మిత్రులు సాగనంపిరి.

బెజవాడలో వాజపేయాజుల సుబ్బయ్య భాగవతార్ కూడా మావెంట యాత్రకు వచ్చుటకు మమ్ములను కలసెను. ఇక్కడనుంచి బదరీయాత్రకు వచ్చుచున్న పదమున్గురు వైశ్యుల పార్టీకూడా రైలు రెక్కిరి. వారిలో స్త్రీ పురుషులు, వృద్ధులుకూడా కలరు.

౨౭-౪-౩౯ : ఉదయము ౧౦ ఘంటలకు నాగపురము చేరి, ఆరోజున అక్కడ ఆగితిమి. టి. రాజులు నాయుడుగారు అను యాంధ్రులు, యీపుర వాసులు, నన్నుకలుసుకొని, నాకు సదుపాయములను కుదిర్చిరి. రైల్వే రిటైరింగు రూములో (Retiring Room) విడిసియుంటిమి. రోజుకు నాల్గు రూపాయలు అద్దె. సదుపాయముగానే యున్నది. హోటలు దగ్గరనే కలదు. ఈనగరము వేసవిలో అగ్నిహోత్రముజ్వాలగా నుండును. ఉష్ణము దుర్భరముగానుండెను. గదిగుమ్మములకు వట్టివేళ్లతడికెలుకట్టుకొని సర్వదా వాటిపై చన్నీళ్లు పోయించుచు, సాయంత్రం ౫ ఘంటలవరకును గదిలోనే కూర్చొనవలసివచ్చినది. అప్పుడు నగరము చూచుటకు బయలుదేరితిమి. అప్పుడునూ, గాలి అగ్నివలె వీచుచుండెను. హైకోర్టుజడ్జిగారగు ఆంధ్రులు గౌరవనీయులు, నియోగిగారిని చూడవలెనని వారియింటికి వెళ్లితిమి. వారు గ్రామాంతరము పోయియుండిరి.

౨౮-౪-౩౯ : ఉదయము ౧౦ ఘంటలకు తిరిగీ రైలెక్కితిమి. దారిలో ఉష్ణము దుర్భరముగా నుండెను. మంచినీళ్లకూజాలోని నీరు పూర్తిగా ఖర్చు పడినది.

౨౯-౪-౩౯ : ఉదయము ౮-౧౦ కు ఢిల్లీనగరము చేరితిమి. మిత్రులు సి. వి. నారాయణరావుగారు కలుసుకొని, వారిగృహమున నాతిథ్యమిచ్చిరి.

ఇక్కడనుండి తిన్నగా హరిద్వారము పోదలచితిమి. గిరిజోలామార్గమున, దగ్గరదారిని, పోవలెనని యెంచితిమి. కాని రైల్వే యధికారులు అభ్యంతర పరచిరి. నేను, యాత్రికులు తీసికొనెడు ౩ నెలల యాత్రటిక్కట్టు (Circular tour ticket) పుచ్చుకొంటిని. దానిలో, ఢిల్లీనుంచి కురుక్షేత్రము, అక్కడనుంచి హరిద్వారము, అనియున్నది. "కురుక్షేత్రము నేను వెళ్లదలచుకోలేదు, తిన్నగా హరిద్వారమునకే, దగ్గిర దారిని వెళ్లెదను" అని చెప్పినను, వినక, కురుక్షేత్రము మీదుగానే వెళ్లకతప్ప దనిరి! కనుక, కురుక్షేత్రం, అంబాలా, మార్గమున చుట్టుతిరిగి పోవలసి వచ్చినది. మధ్యాహ్నము ఢిల్లీలో రైలెక్కి, ఉదయము ౫-౪౬కు హరిద్వారము చేరితిమి. అర్ధరాత్రివేళ జంక్షనులయొద్ద రైళ్లు మారవలసి వచ్చినందున నిద్రాభంగము కలిగినది.

౩౦-౪-౩౯: హరిద్వారములో మదరాసీ ధర్మశాలలో బసచేసితిమి. ఇది చాలాసదుపాయమైన ధర్మశాల. గంగానది యొడ్డుననే యున్నందున, అనుక్షణము శ్రీ గంగామాతదర్శనముచే నాహ్లాదకరముగా నుండును. పరమపవిత్రమగు బ్రహ్మకుండములో స్నానము చేసితిమి. పెద్దచేపలు మనకాళ్లచుట్టూ తిరుగుచుండును.

సాయంత్రము బ్రహ్మకుండముయొద్ద భజనలు, పురాణశ్రవణములు, చేపలకు ఆహారమువేయుట, సాధు సమారాధనలు చూడతగ్గవి.

౧-౫-౩౯, ౨-౫-౩౯: హరిద్వారము. నాస్నేహితు లొకరి ప్రేరణమీద, హరిద్వారము సబ్ జిస్ట్రారుగారు నన్ను కలుసుకొని చాలా సహాయము చేసిరి.

ఋషికులము, గురుకులము, రామకృష్ణసేవాశ్రమము, దక్షప్రజాపతియజ్ఞశాల, మొదలుగునవి చూపిరి. ఋషికులములో ప్రధానోపాధ్యాయులు, వేదాచార్యులు, వ్యాకరణాచార్యులను కలసి వారితో ప్రసంగించితిని.

౩-౫-౩౫: హరిద్వారం: ఈరోజున పిండశ్రాద్ధము చేసితిమి. అనవసరమైన సామానులు, ధర్మశాల మేనేజరుస్వాధీనములో దిగవిడిచి, ముఖ్యముగా కావలసిన స్వల్పసామానులుమాత్రము వెంట నుంచుకొని, సాయంత్రం మోటారుబస్సుమీద ప్రయాణ మైతిమి. దేవప్రయాగనుండి, మావెంట సామానులు మోయుటకు యిద్దరు కూలీలను, ఒక్కొక్కడికి ౬ రూ.ల చొప్పున కుదుర్చుకొంటిమి. కాలినడకనే వెళ్లుటకు నిశ్చయించి, డోలీలు కుదుర్చుకొనలేదు. సాయంత్రం ౭ ఘంటలకు హృషీకేశము చేరితిమి. కూలీలయేజన్సీవారితరఫున నొకరు మమ్ములను కలుసుకొని, "గోపాలకుటి" యను నొక పరిశుభ్రమగుచిన్న ధర్మశాలలో బస యేర్పరచిరి.

ఈ రాత్రి ౮ ఘంటలకు చంద్రగ్రహణమగుటచే, గంగానదిలో ౮½ ఘంటలకు స్నానము చేసితిమి. వేలకొలది స్త్రీ పురుషులు, గంగానదిలో గ్రహణ స్నానమునకు, చుట్టుపట్ల గ్రామములనుండికూడా వచ్చిరి. నదీతీర మంతయు భజనలతోను, హోమముల తోను, స్నానములు చేయువారితోడను కిటకిటలాడుచు కన్నులపండువుగా నుండెను.

౪-౫-౩౯: హృషీకేశము: ఉదయము గంగలో స్నానముచేసి, పితృతర్పణములు చేసుకొని, శ్రీరామ మందిరము అనునొక చక్కని నవీనాలయము, భరతాలయమను ప్రాచీన ఆలయము సందర్శించితిమి.

సాయంత్రము, తెహరీరాజ్యపు వెనుకటి దివాన్ జీగారిని కలుసుకొని, వారిద్వారా "స్వామి శివానందజీ"యను గొప్ప యతీశ్వరులను కలుసుకొంటిమి. నదికి అవతలియొడ్డుననున్న స్వర్గాశ్రమము, హృషీకేశమునకుమార్గములోనున్న కైలాసాశ్రమమును జూచితిమి.

౫-౫-౩౯: హృషీకేశమునుండి ౧౧ ఘంటలకు మోటరు బస్సుమీద బయలుదేరి, సాయంత్రం ౮½ ఘంటలకు దేవప్రయాగ చేరితిమి.

హిమవత్పర్వతములలో నలుబదినాల్గు మైళ్లు మోటరుప్రయాణము బహురమణీయముగా నుండెను. కాని, కొన్నిచోట్ల బహుభయాస్పదముగా నుండును. రోడ్డు మిగుల వొంకరలు గలిగి యుండును. క్రమముగా కొండయెక్కగా, కొన్నిచోట్ల భూమిమట్టమునకు రెండు మూడు వేల అడుగుల యెత్తున బస్సుపోవునపుడు, దాని చక్రము రోడ్డు అంచుకు ఎనిమిది, పది అంగుళములు మాత్రమే యుండగా, ప్రమాదనుచే



౫. చమరీమృగము

చక్రము రోడ్డు అంచును దాటినచో, యేమి సంభవించునోగదా యని, గుండె ఝల్లుమనుచుండును. రెండు గొప్ప కొండలనడుమ, రెండువేల అడుగుల దిగువను నది వంకరటింకరలుగా, త్రాచుపాము ప్రాకుచున్నట్లగు పడుచుండును. పర్వత పార్శ్వములలో నక్కడక్కడ, అత్యున్నత ప్రదేశములలో, చిన్న గ్రామములను, వాటిలో వ్యవసాయమును, కానవగును. ఒక కొండనుండి యింకొక కొండకు దాటి, అనేక పర్వతముల మీదుగా, హిమవత్పర్వత సౌందర్యములను జూచి యానందించుచు, చేసినప్రయాణము, తలంపునకు వచ్చినపు డెల్ల మనస్సున కాహ్లాదము కలుగును.

దేవప్రయాగలో మేము కుదుర్చుకొన్న కూలీలు కలుసుకొనిరి. వంతెన దాటిపోయి గవర్నమెంటు దేవప్రయాగలో, కంబళీవాలా ధర్మశాలలో నొక గదిలో బసచేసితిమి. పెరడు లేకపోవుటచే మరుగు లేక యాత్రికులు చాల ఇబ్బందిపడవలసి వచ్చును!

ఆయుర్వేదవైద్యశాల డాక్టరుగారి యాహ్వానమువై, ఆ వైద్యశాలను సందర్శించితిని.

౬-౫-౩౯ : తెల్లవారుజామునసే లేచి, కాలోచితములు తీర్చుకొని ౫గంటలకే నడక ప్రారంభించితిమి. సాలూరునుండి యాత్రకువచ్చిన యిరువురు కోమట్లు కూడా మా జట్టులో చేరిరి. కూలీలకు సామానులు రొత్తి, ప్రయాణము ప్రారంభించితిమి. ఆచల్లని సమయమున, నదియొడ్డుననే నడచుట, యేమియు శ్రమ యనిపించలేదు. మా జట్టులో కొందరు వేగముగా నడువలేక వెనుకబడిరి. కూలీలు బరువుల నక్కడక్కడ దింపుకొనుచు వచ్చుచుండుటచే బాగుగా వెనుకబడిరి. నేను, సాలూరు కోమట్లలో నొకరు, కలసి ముందుగా నడచిపోయి, ౪½ ఘంటలలో ౭½ మైళ్లదూరమున నున్న మొదటిమకాం, రాణీబాగ్ అనాయాసముగా జేరితిమి. మిగిలినవారు కూలీలవెంట తర్వాత ఘంటంపావుకు చేరిరి. కూలీలు మావెంట నడువలేరని కనిపెట్టితిమి. అప్పటినుండియు, వాళ్లను విడిచి మేము ముందునకు నడిచిపోవగా, వాళ్లు మావెనుక, ఘంట, ఘంటంపావుకు బసచేరుచుండిరి.

చట్టీలో బస యిదే ప్రథమము. చాటసారు లొకరిప్రక్క నొకరు వంటచేసుకొందురు. జాతి, మత భేదములకును, దృష్టిదోషములకును అవకాశము లేదు.

అలకనందానది చట్టీకి, ౫౦, ౬౦ అడుగుల దిగువ నున్నది. నదిలో స్నానముచేసితిమి.

దుకాణదారువద్ద కావలసిన సరుకులు కొనుక్కొని, వంటచేసుకొని భుజించి సాయంత్రము ౩½ ఘంటలవరకు విశ్రమించి, తిరిగి పయనమైతిమి.

రాంపురం అనుమకాం ౩½ మైళ్లు దూరము, సాయంత్రమునకు జేరి, రాత్రి యక్కడ విశ్రమించితిమి. దాక్షిణాత్యులు, మదరాసు వాస్తవ్యులు, రాజంగారున్నా, వారి వెంట నిరువురు స్త్రీలున్నా, ఒక నౌకరున్నా, రాణీబాగ్‌లో మేమున్న చట్టీలోనే దిగిరి. ఇంతటినుండి మా రెండు పార్టీలున్నా, కలసి ప్రయాణము చేయుటకు నిశ్చయించితిమి.

౭-౫-౩౯ : రాత్రి బాగుగానే నిద్రించితిమి. కాని, మాకు యెదురుగా నున్నచట్టీలో మకాంచేసిన బైరాగులు, తెల్లవారుగట్ల మూడుఘంటలకే లేచి, పాటలుపాడుచు, ప్రయాణ మారంభించుటచే, మాకు నూ నిద్రాభంగ మైనది. మేమున్నా ౮ ఘంటలకే నడక ప్రారంభించితిమి. మందమగువెన్నెల వృక్షశాఖల నడుమనుండి ప్రసరించుచు మార్గమును చూపుచుండ, ప్రయాణికుల యలజడిచే, గూళ్లలో నిద్రించుచున్న పక్షులుకూడా లేచి, మృదుమధుర స్వరములతో గానము చేయుచుండ, నిశ్శబ్దమగు అడవిలో, అలకనందానదీకలకలారావము వీనుల విందుగొలుప, నడచుట హృదయరంజకముగా నుండెను. ఈప్రాంతములలో ఉదయము ౮½ ఘంటలకే ప్రభాత మగును. రాత్రి ౭½ ఘంటలవరకూ సంధ్యారాగ ముండును. ఆరుఘంట లగునప్పటికి విల్వకేదారము అనుచట్టీ చేరితిమి. ఇది నదియొడ్డుననున్న చక్కని చట్టీ. ఇక్కడ ఆగక, ౩½ మైళ్ల దూరముననున్న శ్రీనగరమునకు నడచిపోయి, ౭ ఘంటలకు జేరితిమి. నెమ్మదిగా నడచువారు ౮ గంటలకు జేరిరి.

(సశేషము.)

# కాటకం

శ్రీ చిఱుమామిళ్ల విజయపార్థసారథి

(అనువృత్తము)

శిల్పిమలచిన నందిజతవలె
శైలప్రతిబింబంపురూపము
నదిలో నందులరేవటంచును
నలుగురాడంగా.

దండకాటవి రామచంద్రుడు
తరుణితో తిరుగాడుచుండి
వచ్చి అతిథిగ నుండెను భర
ద్వాజ మామునికి.

ద్వాపరమ్మున పాండవులు తల
దాచుకొనుచు సతినిగూడి
భక్తిమెయి స్నానములు చేసిరి
ముక్తితీర్థమని.

సీతమ్మతల్లి ఆరవేసిన
చీరలంచు ద్రౌపదమ్మ
కట్టుపుట్టము లంచు నేటికి
గాథ లుండుటచే.

కారుమల్లిన పేరటాండ్రు
కడగివైచి రేవుబండలు
పసుపురాచి బొట్టుపెట్టి
ప్రణుతిచేసెదరు.

ఏటవాలుగ సానుతలముల
పాటుచూడగ దూరమునకు
విశ్రమించిన కరులబోలుచు
ప్రేక్షణీయమ్ము.

నాటిఅలకాపురపుగాథ
చాటిచెప్పెడు కొండకొమ్మల
జలధరమ్ములు విరహిజనులకు
జ్ఞప్తిబారగను.

పిచ్చపాటితో సాగిపోయె
ముచ్చటలతో వారటుండగ
నడుముకట్టి యమర్చెదుర్ పా
నకపుబిందియలు.

కావడికి రూపాయ యిచ్చే
కట్టడుండుటచేత రోశయ
ఏటినుండి నీళ్లు మోసెను
శీతలమ్మునకు.

సహస్రనామముతోటి అర్చన
సాగిపోవుచునుండ రోశయ
చేసి సాష్టాంగప్రణామము
చిత్తమర్పించెన్.

చోద్యముల ఆయాస్థలమ్ములు
హృద్యరీతిని తేటపరచుచు
కేలుమోడ్చిన మిత్రురోశయ
కేసిచూపించె.

రక్తిగల్గిన భక్తిమనదీ
భుక్తిలేని భక్తి అతనిది
ఆంతరంగిక శుద్ధికలిగిన
హృదయ మాతనిది.

అంతలో తీర్థప్రసాదము
లందరికిని అందచేయ
కొండదిగు వేళకును గోపిని
కూడ రోశయ్య.

వెళ్లిరందరు యిండ్లముఖమై
మళ్లియిట్లనె కలసికొందము
ప్రొద్దు గుంకెను చూడు దూరపు
బీటితుమ్మలలో.

కృష్ణఒడ్డున గట్టుదిగుచు
కష్టసుఖములు వెళ్లబోసిరి
ఇంతలోనె చూస్తుచూస్తు
ఎంత ఆయెనని.

నాదుసంకటములను మించి
నీదుఖన్నత వినుచునుంటిని
ఎట్టులున్నది యింటిగొడవ
ఏమిరోశయ్య.

ఏమిచెప్పెదనండి బాబు
ఎవరుతీర్ప గలారుకష్టము
పెట్టిపోసిన వారు గనుకను
ప్రేమ నడిగారు.

కాటికిని కాళ్లారచాపిన
కన్నవాండ్రు కొడుకుకూతురు
మనుచునుంటిమి రోజురోజుకు
మడతకుడుములతో.

పూటమానెడు ఉంటెగాని
పొయ్యిమీదికి కుండ ఎక్కదు
చెయ్యికాల్చుక కాచిపోయును
చెల్లిబతకమ్మ.

ఎద్దుమాదిరి నుంటిగాని
ఏమికూలి దొరకదండి
తిప్పలెన్నో పడినగాని
దినముగండమ్మొ.

నడువలేర్పడి ఎండకాలము
పడవలన్ని కట్టుపడగ
చెఱువుమెండగ బయటపడిన
చేపవిధ మాయెర్.

ముప్పుతిప్పినదండి బాబు
అప్పునప్పు పుట్టనందున
తెచ్చితినుటకు బుద్ధిపుట్టును
ఇచ్చుచుండినచో.

ఎట్లొ గడిపితి యిన్నినాళ్లు
ఏటిమీదనె పడవ నడపుచు
జీవనౌకకు ఎండకాలము
చేటుదలఏమో.

కష్టపడి చెమటోడ్చియైన
కవులుభూమిలో బ్రతుకుతామన
కాస్తకూస్తో వెనుకలేనిచో
ఖత్తు ఒప్పరుగా.

పడవమీదనె భుక్తిజరిగెను
వయినవచ్చెడు అయిదురూకల
నూకలను కొని యింట్లొ యివ్వగ
నెగ్గె కాపురము.

కూలినాలి రోజుదొరికిన
కోర్కెలెన్నో చెల్లుబాటగు
నెంజలితో కృషియించి చిత్తము
నీరునీరాను.

నాన్నసంగతి చూడగా నా
నాటదిగబడి పోవుచుండగ
తల్లినిలుకడ చెడిన మదిగని
తల్లడిలు చుండెర్.

మోదుమ్రోడుగ నుండునేమొ
ఈడువచ్చిన చెల్లిబ్రతుకు
తెల్లవారుట ఎట్టులోయని
దిగులుబుగులౌను.

తీరిపోయిన తీరుబెడద
దీనుడను మీదయమె చాలని
బుజముపంచ ముఖమ్ము కప్పి
భోరుమనియేడ్చెన్.

చెమ్మగిలినవి గోపికండ్లు
చేయి అడ్డముపెట్టి నులిమెను
విన్నకొలది తనదుమనసు
వివశమైపోయెన్.

తక్కువేమి ఉన్నదానిలో
తల్లితండ్రి నీవుచెల్లితో
కలసియుందుము ఒకరికొకరుగ
కష్టకాలములో.

ఉన్న బెడదలు చాలకండి
ఉపరికర్మము చుట్టుకొనుట
ఇతరపోషణ కీడుచేటగు
స్వంతసుఖమునకు.

ఎన్ని చెప్పిన వినవదేమి
చిన్నదానినైన పంపుము
పిల్లలందరితోటి పాటు
పెంచుచుంటాము.

చేరికొల్పిన యప్పుడైనా
చేతిచలువ తెలుసునండి
అదవత్రావుడు త్రావలేదే
అన్నినాళ్లైన.

అన్నమిన్నలు అక్కగారు
ఎన్నడైనను నన్నుతలతురె
క్షేమమేకద చదువుకొను మా
చిన్నిబాబయకు.

బిడ్డపాపల నెత్తిపెంచితి
అండదండై నిలచినావు
నీవు నిల్పిన దీపమే సుమి
నిజము రోశయ్య.

నీదుసేవ నీదుయోచన
నీసహాయము కలుపుగోలు
నేటి కింకను గుండె మెదలగ
నిన్నుమరతుమటోయ్.

ఉప్పుపులుసు తినిమె చేసితి
ఉపకృతి యేమున్నదండి
మెచ్చుకొనుటయెగాని పూర్వపు
మిత్రతనుబట్టి.

నెల, వంకకూడ క్రుంకుచున్నది
వెళ్లివత్తును శలవొసంగిన
మఱచిపోకుడు ఎప్పుడో కద
మరల దర్శనము.

మామగారికి సుస్తిచేసిన
మాటవిన్నది మొదలుకూతురు
కీడుశంకతో త్రొక్కులాడుచు
ఖేదపడజొచ్చెన్.

చిట్టినిసుగులతోటి తల్లిని
పుట్టినింటను దింపిరావలె
లేచివెళ్లె గృహాభిముఖుడై
రేపొమాపొయని.

౭

సెగలుపొగ లెగ చిమ్ముచుండి
చెఱగె నిప్పులతోటి గాడుపు
మాడిపో నెనబోయి ప్రకృతి
మండుకాలములో.

గ్రీష్మతాప నిదాఘవహ్నికి
గీడునడ నంగకములన్ని
ఆరముగ్గిన పండువృద్ధుడు
అసువులను బాసెన్.

చుట్టకాల్చి ఎవరో విసరగ
పొట్టుగూటి కంచకంపకు
ముట్టుకొనగా నగ్గి రగిలి
చుట్టు నలిమికొనెగా.

క్రొత్తపాలెములోని పూరి
గుడిసెలన్నీ కాలిపోగా
వనటగూర్చి ఆలగోడు
బాలగోడయ్యెగా.

అయ్యొ పోయెను ఇల్లు కాలెను
అంతుదొరకని ఆర్తిసంద్రము
ఈదుటా సుడిగుండములలో
బుడుగవేయుటలో.

ఇంటిపేరటి వారలొక్కరు
ఇవతలకు రమ్మనగ రోశయ
చెల్లికై తల్లికై వారల
చేరగావలసెగా.

ఉండ్రతంగెటి దుంపలన్ని
ఎండకాలము బీళ్లలోపల
పైన కొక్కటి యంచు గుత్తకు
పెల్లగించుచును.

చేయి పొక్కగ గడ్డపారతో
చిత్తకొండలో త్రవ్వలేక
దుంప తెగినను పూటగంజికి
దుత్తనిండకను.

సంధ్యవేళను కృష్ణబడ్డున
చట్టువేడిమి తగ్గలేదు
తెప్పనిలపి బయలుకని రో
శయ్యనిలుచుండి.

తల్లిచెల్లిని మనుపలేను
పిల్లపెండిలి చేయలేను
పొట్టకూటికి తల్లడిల్లగ
గిట్ట నేమాయె.

శరీర మొసగి సాకిపెంచి
చల్లచూతు నటన్న ఆశతో
ఎదురుచూచిన జననిజనకులు
వ్యథలపాలైరి.

అడవిలోపల క్రూరమృగముల
ఆకలిని దాహమ్ము దీర్చే
రక్షకుడు నాబోటి దీనుల
పక్షమున లేడా.

కీటకమ్ములు పశులు పక్షులు
సృష్టిలోపలి జీవరాసులు
బ్రతుకు తెరువు చూపువాడు
బడుగు మనుపండే.

నోరువాయి లేనివాటిని
నేమ మెఱకను బ్రోచుచుండి
వాక్కుజ్ఞానమొసంగి ప్రజలను
వనటగూర్చుటయా.

పాపపంకిల హృదయములచే
పతితులై జాల్ములగు నరులకు
సంకటము లకసీతి నడవడి
శాస్త్రియా దేవా.

రోయపుట్టితి చిన్ననాడె
రోసివేసితి లోకమును రో
శయ్య లేకున్నంతమాత్రన
జగతి లోపమ్మా.

జన్మసాఫల్యమ్ము లేక
ఉన్నను లేకున్న యొకటె
అమ్మనాన్నల పస్తుపెట్టిన
అధమజన్మంబు.

ఆదిమధ్యాంతములు నీవె
వేదవేద్యుడవయ్య నీవు
ఆదికారణమీవె తండ్రీ
ఆదుకొనవయ్యా.

ఇంటిముందటి గేస్తురాలవు
ఇరుగుపొరుగు నెరుంగుదానవు
కడుపునిడుకొని ప్రోవు తల్లీ
కృష్ణవేణమ్మ.

చెట్టుపైని గూబకూసెను
పిట్టబారెను నెత్తిపైనను
గుభేలుమని కూలారిపోయె
కృష్ణవాహినిలో.

అంతంత ఆసామి నిలువగ
నీని కాటక మేమిచేసెను
ఏమిచేయగ గలదు రోశయ
కృష్ణపాల్చేసెక.

చెఱగిపోవదు త్రుప్పుపట్టదు
చెదలుకొట్టదు నీదుచరితము
చంద్రసూర్యుల వెల్గు లల్లిన
చాలకాలమ్ము.

---

# సోవియట్ రష్యా విద్యావిధానం

శ్రీ ఆకుండి వెంకటేశ్వరరావు

ప్రస్తుతం రష్యాలోని విద్యావిధానము ప్రపంచ మంతటిలోను ఉత్కృష్టమైనదిగా ప్రసిద్ధి పొందింది. పైగా ఈ విద్యావిధానము, సోవియటు రాజ్యాంగ నిర్మాణము, సోషలిస్టుసిద్ధాంతములు ప్రబలంగా వున్న రాజ్యాలలో తప్ప తదితర ప్రదేశాలలో అవలంబింప బడలేదని కూడా ప్రసిద్ధి.

అసలే రష్యా విద్యావిధానానికంతకీ కొన్ని ముఖ్యలక్షణాలున్నాయి. (౧) విద్యావిధానము జీవితాశయమును నెరవేర్చునదిగా వుండాలి. (౨) దేశములోని ఉత్పత్తిని అభివృద్ధి చేయటానికుపయోగపడాలి. (౩) మానసిక శక్తికీ, శారీరకశక్తికీ గల భేదమును పోగొట్టి, తద్వారా 'ఎక్కువ తక్కువ' భేదములను నాశనం చెయ్యాలి. (౪) ప్రతిపౌరునికీ మేధాశక్తిని పెంపొందించి, రాజకీయార్థిక విషయాలలో పరిజ్ఞానం కలిగించాలి. (౫) విద్యాభ్యాసమునకు జాతి మత, వర్గ భేదములను తొలగించాలి. (౬) విద్యను పూర్తిగా ప్రపంచ వైజ్ఞానిక పద్ధతులలో వుంచాలి.

వీటినిబట్టి విద్యావిధానం అంతా దేశము యొక్క రాజకీయార్థికాభివృద్ధి కనుకూలంగా వుండాలనే ప్రధానోద్దేశ్యంగా బోధపడుతుంది. దీనినే పోలీటెక్నికేషన్ అంటారు. అందుచేత విద్యాలయాల్లోని ఉపాధ్యాయులు, పిల్లలుకూడా, విద్యాభ్యాసముతోపాటు ఉత్పత్తిపరిశ్రమల్లోకూడా ఎక్కువ శ్రద్ధ తీసికొంటుండాలి. ఈ విద్యావిధానం సర్వసామాన్యులకు కూడా అందుబాటులో వుండటానికి సర్వజనులకు నిర్బంధ ప్రాథమిక విద్యావిధానాన్ని ఏర్పాటుచేశారు. విద్య నంతను దేశీయభాషలలోనే నేర్పాలని నిర్బంధంచేశారు. దీనివలన సర్వసామాన్యులకు కూడా విద్యాభ్యాసానికవకాశము లేర్పడ్డాయి. అన్ని తరగతులవారికిని ప్రాథమికవిద్య నిర్బంధం చేయడంచేత ప్రస్తుతం ఆదేశంలో ౧౦౦కి ౯౯ విద్యావంతు లున్నారు. ప్రాథమిక విద్యయేకాక ఉన్నత విద్యాభివృద్ధికి కూడా అనేక ఏర్పాట్లు చేయబడ్డాయి. ప్రతిజిల్లాలోను అథమం ౬ కళాశాలలను, ౨ వ్యవసాయ కేంద్రములను, ౨ వైద్యకళాశాలలను, ౫౦ టెక్నికల్ విద్యాలయములను స్థాపించారు. ప్రతిరాష్ట్రంలోను ఉపాధ్యాయులను ఆ రాష్ట్రీయులనే నియమించారు. ప్రతిరాష్ట్రములోను వివిధ జాతులవారికి వారివారి స్వభాషలలోనే విద్యాభ్యాసం చేసుకోటానికి తగిన ఏర్పాట్లు చేయబడ్డాయి. అందువలన రష్యా దేశములోని అన్నిజాతులవారును సులభంగా విద్యాభ్యాసంచేసి వారివారి విజ్ఞానాన్ని అభివృద్ధి పరుచుకోటానికి అవకాశములును కలిగాయి. దీనివలన రష్యాలోని అన్నిజాతులవారి యొక్క ఆదరాభిమానములను సంపాదించి ప్రభుత్వం మరింత బలవత్తరమైంది. ఈవిధానంవలన అన్నిజాతులవారి మధ్యను రాజకీయార్థికైక్యత, సంఘీభావము ప్రబలం అయింది. మొత్తంమీద ఈ విద్యావిధానం అంతా ౩ భాగాలుగా విభాగింపబడింది. (౧) స్కూలుకు వెళ్లకయే నేర్చుకునే విద్య. ఇది ఏడుసంవత్సరముల లోపువయసు వారికి మాత్రమే. ఈవయసు పిల్లలకు సాధారణంగా స్కూలుకు పోవటం అంటే ఇష్టం ఉండదు. వారిదృష్టి ఎప్పుడూ స్వేచ్ఛగా ఆటపాటలతో కాలక్షేపం చెయ్యాలని వుంటుంది. అందుచేత వారి నందరినీ, ఉద్యానవనముల లోకి, మంచిదృశ్యములవద్దకూ తీసికొనిపోయి వారి కుత్సాహకరంగా ఆటలాడించుతూ, పటములను చూపుతూ, ఆయా విషయములను ప్రత్యక్షముగా చూపుతూ విద్యను బోధిస్తారు. దిక్కుమొక్కులేని పిల్లలకును, పేదవారికిని ఉచితవసతుల నేర్పాటుచేసి

అన్నివిధముల ప్రభుత్వమే వారికి రక్షకులుగావుంటారు. (౨) ప్రాథమికవిద్య — ఇది ౮సం॥ మొదలు ౧౧సం॥వయసు పిల్లలకు మాత్రమే. దీనిలో ౪ తరగతు లుంటాయి. ఇక్కడ భాషను చదువుట, వ్రాయుట, ముఖ్యంగా నేర్పుతూ వారివారి అభిరుచులనుబట్టి చిన్నచిన్న వస్తువులను తయారుచేయుట, వానికి సంబంధించిన శాస్త్రజ్ఞానమును బోధిస్తారు. ౧౧ సం॥ పూర్తియగు సరికి మాధ్యమిక విద్యాభ్యాసానికి తగినశాస్త్రీయ జ్ఞానం అలవడుతుంది. (౩) మాధ్యమిక విద్య —ఇది ౧౨ సం॥ మొదలు ౧౭ సం॥ వయసులోని వారికి నేర్పబడు తుంది. ఈ విద్యాభ్యాసానికి రెండు రకాలైన స్కూల్లుంటాయి. ౧౨ సం॥ మొదలు ౧౪ సం॥ వరకు మిడిల్‌స్కూలు. ౧౪సం॥ మొదలు ౧౭-వ సం॥ వరకు సెకండరీస్కూలు. ఈ కాలములోనే ప్రతివారును, వారి భావిజీవితమున కాధారమైన విద్యనంతను గడించు కుంటారు. ఇక్కడ సామాన్యశాస్త్రీయ విజ్ఞానములు, వృత్తివిద్య మొదలైనవి పూర్తిగ నేర్చుకుంటారు. ముందుముందు తమ జీవితయాత్ర కవసరమైన విజ్ఞాన సంపత్తి అంతా ఇక్కడే అలవడుతుంది. (౪) కళాశాలవిద్య— ఇది ౧౮సం॥ మొదలు ౨౨-వ సం॥ వరకు. ఇక్కడ విద్యార్థులు వారియభిరుచుల ననుసరించి ప్రత్యేకశాఖలలో ప్రత్యేకంగా నైపుణ్యం సంపాదిస్తారు. ఇక్కడే వారివారి స్వతంత్రశక్తి, తెలివితేటలు బైట పడతాయి. ఇక్కడ తమ జీవనాధారమునకు సరిపోవునట్లు ఉత్పత్తి విధానంలో పాల్గొంటూ, శక్త్యనుసారం పరిశోధనలను సాగిస్తుంటారు.

పై విధమైన విద్యాలయములు, మొదట్లో బస్తీలు, ఉత్పత్తికేంద్రాలు మొదలైన ముఖ్యప్రదేశాలలో వుండేవి. పైగా ౧౯౩౦సం॥వరకు ఉచిత నిర్బంధ విద్యావిధానం అమలులో పెట్టబడలేదు. మొదటి పంచవర్ష ప్రణాళికలోనే, అనేకులగు సామాన్య కూలినాలి జనులుకూడా చాలామంది విద్యాభ్యాసం ప్రారంభించటానికి తగిన, కొన్ని ప్రత్యేక సదుపాయాలు చేశారు. తరువాత రెండవ పంచవర్ష ప్రణాళికలో ఉచిత నిర్బంధ ప్రాథమికవిద్యావిధానం అమలులోపెట్టి ప్రభుత్వంవారు, అనేకమైన చిన్నచిన్న పల్లె ప్రాంతములలోకూడా చాల స్కూళ్లను స్థాపించారు.

క్రమంగా ౧౯౩౪-వ సం॥ నాటికి అంతకు ముందున్న వివిధవర్గములు నశించిపోయి, ప్రజలందరిలోనూ పారిశ్రామికతత్వము, సమిష్టి వ్యవసాయతత్వము ప్రబలింది. అందువలన సోషలిస్టు సమాజస్థాపన సులభం అయింది. ప్రతివారికీ విద్యాలయం వదలి వచ్చేసరికి, సోషలిస్టు ఉత్పత్తివిధానము, రాజకీయ చైతన్యము, కమ్యూనిస్టుతత్వము పూర్తిగా అలవడి వుంటాయి.

రెండవ పంచ వర్ష ప్రణాళికలో, ఈ విద్యావిధానానికి ఒక క్రొత్తపద్ధతి అవలంబించారు. దానికే పోలి టెక్నికైజేషన్ అంటారు. దీనిలో మొదటి ప్రణాళికలో ఏర్పరచిన విద్యావిధానము నంతనీ, అంతకంటె తక్కువకాలంలో పూర్తిచేయటాని కవకాశము ఏర్పరిచారు. ఈ విధానముయొక్క ముఖ్య సూత్రములు—(౧) ప్రతి విద్యార్థికిని జాతీయార్థిక నిర్మాణములోని వివిధశాఖల వృత్తివిధానమును, వాటియొక్క శాస్త్రపరిజ్ఞానమును నేర్పుట, (౨) ఫ్యాక్టరీలలో తయారగుచున్న అన్ని వస్తువులయొక్క ఉత్పత్తి విధానమును, పుట్టు పూర్వోత్తరములను, లాభనష్టములను పూర్తిగ నేర్పుట; (౩) ప్రతివాడును విద్యాలయమునుండి బయటకు వచ్చేసరికి, ఏదో ఒక వృత్తివిద్యలో ఆరితేరినవాడై ఉత్పత్తివిధానంలో పాల్గొన శక్తిసామర్థ్యములు కలవానిని తయారుచేయుట. ఈ విద్యాభ్యాసకాలములోనే విద్యార్థులు, ఉపాధ్యాయులుకూడ ప్రతిదినమూ ఉత్పత్తి విధానంలో పాల్గొంటూ, నూతన పరిశోధనలు చేస్తుంటారు. ఈ విధానంలో రాత్రి బట్టీపట్టినది ప్రొద్దుటికి మరచిపోటాని కవకాశం లేదు. ప్రతి విషయము ప్రత్యక్షంగా చూసి, చేస్తుండటంచేత అది మరచిపోదామన్నా వీల్లేకుండా వంట పట్టిపోతుంది. దీనివలన ఉత్పత్తియొక్క శక్తి అనేకరెట్లు హెచ్చి దానివలని లాభముల నందరూ సమానంగా అనుభవించటాని కవకాశం వుంది.

ప్రతిస్కూలూ ఏదో ఒక ఫ్యాక్టరీకో తదితర కర్మాగారానికో చేర్చబడి వుంటుంది. స్కూలులో నేర్పిన ప్రతియంశమును ప్రత్యక్షముగా విద్యార్థులు చూచుటకును, ఆ విషయములను నేర్చుకొనుటలోనే

ల్పృప్తి పొందక వాటిని ఆచరణలో పెట్టి వాటివలని పూర్ణలాభమును పొందటానికిని అవకాశము లున్నాయి. సాధారణంగా స్కూల్లలో చెప్పే విద్యలో చాలాభాగం వుత్పత్తివిధానమును గూర్చియే వుంటుంది. కనుక స్కూల్లో నేర్చుకున్న శాస్త్ర జ్ఞానమును ప్రక్కనున్న ఫాక్టరీలో ఉపయోగించుటవలన విద్యార్థి పరిపూర్ణమైన జ్ఞానమును ఆచరణయుక్తంగా నేర్చుకోటం కాకుండా దేశముయొక్క వుత్పత్తి విధానానికి కూడా చాలా తోడ్పడినవా డవుతాడు. స్కూలు విడిచిన తరువాతకూడా, బయట ఏదో ఒక వుత్పత్తి కేంద్రంలో ప్రతివిద్యార్థినీ పనికి ప్రవేశపెడతారు. దీనిలో పని చేసిన కాలము కూడా విద్యాభ్యాసకాలముగనే పరిగణింపబడుతుంది. ఈకాలంలో తాను స్కూలులో ఎంతజ్ఞానం సంపాదించినదీ, దానిని ఆచరణలో పెట్టగల శక్తిసామర్థ్యము లున్నవీ, లేనివీ, భావిజీవితంలో తన జీవయాత్రను క్షేమంగా చేయగలిగినదీ, లేనిదీ విద్యార్థియే ఏ పరీక్షా లేకుండా స్వయంగా తెలిసికొని నిర్ణయించుకోగలడు. అటువంటప్పుడు నిరర్థకంగా విద్యార్థులను పీల్చిపిప్పిచేసి తల్లిదండ్రుల ఆస్తుల నమ్మించి చివరకి "అన్నమో రామచంద్రా" అనిపిస్తున్న మనదేశంలో వలె వృధా పరీక్షలకుగాని, విద్యాధికారుల నిరంకుశ పరిపాలనకుగాని అక్కడ తావులేదు.

ఈవిద్యావిధానములో మానసికశిక్షణతోపాటు శారీరకశిక్షణకూడా అభివృద్ధి అవుతుంది. ఉత్పత్తివిధానములో శారీరకశిక్షణకూడా చాలా అవసరమనియు కేవలం మానసికశిక్షణ అంత ప్రయోజనకారి కాదనియు ఈవిధానంవలన విద్యార్థికి పూర్తిగ బోధపడుతుంది. అదిగాక మానసిక, శారీరకశక్తుల మధ్యనుండే భేదము, ప్రత్యేకంగా వానిశక్తి, ఉపయోగము, రెండింటికిగల భేదము, విద్యార్థికి బోధపడి రెండింటియందును సమానగౌరవము కలుగచేయును. ప్రతివిద్యార్థికిని చిన్నవయసునుండియు జాతీయభావము, స్వయంజీవనశక్తి, దేశభక్తి అలవడుతాయి. కనుక రష్యాలో సోమరిపోతులకు, పనిపాటులయం దయిష్టులకు స్థానంగాని జీవనాధారంగాని లేకపోవటమే కాక, వళ్లు వంచిపనిచేసేవాడికి జీవనాధారానికి లోటుకూడా లేదు.

పైచెప్పిన ఈ విద్యాభ్యాసం అంతా ౧౮ సం॥ వయసులోగా, ప్రాథమిక మాధ్యమికపాఠశాలలోనే పూర్తి అవుతుంది. దీని తరువాత ఉన్నతవిద్యావిధానం వుంది. ఇది ౧౮ సం॥ మొదలు ౨౩ సం॥వరకు వుంటుంది. ఇచ్చట విద్యార్థులు తమతమ ప్రత్యేకాభిరుచులనుబట్టి ఏదో ఒక ప్రత్యేక శాఖలో పరిశోధనలను చేసి, క్రొత్తరకపు ఉత్పత్తినభివృద్ధి చేయుటకు కృషిచేస్తారు. ఇటువంటి విద్యాలయాలన్నీ పారిశ్రామికమంత్రి అధికారానికి లోబడి వుంటాయి. ప్రతిపరిశ్రమకు కొందరుపరిశోధకులను ప్రత్యేకంగా నియమించి వారి జీతబత్తెముల నాపరిశ్రమల ఆదాయమునుండి యిస్తారు. ఇటువంటి విద్యార్థుల వుపయోగార్థం ప్రతి కేంద్రంలోనూ, ఒకపరిశోధనాలయమును, పెద్ద లైబ్రరీని, మొత్తందేశానికంతకీ ఒక అఖిలయూనియన్ పరిశోధకకేంద్రాన్ని, అఖిల యూనియన్ లైబ్రరీని (లెనిన్ లైబ్రరీ) స్థాపించారు.

పారిశ్రామిక యంత్రాలయాలలోను, ఇతర ఫాక్టరీలలోను పనిచేయుచున్న కూలీనాలిజనులు, వృద్ధులు, స్త్రీలుకూడ విద్యాభ్యాసము నొనర్చుటకు తగిన ఏర్పాట్లు చేశారు. ఇదే వయోజనవిద్య. ఇటువంటివారి విద్యావిహీనతను పారద్రోలటానికి ప్రత్యేకంగా కొందరు విద్యార్థులను తయారుచేసి వారిద్వారా అన్నిప్రాంతములలోను విద్యావ్యాప్తిని చేస్తున్నారు. ఈ వయోజనవిద్యావిధానంలో రాజకీయవిద్యాభివృద్ధికి కూడా ఏర్పాట్లు చేశారు. ఇందుకొరకు ప్రత్యేకంగా పఠనాలయాలు, గ్రంథాలయాలు, పత్రికలు స్థాపింపబడి ప్రత్యేకశిక్షణపొందిన విద్యార్థులు బోధకులుగా నియమింపబడ్డారు. ఈ వయోజన రాజకీయవిద్యలకు వార్తాపత్రికలు, సినీమాలే ముఖ్యసాధనములుగా ఉపయోగింపబడుతున్నాయి. దేశములోని పత్రికాపరిశ్రమ ఫిలిం పరిశ్రమకూడా ప్రభుత్వాధికారంలోనే వుండడంచేత ఆరెండు సంస్థలను ప్రభుత్వంవారు తమ యుద్దేశ్యముల కనువుగా ఉపయోగించుకొంటున్నారు.

ఈ విద్యావిధానములోని వివిధశాఖలకు ప్రభుత్వం ఎంత [illegible]

యములు చేసినదీ, దానివలన ప్రజలకు దేశానికి ఎంత లాభం కలిగినదీ, ఆ లెక్కలనుబట్టి వూహించుకోవచ్చు. ౧౯౧౩ లో జారుప్రభువులు దేశం అంతకీ విద్యాభివృద్ధికై ౨౮౦ లక్షల రూబుల్సు అనగా ౩ కోట్ల ౬౦ లక్షల రూపాయలు ఖర్చుచేస్తే, విప్లవానంతరం సోవియట్ ప్రభుత్వం ౧౯౨౫ సం.లో, ౬౮ కోట్ల, ౧౦ లక్షల రూబుల్సు, అనగా ౯౮ కోట్ల ౧౬ లక్షల రూపాయలు ఖర్చుచేసింది. విప్లవానికి ముందు టార్టార్, బాష్కిర్ మొదలైన కొన్ని రాష్ట్రములలో ౧౦౦ కి ౧౫ మంది, వేయికి ౧౭ మంది విద్యాభ్యాసం చేసినవారుంటే, తరువాత దేశీయ భాషలలో విద్యాబోధన ప్రారంభం కాగానే ౧౦౦ కి ౯౯ వరకు విద్యావంతులసంఖ్య పెరిగింది. ప్రతి రాష్ట్రములోనూ ఇప్పుడు అధమం ౬ కళాశాలలు, ౨ వ్యవసాయకేంద్రములు, ౨ వైద్యకళాశాలలు, ౫౦ టెక్నికల్ పాఠశాలలు వున్నాయి. అవసరమైన చోట్ల ఒక్కొక్క స్కూలులో ౨౦ వివిధభాషలలో విద్యాబోధన చేస్తున్నారు.

ప్రాథమిక విద్యాభ్యాసం చేస్తున్నవారు ౧౯౩౨లో ౫౨ లక్షలమంది వుంటే, ౧౯౩౪ నాటికి ౧౬౦ లక్షలకు పెరిగారు. మొత్తానికి ౪౫% నిర్బంధంగా ప్రాథమికవిద్య నభ్యసిస్తున్నారు. ౧౯౩౪లో ప్రాథమిక విద్యాభివృద్ధికి ౨౨౭ కోట్లరూపాయలు ఖర్చుపెట్టుటకు ప్రభుత్వం నిర్ణయించింది. ౧౯౩౨లో మాధ్యమికవిద్యాభ్యాసంచేసేవారు ౨ కోట్ల ౧౭ లక్షలైతే, ౧౯౩౪లో వీరిసంఖ్య ౩ కోట్లకు పైగా పెరిగింది. ఈ మాధ్యమిక పాఠశాలలు ప్రతిపల్లెలోను స్థాపింపబడ్డాయి. అందుచేత ౧౯౩౨ లో గ్రామవాసులు ౧౬౦ లక్షలు విద్యాభ్యాసం చేస్తే, ౧౯౩౪ లో ౨౩౨ లక్షలు విద్యాభ్యాసం చేశారు. ౧౯౩౨ లో తలఒకటికి రూ. ౬౦త్తిలు ఖర్చుపెట్టబడితే ౧౯౩౪ లో తల ఒకటికి రూ. ౧౦౦ లకు పెరిగింది. మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేసరికి ౪౦% మాధ్యమిక విద్యాభ్యాసంచేస్తే, రెండవ పంచవర్ష ప్రణాళిక నాటికి ౯౫% కు హెచ్చింది. మొత్తంమీద ౧౯౩౨ కంటె ౩౪ నాటికి, విద్యాభివృద్ధి గ్రామవాసులలో ౩త్తి రెట్లును, పట్టణవాసులలో ౨ రెట్లును హెచ్చింది. ౧౯౩౨లో మాధ్యమికవిద్య తల ఒకటికి రూ. ౧౪౦ ల ఖర్చు ౧౯౩౪ లో రూ. ౨౬౦ లకి హెచ్చింపబడింది. ఈరకం విద్యాభివృద్ధికి మొత్తంమీద ౧౯౩౪ లో బడ్జెటునుంది మినహాయించిన ౧౬౫౦ కోట్లతో సహా ౧౪౪౦ కోట్లరూపాయలు ఖర్చుచేసినారు. గతసంవత్సరం విద్యాభివృద్ధికి ఇల్లుల సహాయార్థం బడ్జెటులో ౨౭ పాళ్లు, అనగా ౫,౫౦౦ కోట్లరూపాయలు ప్రత్యేకించారు. గతపంచవర్ష ప్రణాళికలో మొత్తంమీద విద్యాభివృద్ధికి ౧౩,౧౦౦ కోట్ల రూపాయలు ఖర్చుచేశారు. దానిలో ఇంచుమించు ౪౨% ఒక్క ౧౯౩౭ లోనే ఖర్చుపడింది.

౧౯౩౪-వ సం. లెక్కలప్రకారం ఉన్నత విద్యాలయాలు ౭౦౦ వరకు వున్నాయి. వాటికి అనేకప్రదేశాలలో శాఖోపశాఖలుకూడా వున్నాయి. ఈ ఉన్నత విద్యాలయాల్లో ౧౯౩౦ నాటికి ౧,౯౧,౦౦౦ మంది విద్యాభ్యాసం చేస్తే, ౧౯౩౫ లో వారి సంఖ్య ౫,౨౨,౦౦౦ కి హెచ్చింది. కేవలం ఈ ఉన్నత విద్యాలయాల్లో శాస్త్రీయపరిశోధనాభివృద్ధికి ౧౯౩౪ లో బడ్జెటునుండి ౧౩౫౫ కోట్ల రూపాయలు ప్రత్యేకించారు.

వయోజన, రాజకీయ విద్యాకేంద్రాలు ౧౯౩౪-వ నాటికి ౧౦,౭౪౦, సోషలిస్టు విజ్ఞాన కేంద్రాలు ౩,౦౭౦, రీడింగురూములు ౬౬,౦౦౦. ఇతర రాజకీయ విద్యా కేంద్రాలు ౮,౭౯,౦౦౦. ప్రత్యేకం ప్రజల కొరకు ౨౫,౦౦౦ గ్రంథాలయాలు స్థాపింపబడ్డాయి. ఈ అన్ని సంస్థలకును, బడ్జెటునుంచి ౨౦ కోట్ల రూపాయలు మినహాయించారు. ఇదికాక కేవలం విద్యాభివృద్ధి కుపయోగపడే, సినిమాలు, నాటకశాలలు మొదలైనవాటికి ౩౫౦ కోట్ల రూపాయలు ఖర్చు పెట్టుకున్నారు.

౧౯౧౮ లో మొత్తం రష్యాలో నాటకశాలల సంఖ్య ౩; ౧౯౩౬-వనాటికి ౬౦ కి హెచ్చింపబడింది. సినిమా ఫిలిముల సంఖ్య ౮౭; ౧౯౩౬-వ నాటికి ౧౩౯౮ కి హెచ్చింపబడింది. విప్లవానికి ముందు వార్తా పత్రికలు ౨౮ భాషలలో ౭౮ మాత్రమే వచ్చేవి. ఇప్పుడు, సమస్త రాజకీయార్థిక పారిశ్రామిక కళా

శాస్త్రములలో ౨౩ భాషలలో ౩౦౦౦ పత్రికలు వస్తున్నాయి. విప్లవానికి పూర్వం సారస్వతంలో ౮౦ లక్షల గ్రంథాలుమాత్రం వెలువడితే, ఇప్పుడు ౧౩ కోట్ల ౩౦ లక్షల గ్రంథాలు వెలువడ్డాయి.

నిన్న మొన్నటివరకు అనగా జారుప్రభుత్వం తుదవరకు విద్యాశూన్యులై, ఎడతెరపి లేని కాయ కష్టమున కోర్చి, కడుపునిండ తిండిలేక మలమల మాడే ప్రతి కూలీ, రైతు ఈనాడు రష్యాలో నియమిత కాయకష్టముతో అన్నవస్త్రములకు లోటు లేకుండా హాయిగా కాలక్షేపం చేయటానికి ఈవిద్యావిధానమే కారణం. ఈ విద్యావిధానము ఒక నియమిత ప్రాంతమునందును నియమిత శాఖలందును కాక దేశములోని మారుమూలలయందును సమస్త రాజ్యాంగ రక్తనాళములందునుకూడ వ్యాపించి విద్యాశూన్యతను రూపుమాపుటయే కాక ప్రజలలో నూతనోత్తేజమును, దేశాభిమానమును, జాతీయాదర్శములను రగుల్కొలిపి సౌఖ్యసంపదలను పెంపొందింపచేయగల్గింది. ఈ విద్యావిధానమువలన ప్రపంచ మన్ని దేశాలలో తీవ్రరూపంతో తాండవమాడుతున్న అల్పజాతి సమస్య రష్యాదేశంలో మాత్రమే రూపుమాసిపోయింది. ప్రస్తుతం రష్యాదేశంలో ౩౦, ౪౦ జాతుల ప్రజలున్నారు. కాని అందరును జాతిమత భేదములు లేక ఏకోదర భావంతో తమతమజాతిని విజ్ఞానమును అభివృద్ధి చేసుకొంటూ చేయిచేయి కలిపి వర్తిస్తున్నారు. జర్మనీ మొదలైన దేశాలనుండి హింసింపబడి తరిమివేయబడిన యూదులు, అమెరికాలో నడివీధులలో ప్రాణాలతో తగులబెట్టబడుచున్న నీగ్రోలు కూడా రష్యాదేశంలో తమతమ జాతీయగౌరవములతో సమాన పౌరసత్వపు హక్కులను కలిగి స్వేచ్ఛగా జీవిస్తున్నారు. స్వేచ్ఛకు, సౌఖ్యమునకు, ఆరోగ్యమునకు, సస్యసమృద్ధికి, యంత్ర నిర్మాణమునకు, నాగరికతకు, సైన్య శక్తి సంపదకు ప్రపంచ మంతలోనూ రష్యా అగ్రస్థానం వహించటానికి ఈవిద్యావిధానమే కారణం.

---

# జీవన్మృత ఘోష

శ్రీ కొమరవోలు వెంకటసుబ్బారావు

మనుమసిద్ధినృపాలు మణిసభాఘంటికల్
మాగాణి వరిచేల మాటు నుండి,
రాజరాజనరేంద్రు రాణివాసవిభూష
లడుగు రా జవికెల యడుగునుండి,
యాంధ్రరాయల నృత్యసదసిపుత్రి శిథిలమై
కడంగూలి పడెడు వాకిళ్ల నుండి,
వీరరుద్రమ భద్రవిజయబృంహిత మోరు
గంటి వీధుల యేడుకములనుండి,
యాంధ్రకవితల్లజుల సువర్ణాక్షరములు
పాడు చెదపుర్వు రతగర్భములనుండి
కంచుఘంటలవోలె గావించు ఘోష
నాలకింపవా! నేఁడైన నాంధ్రపుత్ర!

---

# ఛాయాగ్రహణం

## (వర్ణాశ్రమాలు)

శ్రీ పూర్ణానంద

౧

ఈ యుగంల్లో పుట్టి నాజీ – ఫాసిస్టు – సోషలిస్టు గాల్లు తగిలించుకొంటున్న ప్రతిబుద్ధిలోనూ, భారతదేశంలోగూడా అటువంటి నూతనసమాజాన్ని ఒకదాన్ని చూడాలని, భావోన్మాదం తప్పనిసరిగా బయలుదేరుతోంది. ఏ సోమయాగమో చేసి, బ్రహ్మలోకందాకా అందె చాపలేకపోయినా — కుండలాల్ని తగిలించుకొని 'సభాపతులం' అని అనిపించుకొందాం అని తహతహలాడించే 'లోకేషణ',[1] శతాశ్వమేధం చేసి ఇంద్రుణ్ణి 'తప్పుకో' అనలేకపోయే పక్షాన్న, అగమం ఒకటైనాచేసి 'ఏకచ్ఛత్రాధిపతులం' అని అనిపించుకొనేదాకా రాజుల్ని పీడించే లోకేషణ, వైశ్యుల్ని లక్షాధికార్లం, కోటీశ్వర్లం అని అనిపించే లోకేషణ, ఇప్పుడు 'లీడర్‌షిప్పు'గా మారింది. ఎవరికీ అవసరంలేని వేదాంతాన్ని వదలి, అందరికీ అవసరం ఉన్న 'రాచకార్యా'ల్ని గురించి మాట్లాడ్తే మన చెవులు నిక్కపొడుచుకొంటున్నాయి. ఈ విషయం ఆమోదనీయమే. అంతే కాకుండా, రాజాజయచంద్రుడి[2] విషమ విశ్వాస ఘాతకతతో వెన్నువిరిగి, క్రమంగా తరుపరి సంభవించిన పరాభవాల్తో జీవచ్ఛవమైన సమాజంయొక్క ఆత్మ చావలేదనికూడా తెలుపుతోంది. పదిశతాబ్దాలు 'పడ్డపాటు' తీసుకొంటానికి, మరి పది శతాబ్దాలు పడ్తాయేమో? ఈ సమాజంయొక్క నవ శరీరం ఎట్లా ఉండాలి? అనేప్రశ్నకు చాలామంది, చాలా జవాబు లిస్తున్నారు. కొన్ని సయిస్తున్నాయి, కొన్ని సయించటంలేదు. ఈ భావసంఘట్టనా సమయంలో మావ కర్తవ్యాన్నికూడా, ఒకింత మానీరస లేఖిని ద్వారా ఎఱుకపరచటం అన్యాయం కాదు.

పూరీలో జగన్నాథుడికి ప్రతిసంవత్సరం 'నవకళేబరం' అనేఉత్సవం జరుగుతుంది; అంటే పైన ఉన్న రంగు మొదలైనవాట్ని తీసివేసి, కంకాళాన్ని ఉంచి, ఇంకో క్రొత్తతొడుగు తొడుగుతారు. అట్లాగే, మన సమాజంపట్లగూడా ఏమో? అయితే ఈ కంకాళం ఏమిటి అనేప్రశ్న అనివార్యమవుతుంది. వర్ణాశ్రమధర్మమే అది. ఈమాట వినేసరికి భావకవులు తుట్టెన ఆకాశంలోకి లేచి, 'మృత-భూతము' (Dead Past) యొక్క పూజా అనిన్నీ, సంఘసంస్కర్తలు లేచి, మేమేమో ప్రగతిశీలమైన జగత్తుతో పందెం వేద్దాం అనుకొంటుంటే మళ్లీ 'అచలాయతన'[3] మా అనిన్నీ, సోషలిస్టులు లేచి 'దేవుడూ లేడు దయ్యమూ లేదు' అంటుంటే మళ్లీ వేదకాలపు మాటలా? అనిన్నీ అంటారని మాకు తెల్సు. కాని, భావుకత (Emotion) యొక్క 'కైపు' ఒకింత కుదించుకొని, ఆ సుగత భూతకాలంలోకి చొచ్చుకొపోతే ఎట్లాంటి చిత్రము గుపిస్తుందో, ఆ చిత్రంయొక్క 'ఆభాసే' ఈ ఛాయాగ్రహణం. అసలు చిత్తరువునే ఇద్దాం అంటే, మన వాళ్లకు 'పరధ్యానం'—అంటే ఈ లోకంసంగతే మర్చిపోయి ఇంకోలోకంకోసం తండనాలాడ్తూ, వేళ్లు లెక్కించడమే కారణం అయిపోయి విఘ్నం కలిగిస్తోంది. వాళ్లు గ్రీక్, ఇంగ్లీషువాళ్లలాగా 'రికార్డులు' అట్టేపెట్టి పోలేదు; తర్వాత మనలాంటివాళ్లు వచ్చి

1. దారేషణ, విత్తేషణ, లోకేషణ: వీట్నే ఏషణాత్రయాలు అంటారు వేదాంత పరిభాషలో; వీట్నే నవీనుడైన వివేకానందుడు 'బంధత్రయం' అని 'కామకాంచనాలు, నామయశాలు'గా వ్యవహరించాడు.

2. క్రీ. శ. ౧౧౯౨.

3. ప్రగతి సమాజాన్ని పరిహసిస్తూ రవీంద్రుడు వ్రాసిన నాటిక.

'నఖశల్యపరీక్ష' చేస్తామన్న ఊసే వాళ్లకున్నట్టు తోచదు. పోతే, వ్రాసినవి కొన్ని 'పిచ్చిపుస్తకాలు.' వాట్ని అవలంబించే ఒకింత వ్రాస్తాను.

## ౨

శంకరాచార్యులు గీతాభాష్యంలో 'శ్రీకృష్ణుడు బ్రాహ్మణత్వాన్ని రక్షించటానికి జన్మించాడు'[4] అన్నాడు. ఈమాట మనవాళ్లకి సీమ మెరపకాయ కారంలాగా, నసాళానికి అంటుతుంది; దక్షిణాది బ్రాహ్మడు చాదస్తం వదల్లేక అన్నమాటలా తోస్తుంది. కాని, తర్వాతా వర్ణాశ్రమాలు అంటే 'బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణాలూ, బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాసాశ్రమాలూ, ఏతదంతర్గతాలు' అనటంవల్ల కొద్దిగా తెల్లమొగంవేసి, తెల్లవారిదగ్గరికి—మళ్లీ మనవాళ్లు అర్థం చెప్పితే చేదుగా—పరుగెత్తాల్సి వస్తోంది. 'ఆర్యసంస్కృతి' 'మనునీతి' మొదలైన పదాల్తో సమానమా అనిపిస్తుంది, ఈ మాట.

అప్పుడు, అంటే ఆ అతీతయుగంలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులే సమాజంలో బహుళంగా ఉండే వాళ్లు. శూద్రులు 'మైనారిటీ'. అందువల్ల త్రైవర్ణికంగా అనేక విధినిషేధాలు ఉండటం, చతుర్థవర్ణాన్ని గురించి చెప్పకపోవటం, మళ్లీ చెప్పితే దెప్పినట్లు ఉండటం, కనిపిస్తుంది. ఈ 'కలియుగం'లో సైతం ఏకైకపార్టీ నియంతృత్వ ప్రభుత్వం ఉన్న రష్యా మొదలైన 'సువర్ణ' దేశాల్లోకూడా—ఈ దేశాల్నే కాదు, మనం మళ్లీ అనుకరించగోరేది—'స్వల్ప సంఖ్యాక సంఘాల' స్వేచ్ఛా జీవనానికి తావులేదు' అని రాజ్యాంగవేత్తలు చెప్పుతున్నారు, ఒకవైపున ప్రశంసిస్తున్నా. కాబట్టి ఇదంతదోషంలో చేరకూడదు.

'వేదకాలంనాటి మనుష్యులు' అవడంవల్ల వాళ్లకి వేదం అంటే ఇంతా, అంతా అనరాని 'మమకారం' ఉండేది. కాలు తీసి కాలు పెట్టాలి అంటే వాళ్లు వేదాన్ని విప్పి చూసేవాళ్లు, కొందరు జ్యోతిష్కులు గడపదాటాలి అంటే చక్రంవేసిచూసుకొని మరీ వెళ్లేట్లు. ఏదైనా విషయాన్ని సామాన్య పురుషబుద్ధిద్వారా—ప్రకృష్టబుద్ధికాదు—విచారించటానికి పూర్చుంటే, చాలా స్తరాలూ, దిక్కులూ ఉండటంవల్ల, అది ఏకదేశంగానో, మొండివాదన క్రిందో తయారు అవుతుంది అని వాళ్లు గ్రహించారు. 'స్మృతి'[5] కారులైన గౌతమకణాదాదుల్ని మన్నించాలి అంటే ఈ 'చావుబాధ' వచ్చి పట్టుకొనేది. ఇకవేదంలో 'త్రికాలబాధాతీతం'గా 'వస్తుతంత్రం'గా, విషయాల్ని ఏండ్లుపూండ్లు తరచి అన్నిదిక్కులూ చూసి, స్తరాలన్నిటినీ దాటి, 'ఇతిశుశ్రుమ పూర్వేషాం'[6] అంటంవల్ల, విసిగేసి చివరకు 'వేదం' ఒక్కటే ప్రమాణం అన్నారు; నికృష్టబుద్ధిప్రమాణమైన తర్కాన్ని వాళ్లు ఒప్పుకోమన్నారు. కాబట్టి వేదంలో బుద్ధి (Reasoning) లేదు, అది Reason న్ని ఒప్పుకోటం లేదు అని భావించటంలో సబబు లేదు. Reason న్ని తరచి, రాపాడి, ఆ స్తరాల్ని అన్నిటినీ దాటగావచ్చే 'మినహాయింపే'గామరి వేదం. వేదాంతదర్శనం తర్కపాదంలో ఉన్న సాంఖ్యస్మృతిసూత్రం, తర్కాప్రతిష్ఠానసూత్రమూ ఈవిషయాన్నే దృఢపరుస్తున్నాయి.

అసలుమాట ఏమిటంటే వాళ్ల దినచర్య అంతా 'వేదవిధి'ని అనుసరించే ఉండేది. నిషేకం, జాతకర్మ, చౌలాల్ని వదలి, వడుగుదగ్గరకు వద్దాం; ఇది అప్పటి సమాజంలో చాలాముఖ్యమైన పాత్రను నిర్వహించింది. బ్రాహ్మణుడైతే గర్భాష్టమాన్నీ, క్షత్రియుడైతే

4. 'బ్రాహ్మణత్వస్య రక్షణార్థం దేవక్యాం వసుదేవాద్ అంశేన కృష్ణః సంబభూవ; బ్రాహ్మణత్వస్య హి రక్షణేన రక్షితః స్యాద్ వైదికో ధర్మః, తదధీనత్వాద్ వర్ణాశ్రమభేదానామ్.' —గీ. భా. ఉపక్రమణిక.

5. వేదం తప్ప తక్కిన సంస్కృతసాహిత్యమంతా 'స్మృతి'. వేదం శ్రుతి. దాన్ని మహర్షులు ఉన్నదాన్ని ఉన్నట్లే 'విన్నారు.' కాబట్టే శ్రుతి. శ్రుతిని అనుసరించి స్మరింపబడిందే స్మృతి. పరస్పరవిరోధం ఉంటే శ్రుతే నెగ్గుతుంది.

6. కేన. ఉ. ౧. 3.

పన్నెండవయేటా, వైశ్యుడైతే పదహారవయేటా 'ఉపనయనం' చేసుకోవాలి అని వేదవాక్యం – విధి.

ప్రసంగక్రమంలో ఒకమాట చెప్పాలిసొస్తోంది. 'పదాలే' మొట్టమొదట ఉండేవి, తర్వాత దేవుడుగారు తమ 'Guide' అయిన వేదాన్ని తెరచి, తదనుయాయి 'ఓంభూః' అని భూమిని, 'గౌః' అని ఆవును సృష్టించాడు,[7] కుంభకారుడు 'ఘటం కరోమి' అని అనుకొని కుండను చేసేటట్లు.[8] కాబట్టి వస్తువులన్నీ పద + అర్థాలు–పదార్థాలు (**Meanings of words**) అని వాదిస్తూ, అసమపక్షం 'వైదికంగా'[9] వాటి నిత్యత్వాన్ని నిలబెట్టినా 'లౌకికం'గా అంటే వ్యవహారంలో అవి నిత్యనూతనంగా 'తదేవ రమ్యం రుచిరం నవంనవం' అన్నట్లు తమ అర్థాల్ని మార్చుకొంటూ, కొత్తకొత్త వేషాలు వేస్తున్నాయి.

యథా: 'ఉచ్ఛిష్టం' అనేపదం ఆకాలంలో 'యాగం' (హోమం) చేసిన తర్వాత మిగిలిన పురోడాశాదులపరంగా ఉండేది; దాన్నే 'మహాప్రసాదం'గా భక్షించేవాళ్లు, యజమానీ — అంటే **Owner** కాదు, యజ్ఞకర్త — ఆయన భార్యా; తర్వాత ఇది 'ఎంగిలి' అయిపోయి ఊరుకొంది. ఇట్లాగే, ఆచార్య, ఉపాధ్యాయ 'పదవులు.'† ఆచార్యుడంటే వేదాన్ని షడంగాలతో చెప్పే ఆయన. ఉపాధ్యాయుడు అంటే తదేకదేశాధ్యాపకుడు. ఇప్పుడివి 'కాలేజీప్రొఫెసర్, స్కూలుమేష్టరు లేక బడిపంతులు' వేషాన్ని ధరించాయి. మరి, ఆదేశం ఉపదేశం అనేపదాలు. ఆదేశంఅంటే వేదవిధి. ఉపదేశం అంటే దాన్నే అనుసరించి వ్రాయబడ్డ స్మృతి.* ఇప్పుడివి **Order, Advice** పరాలు అయినాయి. 'ఏవంవిధి' గా ఉపనయనంకూడా. ఉపనయనం అంటే ఆకాలంలో ఒక మహోత్తరుగా పలకాబలపం'. సిసలుగా చెప్పాలిసొస్తే ఉప=సమీపంగా, నయనం=తీసుకోవటం. దేనికి సమీపంగా అనే ఆకాంక్ష అనివార్యం. బ్రహ్మచర్యానికి లేక గురుకులానికి అని ప్రత్యుత్తరం. బ్రహ్మచర్యం కూడా మళ్లీ అదేమాదిరి. 'బ్రహ్మ' అంటే వేదం. 'చర్యం' అంటే దాంట్లో చరించటం. పుస్తకంలో చరించటం ఎట్లా? అదేమన్నా వీధా, సందా? — కాన, 'ప్రకరణబలా'న్ని పట్టి వేదం చదవడం అనే అర్థం ఉపలభ్యమవుతుంది. ఇప్పుడీపదం కేవలం **Sex-Control** పరంగా వాడబడుతుంది. మనమే కాదు, యోగపతంజలికూడా వాడాడు. కాబట్టి సూత్రయుగంలోనే ఈపదం అర్థం మార్చుకొంది. లేక మెం పొందించుకొంది. ఖాలీ మన దోషమే కాదు.

## 3

త్రైవర్ణికులైన ప్రతివాణ్ణి వాళ్లకు తోచిన 'యుక్తవయస్సు' వచ్చేటప్పటికీ, ఏదో ఒక గురువుగారి ఆశ్రమంలోకి తోలేవాళ్లు. (పశువుల్ని తోలినట్లు)—ద్విజన్ముల్నిగా చెయ్యాలి అని వాళ్ల ప్రయాస

7. ఇది వేదాంతులు 'లోపాయికారి' (వ్యావహారికం)గా చెప్పేమాట. అసలు వాళ్లకు 'సృష్టి' అంటే భ్రాంతిగా, నమ్మకమే లేదు.

8. ఇది నైయాయికులు తథ్యంగా నమ్మేవిషయం; సృష్టి ఈశ్వరసంకల్పపూర్వకం.

9. మీమాంసకులకు వేదం నిత్యం, అపౌరుషేయం.

† ఉపనీయ కృత్స్నం వేద మధ్యాపయేత్ స ఆచార్యః; యస్త్వేకదేశం స ఉపాధ్యాయః.

—వా. ధ.

* ఆదేశః శ్రౌతో విధిః; ఆదేశస్య సమీపవర్తిత్వాత్ స్మార్తో విధి రుపదేశః.

—సాయన. భా.

10. వైదిక వాఙ్మయ చరిత్రాన్ని (౧) ఛందో (౨) మంత్ర (౩) బ్రాహ్మణ (౪) సూత్రయుగాలని నాలుగు యుగాలుగా 'పాశ్చాత్యులు' విభజించారు. మనవాళ్లకిది గిట్టదు. 'జ్ఞానం నిత్యం, అందులో మళ్లా యుగాలూ గిగాలూ ఏమిటి?' అనివాళ్లు వేసే ప్రశ్న.

అంతా ఇంతా కాదు. ఆ ఋష్యాశ్రమాల్ని కావ్య రసంలో వర్ణించకుండా 'రసం పిండి' చెప్పాలి అంటే, అవి అరణ్యప్రాంతాల్లో ఉండేవి, ప్రకృతి దేవి క్రోడంలో. 'ధర్మచక్రాన్ని' రక్షించే రాజే వార్షికాలు మొదలైనవి అంతో ఇంతో 'ముట్టజెప్పే వాడు' అన్నపానాదులకని. ప్రతిఋషికీ వసిష్ఠుడి కున్నట్లు 'కామధేనువు' ఉండటం సంభవమా? ఇప్పుడు మటుకు ఇంపీరియల్ బాంకు (Imperial Bank) లో అక్కౌంటు (Account) ఎన్ని సంస్థ(Institution) లకు ఉంది? ఈ ఆశ్రమాలే పరివర్తిపాద్ధయుగంలో నలందా, తక్షశిలా, నాగార్జున కొండలుగా మారాయి. అక్కడికి వెళ్లి వాళ్లు గురువుగారికి 'శుశ్రూష'అగపర్చేవాళ్లు, సేవచేసి. ఈ మాటకూడా ఇట్లాగే విపర్యాసాన్ని పొందింది. ఇప్పుడు 'శుశ్రూష' అంటే రోగికి ఉపచారం చెయ్యటం, గ్రహచారమా అంటూ. అప్పుడు అజ్ఞాన రోగి అయిన శిష్యుడు 'బ్రహ్మవేత్త' అయిన గురువుగారికి 'ఆదరసత్కారాల్తో' సేవచెయ్యడం. ఈ సందర్భంలో 'సేవయా పరిప్రశ్నేన' అనే గీతా శ్లోకమున్నూ, 'నాపృష్టః కస్యచిద్బ్రూయాత్' అనే మానవవాక్యమున్నూ 'ఆచార్యాద్ధ్యేవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపయతీతి' అనే ఛాందోగ్య శ్రుతిన్నీ గుర్తుకు వస్తున్నాయి. ఇట్లా, ప్రేమంలో శూద్రత్వాన్ని వరించి—మరి సేవ శూద్రధర్మమేకదా—ఆశ్రమవస్తువుల్ని 'రక్షించి' అంటే బాగోగుల్ని చూస్తూ వైశ్యత్వాన్ని పొంది, బలీయమైన క్షాత్రశక్తిని సంపాదించి 'ద్రఢిష్ఠులై బలిష్ఠులై' ద్విజన్మలోకి బాప్టయిజ్ 'Baptise' అయ్యేవాళ్లు అంటే ఆశ్చర్యపడక్కర్లేదు. గురువులు మహానిర్లిప్తులుగా ఉండేవాళ్లు, బుద్ధిమంతులు అవటమేకాకుండా. ఎవ్వరైనా పోయి ఏమైనా అడగా లనుకుంటే 'యది విజ్ఞాస్యామః సర్వం హ వో వక్ష్యామ 11 అని వినయంగా చెప్పేవాళ్లేకాని, 'మదన్యః క స్సమర్థః' అనేవాళ్లుకారు. శిష్యులుకూడా విని తుదకు, 'త్వం హి నః పితా, యోఽస్మాక మవిద్యాయాః పరం పారం తారయసీతి' 12 అని కృతార్థులయ్యేవాళ్లు.

ఇంకోచిత్రం— 'శ్రోత్రియు'డైన గురువుగారి దగ్గఱకు తీసుకోవెళ్లాల్సింది నెలజీతం 'Monthly Fee' కాదు—సమిత్తులు. 13 ఎందుకంటే గురువుగారు హోమ ధూమాగ్నిని లేవదీసి, ఆచుట్టుప్రక్కల ఉన్న చెట్టూ చేమల్ని వల్లపరిచి, తనమనస్సులో నలుపు లేదని తెలియచెప్పేవాడు, బల్లగుర్ది. 14 ఇప్పుడు మనం పెద్దల్ని చూడాలి అంటే ఆకో పోకో, పండో పువ్వో పట్టుకోపోతున్నాం, హితోపదేశంలోని శ్లోకం గుర్తుకు వచ్చి. శ్రోత్రియుడంటే 'బుద్ధిజాడ్యోన్మాదం'తో 'వేదజడు' డనిపించుకొంటూ, చాదస్తంగా నిష్ఠను నీళ్లుచల్లి శుద్ధిపరచే ఆయన కాదు; సమగ్ర వేదాన్ని చదివి, 15 బ్రహ్మిష్ఠుడైన ఆయన. సమగ్ర వేదం అంటానికి కారణం ఏమిటంటే, 'అల్పశ్రుతి అయిన మనుష్యుడు నన్ను ఏకదేశపరంగా అన్వయించి చంపుతాడని వేదం భయపడుతోందిట. ఈ సత్యాన్ని గ్రహించే 'ధర్మాశోకుడు' తనరాజ్యంలోని ప్రజలందరూ 'బహుశ్రుతులు' 16 విశేషంగా చదివిన వాళ్లు కావలసింది అని శాసించాడు; లేకపోతే సంకీర్ణతా తద్ద్వారా కలహాలూ అనివార్యమని ఆయన అభిప్రాయం. కొంచెం ఆలోచించిచూస్తే కుటుంబకలహాలూ, గ్రామకలహాలూ, రాష్ట్రకలహాలూ, దేశకలహాలూ ఈ సంకీర్ణతాబీజంమీద పండింపబడ్డవే అని తెలిసికోగలం.

---

11. ప్రశ్న. ఉ. ౧.౨.
12. ప్రశ్న. ఉ. ౬. ౮.
13. గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః —ముండ. ఉ. ౧. ౨. ౧౨.
14. యత్రచ మలినతా హవిర్ధూమేషు, నచరితేషు —కాదంబరి.
15. శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి—విష్ణు. పు. – ౬. ౫. ౬౪
16. అశోకుడి ౧౨ — వ శిలాశాసనం.

## ౪

కొంచెం దిట్టమయిన ఆయన అవులే శిష్యుణ్ణి ఆశ్రమంలోనే అట్టేపెట్టి ఊర వెయ్యక, నేను తీర్థయాత్రకు పోతున్నాను, నీవు ఈ నాలుగువందల ఆవుల్ని తీసుకోపోయి, వెయ్యి అయ్యేదాకా మేపి తీసుకోరా, నీకు చెప్పాల్సింది చెప్తాను అనేవాడు. పెద్ద చెట్టు క్రింద చిన్న చెట్టు ఉంటే పెరగదు—ఈ విషయాన్ని గ్రహించే, వాళ్లు శిష్యులకు అనంతస్వాతంత్ర్యాన్ని ఇచ్చేవాళ్లు. అప్పుడు, వాళ్లు ప్రకృతిదేవి దగ్గర్నే పాఠాలు వల్లించేవాళ్లు, పాఠశాల నాలుగుగోడల మధ్య 'ఉక్కిరి బిక్కిరి' అవకుండా. శ్రీరామకృష్ణ పరమహంస ఏగురువుదగ్గరా చదవకపోయినా, 'ఉపమానాల్లో కాళిదాసుని దాటిపోయాడు; 'ధ్వనిసరస్వతి' అని ఆలంకారికులచే దణ్ణం పెట్టించుకోగలిగాడు. ఇది నిన్న మొన్నటి మాట. ప్రకృతిలో నేర్చుకోవాలిసింది నేర్చుకొని ఆశ్రమం చేరుకొనేటప్పటికే, గురువుగారు కూడా తీర్థంనుంచి తిరిగివచ్చి, 'బ్రహ్మవిదివ వై సౌమ్య భాసి 'నకించన వా కూయ' అని ఊరుకుండేవాడు. ఇట్లా సత్యకాముడు అనే ఆయన హంసమద్గాగ్ని ఋషభములనుండి బ్రహ్మవిద్యను నేర్చుకొన్నాడు. హంస అనేటప్పటికి పరమహంసగారు కారుమొగిళ్ల దగ్గర తెల్లటి కొంగలబారును చూచి, ప్రశమసమాధిని పొందటం జ్ఞాపకంవస్తోంది. ఇట్లా నిండుబయట తిరిగి రావడానికే 'సంమ్రాజులు' అనేవాళ్లు. 17

వాళ్లక్కడ ఖాళీ వేదాన్ని తత్సంబంధమైన పరమార్థ విషయాల్నే నేర్చుకొనేవాళ్లు అని సరిపుచ్చుకొంటానికి వీల్లేదు. జన్మతః, బ్రాహ్మణులైనా, క్షాత్రవిద్య వైశ్య విద్యల్ని (Warfare and Economics) నేర్చుకొనేవాళ్లు. అట్లాగే క్షత్రియులుగూడా కేవలం క్షాత్రం కాకుండా బహ్మవిద్య, వైశ్యవిద్యల్ని కూడా నేర్చుకొనేవాళ్లు. వైశ్యుల సంగతికూడా అంతే. కాకపోతే, బ్రాహ్మణులైనద్రోణ, అశ్వత్థామ, కృపాచార్యులు యుద్ధం చెయ్యటం, క్షత్రియుడైన భీష్ముడు ధర్మోపదేశం చెయ్యటం ఎట్లా సంభవించాయి? మహాభారతంలోని ద్రోణపర్వం, శాంతి అనుశాసన పర్వాలు ఈ విషయాన్నే దృఢపరుస్తున్నాయి. దశకుమారచరిత్రలో ఒక బ్రాహ్మడు వర్తకానికి బయలుదేరినట్లు గుర్తు. దేవీసప్తశతిలో సురథుడు అనే రాజు 'లోకేషణ' సంపూర్ణంగా వదల్లేక సావర్ణి అయినట్లూ, సమాధి అనే వైశ్యుడు నిర్విణ్ణమనస్కుడై 'జ్ఞానం వ్రతే' అవటం మరోనిదర్శనం. అదీకాకుండా మనువు 'ఆపద్ధర్మా'ల్లో వృత్తుల్ని తారుమారు చేశాడు కదా! అనేకవేల అంతేకుమునుపు తెలియకుంటే, అవలంబించి జీవనాన్ని పోషించుకోటం సంభవమా? శూద్రకర్మలకు గూడా అభావం ఉండేదికాదు. శిల్పానికి ఆదిగురువులైన విశ్వ-బ్రహ్మ మయ-బ్రహ్మలూ, నాట్యశాస్త్రాచార్యుడైన భరతముని ఈ విషయాన్నే ఘంటాపథంగా ఉటంకిస్తున్నారు.

మరి, గురుకులంలోంచి తిరిగి వచ్చాక ఇప్పట్లా ఒకళ్లు మరొకళ్లు, 'ఉద్యోగం' మీద పోటీపెట్టి, 'వర్ణ సంకరం' (Confusion of Crafts) చేసేవాళ్లుకాదు. 'స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః' (గీ. 3-3౫) 'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః' (గీ. ౧౮-౪౬) అని ఎంచి, తమతమ వర్ణాశ్రమవిహితాన్నే అనుసరించేవాళ్లు. బ్రాహ్మణునికి ధర్మోపదేశంచేసే సామర్థ్యం ఉన్నా, తన కసాయి వృత్తి విడువని ధర్మవ్యాధుడే ఈ విషయంలో ప్రకృష్టదృష్టాంతం. కాని, అక్కడనుంచి తిరిగి వచ్చేటప్పటికే వాళ్లకు, సర్వాంగ సుందరమైన(All round) విద్య లభించేది.

గురుకులంలోంచి తిరిగి రావడాన్నే, 'సమావర్తన' అనేవాళ్లు, ఇప్పుడు మనం కాన్వొకేషన్ (Convocation) అంటున్నట్టుగా. అప్పుడు స్నానంచేసి ఈ స్నానం చెయ్యటంవల్లనే వాళ్లని స్నాతకులు అనేవాళ్లు, ఇప్పుడు మన ఉపనయనంలో ఇవి కాశీవెళ్లడం మొదలైన తమాషా (Farce) లుగా మారాయి. అంతేకాకుండా ఉపదాన్ని

17. ఛాందోగ్య ఉ. ౪. ౪. ౪-౯.

మనం డిగ్రీహోల్డర్సు(Degree Holders) పరంగా వ్రాస్తున్నాము—గురువుకు ‘విద్యానిష్క్రయం’ అంటే ఏదో కొంచెం దక్షిణ కృతజ్ఞతాసూచకంగా ముట్ట చెప్పి, చివరి ఉపదేశం విని నిష్క్రమించేవాళ్లు. ఆ ఉపదేశమే, ‘సత్యంవద ధర్మంచర’ (తై. ఉ. ౧.౧౧) ఇత్యాది. అందులో పారంపర్యంగా వచ్చిన బ్రహ్మ విద్యను స్వాధ్యాయంవల్ల నిలబెట్టుమనటం, వివాహం కూడా ప్రజాతంతువు తెగిపోకుండా ఉండటానికే చేసికొని ఆ బ్రహ్మవిద్యయొక్క అనుక్రమం అవిచ్ఛేదంగా ఉండేటట్లు చూడమని ఆజ్ఞాపించటం, మాతాపితరుల్నీ, అతిథినీ, ఆచార్యుణ్ణీ దేవుడుగా చూడమనటం, ధర్మసందేహం వస్తే తనకు తోచినట్లు తలతిక్కగా కాకుండా పలుగుర్తో ఆలోచించమంటం, వాళ్ల శీలంలో ఉన్న మంచినిమటుకే అనుకరించమంటం, వినయాది సుగుణాల్ని అవశ్యం అభ్యసించమంటం విశేషంగా గమనించతగ్గవి. ఇప్పటి మహామహోపాధ్యాయులు, పి. హెచ్. డీలు చెప్పే కాన్వొకేషన్ ఉపన్యాసాలకు ఇదేమైనా తీసికట్టవుతుందేమో మరి మీరే చెప్పండి.

※

ఇట్లాంటి విద్యా, ఉపదేశం పొందేటప్పటికి వాళ్లకి సుమారు పాతికేళ్లు వచ్చేవి. ‘బ్రహ్మచార్లు’ గాబట్టి మంచి ‘బలిష్ఠులు ద్రఢిష్ఠులు’గా ఉండేవాళ్లు. ‘విద్యా దదాతి వినయం’ అన్నట్లు సుగుణాలకి లోపం ఉండేదికాదు. సుశిక్షితమైన మనోవాక్కాయాలతో సమాజంలో అడుగుపెట్టేటప్పటికే, వాళ్ల నడచటానికి పోలీసుబలంగాని, బాగోగులు చూడ్డానికి అంతగా డాక్టర్లుగాని అవసరమయ్యేవాళ్లు కాదు.

అప్పటి సాంఘిక-నవల వ్రాయవలసివచ్చి, ఒకాయన వరాన్వేషణ చేస్తున్నాడు అనుకొందాం. ఇప్పుడు బి. యే. చదివాడా, ఎమ్.ఎస్.సీ. చదివాడా అని తటపటలాడేటట్లు, అప్పుడు ‘సమావర్తన’ అయిందా? అని కనుక్కొనేవాళ్లు. అయితేనే పిల్లనిచ్చేవాళ్లు. అంటే, సమాజంలో స్థానం లభించేది. ఇప్పుడు మనం రాత్రిబళ్లు, మేజిక్ లాంతర్లు, సినిమాలు, రిఫర్ మేటరీలు పెట్టి చెయ్యలేకపోతున్న పనిని—నిరక్షరాస్యతాదుర్మార్గాల్ని—వాళ్లు ఈ ఒక్క యజ్ఞోపవీతంవల్ల, జయించేవాళ్లు అన్నమాట. అందువల్లనే ‘యజ్ఞోపవీతం పరమం పవిత్రం’ అని పెద్దలంటున్నారు. చిన్నలు నవ్వుతున్నా ఈ ‘మాత్రమే’ అప్పటి సమాజాన్ని శిథిలంకాకుండా బంధించి నిలిపిఉంచింది. (ఇప్పుడు నామమాత్రావశిష్టం.)

గృహస్థుడయ్యాక ‘అగ్న్యాధానం’చేసి యథా విధిగా శ్రౌతస్మార్తకర్మల నన్నింటినీ ఆచరించాలిసిందే; ఇప్పట్లా రెండుసంధ్యల్నీ కలిపి ఒకసారే వార్చి, ‘బ్రతుకుజీవుడా’ అంటానికి వీలుండేదికాదు. ‘పంచమహాయజ్ఞా’ల్నిచేసే భోంచేసేవాడు అప్పటి తాతయ్య. అతిథి వస్తే ఎదటివారియిల్లు చూపించి ‘పీడ వదలిపోయింది’ అని తప్పుకొనేవాడు కాదు. అతిథినే విష్ణువుగా భావించి ‘పాదోదకం భగవతః ప్రపునాతి సద్యః’ (నృ. పు. ౩౪-౮౬) అని ‘శిరమువం గీలించి’ భోజనాదులతో సత్కరించేవాడు. అయితే, ఇంక భిక్షుకసమస్యకు గాని బీదలచట్టాల(Poor-Laws)కు గాని చోటుండేదా?* ఎక్కువపుత్రుల్నికని ‘పోకిల్లా’ అవటానికి వీలుండేది కాదు. మనువు అగ్రజుణ్ణే ఆత్మజుడనినీ, తక్కినవాళ్లని కామజులనినీ నిర్వచించాడు. అంటే, పుత్రోత్పాదన ప్రజాతంతువును నిల్పి బ్రహ్మవిద్యను పరంపరగా రక్షించే మహాకార్యమనినీ, కామలాలసతాపూరణపూర్వకమైన కుత్సితకార్యం కాదనినీ వాళ్లమనస్సులలో ఉండేది. కాకపోతే ఛాందోగ్యంలో పంచాగ్నివిద్యాప్రకరణంలో ‘పురుషాగ్ని, యోషితాగ్ని’ అని రూపకమొనర్చటం, బృహదారణ్యకంలో ఆ యావేదజ్ఞులయ్యే పుత్రులు జన్మించే ఉపాయాలు — ముఖ్యంగా అంత బ్రహ్మోపదేశం నోరుపడే టట్లు చెప్పి—కుదకు పఠించటం సంభవమయ్యేవికావు. అందుమూలంగా సమాజంలో సంతాననిరోధం మొదలైన పాశవిక

* ఏసమాజంలో శాసనాలు ఎంత ఎక్కువగా ఉంటే ఆసమాజంయొక్క శరీరం అంత అనారోగ్యపీడితం; అంతేగాని, అవి లేకపోతే, దానికి బిల్లుల్నీ, ఏక్టులూచేసే “తిరురహస్యం” తెలియదు అని.

ఉపాయాలను, ఆహారం నిరుద్యోగంలాంటి సమస్యల్ని రూపుమాపటానికి అవలంబించాలిసి వచ్చేదికాదు.

ఆ సమాజంలో – అది నిర్మింపబడ్డ సూత్రాల్ని బట్టి చూస్తే – నిరుద్యోగం, కాటకం, జనాధిక్యత (**Over-population**) ఉండేవే కావా అనిపిస్తోంది. ఎవరిదగ్గరా డబ్బు పోగుచేసుకొని కూర్చుండటానికి వీలుండేదికాదు. ఏమంటే సామర్థ్యముంటే, బ్రాహ్మణుడైతే ఏద్వాదశవార్షికమో, క్షత్రియుడైతే ఏ అశ్వమేధమో, వైశ్యుడైతే ఏ తులాభారమో చేసి తీరేవాడు తప్పనిసరిగా; ఇప్పుడు చేతులో డబ్బుఉంటే సినిమాకో లేక సీమకో వెళ్లివస్తున్నట్లు. వాళ్లమనస్సు పన్నెండేళ్లు చదివిన వేదపంక్తులతో సంలగ్నమై, ఏదో ఒక క్రతువును చెయ్యటానికి ఉవ్విళ్లూరేది. విశ్వజిత్తులాంటి యజ్ఞమైతే ఉన్నదంతా దానం చెయ్యాలిసి వచ్చేది. అంటే: అర్థమొకచోట పోగుకాకుండా సమాజంలో ఉన్న అందరిపైనా పంచబడే దన్నమాట; రష్యావాళ్లు చేస్తున్న 'లైనట్' ప్రయోగం అవసరం లేకుండా, కుదిమెత్తగా, 'సామ్యవాదం' సిద్ధించేది. దీనికి రఘు మహారాజులుంగారు అపూర్వమైన ఉదాహరణ. ఎవరోఋషి వచ్చేటప్పటికీ, ఆ క్రితందినంచేసిన యజ్ఞంలో అంతా మైనస్ అయి జీరో మిగలటంవల్ల, మృణ్మయపాత్రలతో అర్ఘ్యపాద్యాదుల్ని అర్పించటానికి తయారయ్యాట్ట, కొంచెం సంకోచిస్తూ, 'ఎదుటవాణ్ణి మరేమీ అడిగేందుకు వీలులేదు' అని రెట్టిస్తూ. మరి,ఆ నవాయితీలో నిజాయితీ కుంటుపడకూడదుకా!

అసలు సంగతి చెప్పాలిసొస్తే ఈయజ్ఞంమీదనే సమాజం ఆధారపడి ఉండేది. అందరు అన్నివృత్తులూ దాన్నే ఆధారం (**Centralise**) చేసుకొని ఉండేవి; (ఇదో పెద్దస్కాందపురాణం. భారతి చోటిస్తే మరో తడవ చెప్తాను) థయస్సు అనేవేశ్యను 18 అవలంబించుకొని, ఆ కాలపు రోములో సర్వవృత్తులు ఉన్నట్లు. పురాణయుగంలోని సభ్యతను దేవాలయసభ్యత (**Temple civilisation**) అంటానికి ఏమీ అభ్యంతరం లేనట్లు, వేదకాలంనాటి నాగరకతను యాజ్ఞిక సభ్యత (**Altar-Civilisation**) అంటానికి ఎట్లాంటి అభ్యంతరం ఉండదు. ఈ విషయాన్నే 'సర్వయజ్ఞమయో హరిః' అని నుడివి 'అధ్వరాత్మక'మైన యజ్ఞవరాహరూపాన్ని అభివర్ణించి, 'జగత్తుయొక్క సంస్థాపన'కు కారణమనిచెప్పి తృప్తిపడ్డాడు భాగవతకారుడు. రాక్షసులు ఈయజ్ఞాల్ని పాడు చెయ్యటంలో మాంచి సరదా చూపేవాళ్లు, అని వింటున్నాము. ఇందులో ఒక రహస్యం ఉంది. వాళ్లకు బ్రాహ్మలు, ఋషులు అంటే బొత్తిగా కోపమే ఉండేదికాదు. 'అలుగుటయే ఎరుగని అజాతశత్రువులతో' ఎవరికి అలక ఉంటుంది? శత్రుత్వం ఉంటుంది? వచ్చిన చిక్కేమిటంటే ఆ బ్రాహ్మలూ, ఋషులూ ఇచ్చిన హవిని భుజించే దేవతల వళ్లు బలిసేది; అంటే, యజ్ఞగృహమే దేవతల వంటిల్లు మాదిరి. దాన్నే నాశనంచేస్తే, వేరూడదీసిన మొలకలా దేవతలు సమూలం వాడిపోతారని వాళ్లట్లు చేసేవారు. 'ఆరునెల్లు సాము చేసి, మూలనున్న ముసలమ్మని చంపేవాళ్లు' అనుకోకూడదు. దేవతలతోటే వాళ్లకు పరమవిరోధం.

## ౬

పాత్రోదయమై, నెరసినవెంట్రుక ఓటి కనపడేటప్పటికి వానప్రస్థంలోకి తప్పుకోమన్నాడు మనువు. ఇంతకాలం సమాజంలో ఉండి, అది ప్రసాదించిన సుఖాన్ని ఇంతో అంతో అనుభవించావు, ఇక నీ తర్వాతవాళ్లకు చోటువదులు— **Vacate your seat** అనేవాళ్లు. ఇప్పటి పెన్షన్లు, రిట్రెంచిమెంట్లు, కట్సు, చెయ్యలేనిపని ఎట్టి ఖర్చూ లేకుండా ఆవానప్రస్థం చేసేది. నవాగతులకు నిర్విఘ్నంగా సమాజంలో స్థానం దొరికేది. వీళ్లుకూడా, సంసారంయొక్క చిందరవందర్లోనుంచి బయటపడి, జీవితంలో చేసిన మంచీ చెడ్డను గుణించి ఆలోచించుకొని, ఆనందంపడటమో అనుతాపంపడటమో అయ్యేది. అంతేకాని, ఆవు వట్టిపోయిందనో, ఎండపెట్టిన నువ్వులు ఆవుదూడ 'ఫలహారం' చేసిందనో, వడ్డీకాతాలపుస్తకం చెదపురు

---

**18. Vide, Thais (A novel) by Anatole France E. T.**

గులు 'నటకోయస్వాహా' చేశాయి అనో, పంచపాత్ర మాటువేయించాలి అనో దిక్కుమాలినతాపత్రయంతో బాధపడేవాళ్లుకాదు. **'Let the dead bury the dead'** 19 మృతులు మృతుల సంస్కారంచేసుకోనీ, అని బయటపడి, 'కృష్ణా గోవిందా రామా' అనుకొనే వారు.

వానప్రస్థంలో కామ్యాది కర్మల్ని 20 వదిలి ఒక్క నిత్యకర్మనే ఆచరించేవారు; 'ఆ ప్రయాణాంతం' అగ్నికర్మఉండాలి అని పూర్వమీమాంసా నియమం కాబట్టి * పైగా, వేదోక్తములైన ఉపాసనల్ని ఆచరిస్తూ మనస్సు దిట్టమైనతర్వాత, అగ్నుల్ని ఆత్మయం దారోపించుకొని 21 — మరి వాట్ని వదలకూడదుకాదూ—'అభయం సర్వభూతేభ్యః, స్వస్తి సర్వజీవేభ్యః, అనిదేశ దేశాలా తిరిగేవాడు.

వేదముయొక్క సంహితాభాగం బ్రహ్మచర్యంలోనూ, బ్రాహ్మణభాగం గార్హపత్యంలోనూ, ఆరణ్యకభాగం వానప్రస్థంలోనూ, ఉపనిషద్భాగం సన్యాసంలోనూ చాలా అవసరాలు. బ్రాహ్మణుని సన్యాసాన్ని పారివ్రాజ్యమనిన్నీ, క్షత్రియుడి సన్యాసాన్ని మహాప్రస్థానమనిన్నీ, వైశ్యుడి సన్యాసాన్ని త్రివేణీగమనం (?) అనిన్నీ అనేవాళ్లు. గురుకులంలో ఉండి జ్ఞానార్జన చేసేనిమిత్తం బ్రహ్మచర్య వ్రతగ్రహణమెనర్చేవాళ్లని 'ఉపకుర్వాణులు' అనేవాళ్లు వాళ్లే మళ్లావచ్చి, గృహస్థులై సమాజంలో ప్రవేశించేవాళ్లు. మరి, నైష్ఠికులని ఇంకోరకం ఉండేవాళ్లు. వాళ్లు విద్యాపిపాస తీరనందువల్ల అక్కడే అట్టే ఉండిపోయి, ఇంకా విద్య నభ్యసించి (Direct) గా సన్యాసం పుచ్చుకొనేవాళ్లు. 22 ఇది విద్వత్, వివిదిషా, ప్రాయశ్చిత్త, ఆతుర, మర్కటాలని ఐదువెరా స్తర్లుగా కనపడుతోంది. విద్వత్సన్యాసం అంటే, కాయ పండై చెట్టుమీదనుంచి దానంతట అదే పడేటట్టు మనస్సు జ్ఞానంవల్ల పరిపక్వమై పొందే ఉచ్చస్థితి. దీన్ని పారిభాషికంగా 'ఏషణాత్రయవ్యుత్థానము' అంటారు. 'అమృతత్వస్యతునాఽశాస్తి విత్తేన' (బృ. అ-౨-౪) అని చెప్పి తప్పుకొన్న యాజ్ఞవల్క్యుడే దీని కుదాహరణ. వివిదిషా అంటే బ్రహ్మమును తెలుసుకొందామనే ఉద్దేశంతో పుచ్చుకొనేది; మనకళ్ల ముందర కనబడేవాళ్లలో చాలామంది ఈ శ్రేణిలో వాళ్లు. ప్రాయశ్చిత్త సన్యాసం అంటే సర్వదోషపరిహారంగా అనుతాపపడి పుచ్చుకొనేది; దీనికుదాహ

---

19. **Jesus Christ to his first deciples.**

20. వైదికకర్మ ఐదురకాలు: నిత్య, నైమిత్తిక, నిషిద్ధ, కామ్య, ప్రాయశ్చిత్తా లని. నిత్యకర్మ అంటే సంధ్యావందన అగ్నిహోత్రాదులు. నైమిత్తిక మంటే కొడుకు పుడ్తే చేసుకొనే జాతేష్టి మొదలైనవి. నిషిద్ధమంటే బ్రహ్మహత్య వగైరాలు. కామ్యకర్మలంటే స్వర్గానికి పోయే టిక్కెట్టు అయిన 'అపూర్వాన్ని' ప్రసాదించే జ్యోతిష్టోమాదులు. ప్రాయశ్చిత్తం అంటే, 'చేసినపాపం చెప్తే పోతుంది' అనిపించే చాంద్రాయణాదులు.

* తం యజ్ఞపాత్రేన దహంతి — (ఐ. ఉ. శం. భా.)

21. ప్రపంచ మఖిలం యస్తు జ్ఞానాగ్నౌ జుహుయా ద్యతిః
ఆత్మ న్యగ్నీ న్సమారోప్య సోగ్నిహోత్రీ న చేతరః.

22. బహ్మచర్యం పరిసమాప్య గృహీ భవేత్, గృహీ భూత్వా వనీ భవేత్, వనీ భూత్వా ప్రవ్రజేత్. యది వేతరథా బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్ గృహాద్వావనాద్వా. అథపున రవ్రతీ వా వ్రతీ వా స్నాతకో వాస్నాతకో వా ఉత్సన్నాగ్నికో వా యదహారేవవిరజేత్తద హరేవ ప్రవ్రజేత్

—జాబాల, ఉ. ౪.

రణ మహాపండితుడై, 'అద్వైతసిద్ధి'ని చేసిన మధుసూదన సరస్వతి.[23] ఆతురసన్న్యాసం అంటే ఆసన్నమృత్యువు పరమార్థచింతతో గ్రహించేది; దీనివల్ల మరణ సమయంలో శుభచింత ఉన్నందువల్ల, 'యంయంవాపి' అని గీతాశ్లోకంలో చెప్పినట్లు, సజ్జన్మప్రాప్తి కలుగుతుంది. చివరిదైన మర్కట సన్న్యాసం అంటే, ఎవ్వరిమీదైనా కోపం వచ్చి జంధ్యం తెంచుకొని పదిరోజుల పాటు ఇక్కడా అక్కడా తిరిగి, మళ్లా ఇంటికి చేరుకోటం. అనాశ్రమి అవటం వేదాంతసూత్ర విధురాధికరణంలో గర్హింపబడింది.*

ఈచతుర్థాశ్రమీయులే సంఘాన్ని నడిపేవాళ్లు రాజరాజైనా, నియమనిధి (**Legislation**) వాళ్ల చేతుల్లోనే ఉండేది. దీని కుదాహరణాలు నేటివరకు నిలచి ఉన్న స్మృతులు. 'సన్న్యాసి' శబ్దాన్ని చూచి భయపడనక్కర్లేదు. వేదకాలంలో వాళ్లనే ఋషులు లేక మునులు అనేవాళ్లు. వీళ్లే బౌద్ధయుగంలో సన్న్యాసులుగా మారారు. ఐతిహాసికంగా చూడాలిసొస్తే బుద్ధుడే వైదిక-బౌద్ధ యుగ సంధ్యలోని తుది ఋషి - ముని. అసలు ఋషి శబ్దానికర్థం—ఏవో కొన్ని కొత్త సత్యాల్ని ఆవిష్కరించినాయన అని. బుద్ధుడితర్వాత స్వయంగా ఎవరు ఏమి చెప్పారు? అన్నీ భాష్యాలు, వార్తికాలు, టీకలు, నిబంధనలేగా సుతీ. ముని అంటే మననశీలుడు, (**Thinking brain**) వీళ్లింకా మన భాగ్యాన్ని నిలబడి ఉన్నారు, అంతర్ధానమైపోలేదు ఆకాశంలోకి. ప్రస్తుతం సన్న్యాసిపదం వెటకారంగా తోస్తే జాతీయసేవకులు (**National Workers**) అని వాడుకోవచ్చు. వీళ్లు సిద్ధిని పొందాక 'లోకసంగ్రహార్థం' పని చేసేవాళ్లు.

౭

ఈ సన్న్యాసికి ముఖ్యలక్షణం స్థితప్రజ్ఞత్వం, ఏషణాత్రయత్యాగం. చివరిది లేకపోతే దృష్టి సంకుచిత మవుతుంది. ప్రాదేశికత, స్వార్థపరత, అవినీతి, నామయశఃకాంక్ష మొదలైన దుర్గుణాలు లేచి, కార్యాన్ని —ఎంతటి మహాత్కార్యమైనా, ఎంత మహదుద్దేశమున్నా — పాడుచేస్తాయి. స్థితప్రజ్ఞత (**Mental Equilibrium**) లేకపోతే జగత్తులో ఏపనీ సాధ్యం కాదని ప్రతిముసలమ్మా చులకనగా చెప్పేదేకాదూ.

'స్వదేశో భువనత్రయం' అని భూగోళ సీమల్ని రద్దుపర్చి, దృష్టిని విశాలం చేసుకొని, జాతి, ధన, పదవు లన్నీ వీడి, బ్రహ్మలోకంవరకూ ఉన్న వస్తువులమీద వాశు ఆశ లేదు, 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని హృదయాన్ని విప్పి 'నిర్గచ్ఛతి జగజ్జాలాత్ పంజరా దివ కేసరీ' అన్నట్లు సేవారంగంలోకి దూకకపోతే ఏపని అవుతుంది, ఎంత అవుతుంది? చాలమంది భావం సన్న్యాసి 'కర్మ - త్యాగి' అని. కాని అసలు తాత్పర్యం పదాన్ని తల్లక్రిందులుచేస్తే దొరకుతుంది, 'త్యాగి, కర్మి' అని. ఇతడికి స్వర్గాది లోకాల్తో పనే లేదు; ఆత్మముక్తికై ఈశ్వరార్పణంగా నిష్కామ కర్మ చెయ్యాలిసిన అవసరంకూడా లేదు, 'న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా' (గౌ. కా. ౨.౩౨) అని గ్రహించాడు కాబట్టి. కేవలం మిగిలేది, 'వసంత ఇవ లోకహితం చరంతః' దీక్షే. శంకరాచార్యులవారు 'యథా భగవతో వాసుదేవస్య క్షాత్రకర్మ చేష్టితం' (గీ. భా. ౨. ౧౦) అని అన్నా, వినిపించుకోకుండా, గీతారహస్యాలూ, అపహాస్యాలూ బయలు దేరాయి. అసలు ప్రశ్న: ఇల్లాంటివాళ్లు దేశంలో ఎంత మంది ఉన్నారు? వీళ్లు లేకపోతే లెక్చర్లు, ఫండ్లు నామమాత్రాలు. అందుకనే వివేకానందుడు, మనుష్యులేరీ! "**Where are men**" అని వాపోయాడు.

కర్మత్యాగం అనే అభిప్రాయం ఎక్కణ్ణుంచి వచ్చిపడింది? అని ఆలోచించేసరికి, శంకరాచార్యులు

---

23. 'సన్న్యాసగ్రహణమాత్రేణ నరో నారాయణో భవేత్, సన్న్యాసస్య సకలపాపప్రాయశ్చిత్తత్వోక్తత్వాత్'

—మధుసూదనసరస్వతి జీవితం.

* వైష్ణవులు 'చరమశ్లోకా'న్ని పఠించి కాషాయం పుచ్చుకొన్నా, శిఖాయజ్ఞోపవీతాల్ని వదలరు; కారణం, వాళ్లు 'జ్ఞాన-కర్మసముచ్చయవాదులు.'

పూర్వమీమాంసకులకు జవాబియ్యటం కనిపించింది. అందులో ఆయన, బ్రహ్మమును తెలుసుకోవాలంటే 'తెలుసుకోటం' తప్ప క్రియాకర్మల్తో అవసరంలేదు; 'అగ్నిజ్ఞానం' కావాలంటే అగ్నిని తెలుసుకోటంకాక మరేమీ చెయ్యక్కర్లేదు, అన్నారు. మళ్లీ, అన్యవిధుల ద్వారా లేక ఉపాసనలద్వారా కొన్ని ఫలాలు సాధింపబడేట్టు ఈ బ్రహ్మజ్ఞానంకూడా 'సాధింపబడదు' అన్నారు. కారణ మేమంటే, బ్రహ్మజ్ఞానం అగ్నిజ్ఞానమల్లే 'భూత-వస్తుతంత్రం'. అంతేకాకుండా అది ప్రత్యగాత్మసంబంధీయం. దాన్ని ఉన్నదాన్ని ఉన్నట్లు తెలుసుకోవలసిందేకాని, ఊహించటం లేక ఇంకోమోస్తరుగా అనుకోటానికి వీల్లేదు. అందుమూలాన, చెప్పాల్సొచ్చి ఆయన చెప్పిం దేమిటి అంటే, 'బ్రహ్మజ్ఞాని సర్వక్రియాతీతుడు, విధినిషేధాలకుగూడా అతీతుడు' అని. కాని, ఈవాక్యాలు ఆయన తర్వాతా, ఇప్పుడూ అర్థంచేసుకొనబడేతీరు చూస్తే, ముక్కుమీద వేలు వేసుకోవలసి వస్తోంది. మన స్కూలుజీవితంలోనేకాని, ఉద్యోగజీవితంలోనేకాని శని ఆదివారాల సెలవుకోసం తత్తరపడుతున్నాం! తర్వాత పింఛను పుచ్చుకొని, జీవితాన్ని కడుపులో చల్ల కదలకుండా, కాలుమీద కాలువేసుకొని మహారాజులా గడపాలి అనుకొంటాం. ఇది మన మనస్సులోని మాట. ఈ భావాన్నే బ్రహ్మజ్ఞానికి కూడా అద్ది, అతడు సర్వోత్కృష్టుడూ ఆదర్శప్రాయుడూ అవటంవల్ల, మనంకూడా ఇంతో అంతో తృప్తిపడటం తటస్థిస్తోంది. ఇంకా:

'బ్రహ్మజ్ఞానికి' కర్తృత్వం లేదు అని ఉండటంవల్ల మనం చటుక్కున పైనచెప్పిన భావంలో ఆయ నేం పని చెయ్యడు, హాయిగా కూర్చుంటాడు, భిక్షులారగిస్తా అని కాదు. కాని, 'గుణా గుణేషు వర్తంతే-నాహం కరోమి' అని ఆయన భావిస్తున్నందువల్ల ఇట్లా చెప్పబడిందేకాని, ఆయన ఏమీ చెయ్యకుండా రాచిప్పలా కూచుంటా డని కాదు; కూచో మనిన్నీ కాదు.

ఇట్లా సన్యాసాన్నీ సన్యాసుల్నీ అపార్థంచేసుకొని తూర్పారపొయ్యటమో లేక 'సాధన' ఆరంభించి కొంత బండీ నడచినతర్వాత పైవాక్యాల్ని చూచి, ఆ మట్టుగా చతికిలపడటమో మామూలుగా మనకళ్ల ముందర తటస్థమవుతుంది. అసలు చిక్కులాట ఎక్కడంటే, శంకరుణ్ణి చదివి అర్థంచేసుకోటంకంటె, చదవకుండా అపార్థం చేసుకోటం!

'విషమోఽయం ప్రసంగః' – ఈసన్యాసవ్యాఖ్య చాలవిచిత్రంగా ఉండే ఏటికి ఎదురీదినట్లు, అంటే రెండుముక్కలు చెప్పాలిసొస్తుంది.

౨

పూర్వం దేశీయరాజు ఉన్నప్పుడు, ఆయనే ధర్మాన్ని నాలుగుపాదాలా నడిపించి, నిర్దుష్టం (**Perfect**) అని పట్టా (**Certificate**) పొందేదాకా, నిద్రపోయేవాడు కాదు. సీతావనవాసం, శంబుకవధ మొదలైన ఉదాహరణాలు తప్పులు తిప్పలు. భాగవతంలో శ్రీరామచంద్రుడు 'నమో ఆర్యలక్షణశీలవ్రతాయ' అనేవాక్కుల్లో అర్చింపబడ్డాడు, అన్యథాగా కాదు. అందువల్ల, ఋషులు, మునులు దూరాన్నఉండి తమపని ఏదో తామే చూసుకుంటూ ఉండేవాళ్లు. అంటే దేశం దేశం తిరిగి – పరివ్రాజకులుగా మరి – తాము చేర్చుకొన్న జ్ఞానాన్ని పంచిపెట్టేవారు. ఎక్కడా మూడు రోజులకంటె ఎక్కువ 'తిష్ట' వేసేవాళ్లు కాదు. అందుమూలాన సమాజానికిగూడా భారం అనిపించేవాళ్లు కాదు. వర్షాకాలంమాత్రం నాలుగుమాసాలు ఒకేచోట ఉండి 'చాతుర్మాస్య'నడుపుకొనేవారు. ఇదీకాకపోతే, ఆశ్రమంలోనే ఉండి, వచ్చినవాళ్లకు రెండుముక్కలు చెప్పేవాళ్లు. కనుక, వాళ్ల కంతగా చెయ్యిచేసుకోవలసిన అవసరం ఉండేదికాదు. పైగా, సమాజంలో ఉన్నవాళ్లు తమదగ్గర తయారైనవాళ్లేగా. అయినా రాజు ప్రమత్తుడైనట్టు కాకి వచ్చి కబురు చెప్పితే చాలు, వచ్చి పడేవాళ్లు.

యథా: పాండవులజన్మ సంశయింపబడ్డప్పుడు మహర్షులు తమకొంప ముంచుకోపోతున్నట్టు, ధృతరాష్ట్రుడి దర్బారులోకి వచ్చి, వాళ్లకు **Birth Certificate** అనుగ్రహించి, మరీ ఇళ్లకు వెళ్లారు.

ప్రయోజనాన్ని బట్టి వాల్మీకి తన ఆశ్రమాన్ని మొదట ప్రసూతి గృహం (Maternity - Home) గాను, తర్వాత విద్యార్థి గృహం (Student Home) గాను మార్చాడు. 'కుశలవుల జన్మ, విద్య' అక్కడే కదా! చట్టం (Legislation) సంగతి ఇంతకుముందే చెప్పాం. ఇంకా వింతైనవిషయం ఏమిటి అంటే: జనకుడికి తానే మహావేదాంతి అన్నగర్వం వచ్చినట్లు తెలుసుకొని, సులభ అనే 'సన్యాసిని' జనకుడిదగ్గరకు వచ్చి, తప్పుదిద్ది మళ్ళీ చక్కా వెళ్ళింది. అయితే, ఈ విషయాలే మళ్ళీ అనువర్తిస్తాయి అని ఎందు కనుకో గూడదు? అనువర్తిస్తున్నాయికూడా ఏమో!

సమాజం కుంటుపడుతున్నట్టు కనిపిస్తున్నా, ప్రగతిశీలం. కాని, కళ్ళు మూసుకొని తెరిచేలోగా సమాజం హఠాత్తుగా కృతయుగంలోకి పోవాలి, స్వర్ణమయం కావాలి అని ఆకాశహార్మ్యాల్ని నిర్మించుకొని, అట్లా కాకపోవటంవల్ల నైరాశ్యంపొందే యువకులకి, ఒకమాట: సమాజాన్ని తయారుచెయ్యటం, నూతనవిధానాల్ని నిర్మించటం అనేవిషయమే ఔపచారికం. సమాజమే తన అవసరాల్నిబట్టి కొన్ని నియమాల్ని గ్రహించటం, త్యజించటం జరుగుతోంది. ఆసమాజాన్నే ఐతిహాసికంగా కొన్ని శతాబ్దాలు జరిగి వచ్చిన మనం, నిర్మాణం అనుకొంటున్నాం. పారమార్థికంగా, సమాజస్రష్ట ఎవ్వరూ లేరు. నదియొక్క ప్రవాహంమల్లే, దాని కదె సమాజమే సర్దుకొంటుంది. దాని శరీరంమీద ఏమైనా మకిలి ఉంటే, అంతో ఇంతో 'యథాశక్తి'గా శుభ్రం చెయ్యటం అనేసేవ చెయ్యటం మనవంతు — మనభాగ్యం.

౬

పైన వర్ణించిన వైదికసమాజంమీద వేయగల్గిన నింద ఒక్కటేమాత్రం కనుపడుతోంది. అది శూద్రులను గురించి. శూద్రులకు వేదాధికారం ఇవ్వలేదని దుయ్యబట్టటం. పరనిందే 'గోంగూరపచ్చడి'గా అభ్యస్తమైన మనకు, ఈవిషయం చాలా ఇంపైన 'మాతపురాణం' మొదలైనవాటిని ప్రసాదించింది. కొంచెం లోతుకుపోయి చూద్దాం; శూద్రులు అప్పుడు 'మైనారటీ' అని మొదటే చెప్పాము.

అది అధ్యయనయుగం; వ్రాయటం అంతగా అమలులో లేదని చాలామంది ఒప్పుకొన్నమాటేగా. ప్రతి వేదమంత్రానికీ మూల, పద, క్రమ, ఘన, జటాపాఠా లని ఐదుపాఠాలు ఉండటం పుత్రపౌత్రపరంగా పొల్లుపోకుండా వల్లించుకొని రావటం చూస్తే, అసంభవమైన ఆశ్చర్యం కాకపోదు. ఈసర్కసు ఫీటు(Circus_feat) చెయ్యటానికి కొందఱు ప్రత్యేక వ్యక్తుల అవసరం పట్టేది. అందుచేతనే, 'కొందఱికి' వేదాధ్యయన-అధ్యాపనల్ని అప్పజెప్పి, తక్కినవాళ్లకు దీంతో మీకు పనిలేదని చెప్పింది. మఱి, అందరూ అందల మెక్కితే మోసే దెవరంట? మనదేశంలో వైదీకనియోగిభేదాలు ఇట్లా వచ్చినవే; వైదికు లది పైపని, నియోగులు మంత్రిత్వము మొదలైనవి చేసేవాళ్లు. అదీకాకుండా, ఒకమంత్రాన్ని అర్థంచేసుకోవాలంటే శిక్షా, ఛందో, వ్యాకరణ, జ్యోతిష, కల్ప, నిరుక్తాల అవగాహన లేకపోతే వీలుపడదు. ఉచ్చారణలో తొట్రుపడితే మొదటికే మోసం వస్తుం దని భయం. ఒకాయన ఇంద్రసంహారార్థం ఒక కృత్యను సృష్టిద్దాము అనుకొన్నాడు. 'ఇంద్రశత్రు' అనేపదాన్ని దోషంగా ఉచ్చరించటంవల్ల, ఆకృత్య అతన్నే హతమార్చింది. 24

ఇంత హంగామా, కంగారూ లేకుండా సారాన్ని తెలియపర్చటండుకే మేడ్ ఈజీ (Made_Easy) లైన గీతాది స్మృతులు తయారయ్యాయి. వేదముయొక్క సారమైన ప్రణవముయొక్క ఉపదేశముకూడా వీట్లో ఉంది. కొన్ని వేదమంత్రాలుగూడా యథాతథం ఉన్నాయి. వేదముయొక్క చరమోద్దేశమైన బ్రహ్మజ్ఞానంలోకూడా వీళ్లకు పాలుంది. 'జ్ఞాననిష్ఠైకాంతికఫలత్వాత్' అని ఒప్పుకొంటున్నాడు ఆచార్య శంకరులు. 25 మామూలుగా చదవటానికి

24. తై. ఉ. శిక్షావల్లి. శం. భా.

25. వే. సూ. ౧-౩-౩౮. శం. భా.

కూడా స్మృతికారులు అడ్డం పెట్టటంలేదు; ఇప్పుడు అచ్చుపుస్తకాలుకూడా అరటిపండు ఒలిచి చేతులో పెట్టినట్టు దొరకనే దొరుకుతున్నాయి. ఇక నిషేధం ఎక్కడ?—ఖాళీ ఉచ్చారణను గురించే, 'ఉచ్చరింప కూడదు, వినకూడదు' అని పైనచెప్పిన తికమకలు ఉండటంవల్ల. ఉపనయన పూర్వకంగా గురువుదగ్గర చదవాలి అని నియమం. ఉచ్చారణ పూర్వకంగా చదివినా అర్థమవుతుంది, ఊరికే చదివినా అర్థమవు తుంది. పోతే, విధిపూర్వకంగా చదవటంవల్ల వచ్చే పుణ్యంమటుకు రాదు,అంతే. ఇదెంతలోటు? ఈఉచ్చా రణే ఇన్నివేల ఏళ్లు వేదాన్ని లుప్తంకాకుండా నిలి పింది. అదీకాకుండా, 'ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వంపూర్వం వర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ' అని Grade-Promotion చెప్పేఉన్నాడు, ఆపస్తంబుడు. మహాభారతంలో ఈ వర్ణవ్యత్యయానికి కావలసినన్ని ఉదాహరణలు. తాంత్రికసన్యాసానికి శూద్రులుకూడా అర్హులు.

పై విషయాల్ని పరిశీలిస్తే, మనపటివాళ్లకు అర్థ శాస్త్రం, సాంఘికశాస్త్రం, మానసిక తత్వశాస్త్రం, సామ్యవాదం చెబుతున్న సూత్రాలు తెలిసే ఉన్నాయి అని అనిపిస్తుంది; మరిమనకు వాళ్లని తేజోవంతులుగ చేసిన సత్య, అహింసా, బ్రహ్మచర్యాలు లేవు. ఈ పునాదిమీద, పైసూత్రాల్ని అవలంబించి, పాశ్చాత్య విజ్ఞాన సాహాయ్యంతో నూతనసమాజాన్ని నిర్మించవలసి ఉంటుంది.

> సమానా వ ఆకృతి స్సమానా హృదయానివః,
> సమానమస్తు వో మనో యథా వ స్సుసహాసతి

---

# సంధ్య

శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తి

బ్రాహ్మీముహూర్తమందు నాపగను జేరి
కాలకృత్యము లన్నియు గడపి, సంధ్య
నర్ఘ్య మిచ్చెడువేళ మార్తాండకిరణ
రక్తకాంతులు పుడిసిట ప్రతిఫలింప
బ్రహ్మతేజస్సు మొగముపై బలిసిపోయె.

దివ్యతేజస్వి కాంతిమద్దేహరుచుల
పుణ్యకాలీన మైన తపోవనాన
ప్రజ్వలితహోమధూమక్రమంపుఁజాయ
తివుటమై కప్పె సౌవర్ణదీధితివలె.

గుబురుగా గ్రమ్మి సీట లేగొమ్మ వ్రాల
శ్యామకోమల మైన రసాలసాల
పర్ణపర్ణాంతరంబుల ప్రాకి వచ్చు
బాలభాస్కరు కిరణాలు పచ్చనగుచు
సీట వ్రాలిన ముగ్గులు సీరు గొనరు
పాచి పట్టె నటంచు విభ్రాంతిఁ జెందె.

---

# హిందూమత విస్తృతి: తదావశ్యకత

శ్రీ సి. వి. దీక్షితులు

ఈ నాడు ప్రపంచమున వ్యాప్తిగల ఏమతముతోనైనను హిందూ మతమును పోల్చి చూచినట్లయిన విస్పష్టమగు భేద మొక్కటి కన్పట్టక మానదు. క్రైస్తవులును, మహమ్మదీయులును అన్యమతస్థులు నూతన ముగ తమ మతమును స్వీకరించుట కంగీక రించి తద్విధముగా తమ మతమును విస్త రింప జేయుచుండ ఒక్క హిందువులు మా త్రము క్రొత్తవారిని తమలో జేర్చుకొను టకు విముఖులై యున్నారు; జన్మచేత తప్ప సంస్కారముచే నెవ్వడును హిందువు కాజాల డని మనలో చాలమంది నమ్ము చున్నారు. అందువలన అన్య మతస్థులకు హిందూమతమున ప్రవేశించుట క వ కాశ ములు తక్కువగుటయే గాక, ఇదివరలో హిందూమతమును వీడి, అన్యమతములందు జేరినవారు తిరిగీ హిందూమతమున ప్రవే శించుటకు కూడ ఆటంకములు లేకపోలేదు. హిందూమతము బహు సనాతనమైన దగు టచే ఇతర మతస్థులను ప్రత్యక్షముగా నిందు చేర్చుకొను టెప్పుడు మానివేసిరో చెప్ప టకు వీలుగాదు; కాని పూర్వ మొకప్పుడు హిందువులు కూడ ఇతరులను తమలో జేర్చుకొనుచుండెడివా రనిమాత్ర మొప్పు కొనక తప్పదు. ఏమన ఒకప్పుడు భారత వర్ష మంతటను వ్యాప్తిగాంచి, బయటనుండి చైనా జపానులవరకును ఎగబ్రాకిన బౌద్ధ మతము[1] తరువాత క్రమముగా క్షీణించి, నామమాత్రావశిష్టమై తిరిగీ హిందూ మతమునకు తావొసంగుటయే ఇందులకు తార్కాణము. కాని ఇట్టి ప్రత్యక్షాభివృద్ధి నిలిచిపోయి ఎంతోకాల మయినది; స్వమత ప్రాబల్యము హెచ్చినపిదప మనవారు ఏదో ఒకప్పుడు తాము హిందువులై యుండుటొక గొప్ప గౌరవమనియు, ఆ గౌరవమున కితరు ల నర్హు లనియును దలంచి, ఇతరులను తమలో జేర్చుకొనుట మానివేసి యుండవచ్చును. మహమ్మదీయులును, క్రైస్తవులును మన దేశమున ప్రవేశించి, త మ మతములను విస్తరింపజేయుటకు పూర్వము ఈ నిషేధము వలన నష్ట ముండెడిది కాదు గాని ఈ మత ములరాక కనంతరముమాత్రము హిందూ మతము క్రమముగా క్షీణించుచున్న దని యొప్పుకొనకతప్పదు. క్రొత్తవా రిందు చేరక పోవుటచేతను, ఉన్నవారిలో కొందరు మతాంతరు లగుచుండుటచేతను హిందువుల సంఖ్య క్రమముగా తగ్గుటయు, వా రి ప్రాబల్యమునకు హాని కలుగుటయు తటస్థిం చుచున్నది.

---

1. న్యాయస్థానములకు సంబంధించినంతవరకు మన దేశమందలి బౌద్ధు లిప్పుడు హిందువులుగనే పరిగణింప బడుచున్నారు.

మన దేశమునందలి హిందువుల సంఖ్య ఈ రీతిని క్రమశః క్షీణించుచుండుట హైందవాధిక్యము గల దక్షిణ హిందూస్థానమునందున్న మన కంత ప్రాముఖ్యమగు విషయముగా కన్పట్టక పోవచ్చును గాని, హిందువులకును, మహమ్మదీయులకును కొంతవరకు సమాన ప్రాబల్యము గల ఉత్తర హిందూస్థానమునం దీ యంశము ఆలోచనాపరులందరి దృష్టియు నాకర్షించుచున్నది. ఈ కారణముచేత నే యచట ఆర్యసమాజము శుద్ధి మొదలగు ఉద్యమములు బయలుదేరి మతాంతరులకు తిరిగీ హిందూమతప్రవేశ మొసగుటకు యత్నించుట తటస్థించుచున్నది. ఇట్టి ప్రయత్నము లెంతవర కవసరమో గుర్తించుటకుగాను మన దేశమున హిందువులసంఖ్య ఏ తీరున తగ్గుచున్నదో పరీక్షించ వలసియున్నది.

ఈ విషయమున గత ఏబది యరువది సంవత్సరములనుండి మాత్రమే మనకు సరియగు ఆధారము లున్నవి; అతఃపూర్వపు పరిస్థితులను గూర్చి ఇది యిత్థమని ఏమియును చెప్ప వలనుగాదు. ౧౮౮౧-వ సంవత్సరము మొదలు ౧౯౩౧-వ సంవత్సరము వరకును ప్రతి పదిసంవత్సరముల కొకసారి సేకరించబడు జనాభా లెక్కలలో మతము ననుసరించిన విభజనయు వివరములును గలవు. వీనిని బట్టి హిందువుల సంఖ్య ఏరీతిని తగ్గుచున్నదియు, ఇతర మతస్థులసంఖ్య ఎట్లు హెచ్చుచున్నదియు విశదము కాగలదు. ఈ ౧-వ పట్టికలో ఆయా సంవత్సరపు జనాభా లెక్కలలో ముఖ్యమగు మతములవారు హిందూదేశము మొత్తముమీద నూటి కెంద రుండిరో ఈయబడినది.[2]

౧-వ పట్టిక.

హిందూదేశము

(బ్రిటిషు ఇండియా సంస్థానములుచేర్చి)

| జనాభా సంవత్సరము | నూరింట సంఖ్య | | | |
|---|---|---|---|---|
| | హిందువులు | మహమ్మదీయులు | క్రైస్తవులు | శిక్కులు[3] |
| ౧౮౮౧ | ౭౪.౩ | ౧౯.౭ | .౭ | .౭ |
| ౧౮౯౧ | ౭౨.౩ | ౨౦.౦ | .౮ | .౭ |
| ౧౯౦౧ | ౭౦.౩ | ౨౧.౨ | ౧.౦ | .౮ |
| ౧౯౧౧ | ౬౯.౩ | ౨౧.౩ | ౧.౨ | ౧.౦ |
| ౧౯౨౧ | ౬౮.౪ | ౨౧.౭ | ౧.౫ | ౧.౦ |
| ౧౯౩౧ | ౬౮.౨ | ౨౨.౨ | ౧.౮ | ౧.౨ |
| హెచ్చుదల + తగ్గుదల — | —౬.౧ | +౨.౫ | +౧.౧ | +.౫ |

దీనినిబట్టి ఒకవంక హిందువుల సంఖ్య క్రమముగా తగ్గుచుండుటయు, ఇంకొకవంక మహమ్మదీయులును, క్రైస్తవులును ప్రబలురగుచుండుటయు తెలియగలదు. గత అరువది సంవత్సరములలోను హిందువుల సంఖ్య వేయింట ౬౧ తగ్గినది. కాని అదేకాలమున మహమ్మదీయులు వేయింట ౨౫ గురును, క్రైస్తవులు వేయింట ౧౧ గురును, ఎక్కువైరి. ఈమార్పునకు ముఖ్య కారణము హిందువులలో కొందరు పరమతముల నవలంబించుటయే యని యొప్పుకొనక తప్పదు. అస్పృశ్యులనియు, అంత్యకులజులనియు

2. ఈ వ్యాసమునం దీయబడిన యంకెలన్నియు ఇండియాప్రభుత్వపు జనాభాలెక్కలనుండి తీసుకొనబడినవి.

3. న్యాయస్థానములకు సంబంధించి నంతవరకు శిక్కులను హిందువులుగానే లెక్కింపబడుచున్నారు.

మనచే ప్రత్యేకింపబడి, కడు నిడుమలకు లోనగుచున్నవా రందరును మహమ్మదీయులచేతను, క్రైస్తవులచేతను ఆదరింపబడి, వా రనాదిగ అవలంబించియుండిన మతమందు గాంచని గౌరవమును, మానవ సామాన్యమగు హక్కులను హిందూమతమును విడనాడిన వెంటనే పడయగలుగుచున్నారు. కాని ఇందువలన హిందూమతము నకుమాత్రము తాత్కాలికముగా కన్పట్టకపోయినను శాశ్వతమగు నష్టము కలుగుచున్నది.

౨-వ పట్టిక.

| జనాభా సంవత్సరము | నూరింట సంఖ్య | | | |
|---|---|---|---|---|
| | హిందువులు | మహమ్మదీయులు | క్రైస్తవులు | శిఖ్ఖులు |
| మ. రాష్ట్రము | | | | |
| ౧౮౮౧ | ౯౧.౦ | ౬.౨ | ౨.౩ | |
| ౧౮౯౧ | ౯౦.౦ | ౬.౩ | ౨.౪ | |
| ౧౯౦౧ | ౮౯.౧ | ౬.౪ | ౨.౭ | |
| ౧౯౧౧ | ౮౮.౯ | ౬.౬ | ౨.౮ | |
| ౧౯౨౧ | ౮౮.౬ | ౬.౭ | ౩.౨ | |
| ౧౯౩౧ | ౮౮.౩ | ౭.౧ | ౩.౮ | |
| హెచ్చుదల + తగ్గుదల — | —౨.౭ | +.౯ | +౧.౫ | |
| ప. స. రాష్ట్రము | | | | |
| ౧౮౮౧ | ౭.౧ | ౯౨.౧ | .౩ | .౫ |
| ౧౮౯౧ | ౬.౪ | ౯౨.౩ | .౩ | ౧.౦ |
| ౧౯౦౧ | ౬.౩ | ౯౨.౨ | .౩ | ౧.౩ |
| ౧౯౧౧ | ౫.౫ | ౯౨.౯ | .౩ | ౧.౪ |
| ౧౯౨౧ | ౬.౬ | ౯౧.౬ | .౫ | ౧.౩ |
| ౧౯౩౧ | ౫.౯ | ౯౧.౮ | .౫ | ౧.౮ |
| హెచ్చుదల + తగ్గుదల — | —౧.౨ | —.౩ | +.౨ | +౧.౩ |

హిందువుల సంఖ్య ఈరీతిని క్షీణించుట మన దేశమందలి ప్రతిరాష్ట్రమునందును జరుగుచున్నది. హిందువులు అధిక సంఖ్యాకులుగా నున్న మదరాసురాష్ట్రమునందును, అల్పసంఖ్యాకులుగానున్న పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రమునందును కూడ ఈమార్పు కానవచ్చుచున్నది. గత అరువది సంవత్సరములలో ఈ రెండు రాష్ట్రములయందును ఆయా మతస్థులవృద్ధి క్షయము లెట్లున్నవో ఈ ౨-వ పట్టికలో పొందుపరచబడినది.

మదరాసునందు హిందువుల సంఖ్య వేయింట ౨౭ వరకును తగ్గినది. కాని ఈ తగ్గుదలలో సగమునకు పైగా క్రైస్తవమతమున కుపకరించినది. మహమ్మదీయుల యభివృద్ధి వేయింట ౯ మాత్రమే చూపట్టుచున్నది. ఇక పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రమునందన్ననో హిందువుల సంఖ్య వేయింట ౭౧ నుండి ౫౯ వరకును పడిపోయినది. కాని ఇందు విశేష మేమన, అదే కాలమున మహమ్మదీయుల సంఖ్య కూడ తగ్గుటయు, శిఖ్ఖులయొక్కయు, క్రైస్తవుల యొక్కయు సంఖ్య హెచ్చుటయు సంభవించినది. శిఖ్ఖులను హిందువులనుండి ప్రత్యేకించవలసిన యవసర మంతగా లేకపోవుటచే నొక విధముగా ఎంచి చూచినట్లయిన అచ్చటనున్న హిందువులు మిక్కిలి అల్ప సంఖ్యాకులే యైనను స్వమతాభిమానమును నిలుపుకొనుచున్నా రనియు, తమకున్న స్థానమును కోల్పోవుట లేదనియు చెప్పవలసి యున్నది. కాని ఈ రెండు రాష్ట్రములలోను కూడ క్రైస్తవమతము చరచర వృద్ధి గాంచుచున్నది. ౧౯౧౧ మొదలు ౧౯౩౧ వరకును అనగా ఇరువది సంవత్సరములలో క్రైస్త

వుల సంఖ్య నూటికి ౩౬ పాళ్లు మదరాసులోను, ౬౭ పాళ్లు సరిహద్దు రాష్ట్రములోను పెరిగినది.

ఈ సందర్భమున ప్రస్తుతము హిందూ మహమ్మదీయసమస్య తీవ్రముగా నున్న పంజాబు, బెంగాలు రాష్ట్రములలో పరిస్థితులను గూడ మన మరసి చూడవచ్చును. అందువలన హిందువుల సంఖ్య క్షీణించుచుండుటవలన అచ్చటిపరిస్థితు లెట్లు తారుమా రగుచున్నవో తెలియగలదు. ఈ ౩-వ పట్టికలో మొదట పంజాబునకును, తరువాత బెంగాలునకును సంబంధించిన వివరము లీయబడినవి.

౩-వ పట్టిక.

| జనాభా సంవత్సరము | నూరింట సంఖ్య హిందువులు | మహమ్మదీయులు | క్రైస్తవులు | శిక్కులు |
|---|---|---|---|---|
| పంజాబు * | | | | |
| ౧౮౮౧ | ౪౧.౩ | ౫౧.౭ | .౨ | ౬.౬ |
| ౧౮౯౧ | ౪౦.౮ | ౫౧.౪ | .౩ | ౭.౩ |
| ౧౯౦౧ | ౩౮.౭ | ౫౩.౩ | .౩ | ౭.౪ |
| ౧౯౧౧ | ౩౨.౯ | ౫౪.౯ | ౧.౦ | ౧౦.౫ |
| ౧౯౨౧ | ౩౦.౮ | ౫౫.౩ | ౧.౬ | ౧౧.౧ |
| ౧౯౩౧ | ౨౬.౮ | ౫౬.౬ | ౧.౮ | ౧౩.౦ |
| హెచ్చుదల + తగ్గుదల — | —౧౪.౫ | +౪.౯ | +౧.౬ | +౬.౪ |
| బెంగాలు | | | | |
| ౧౮౮౧ | ౪౮.౬ | ౫౦.౧ | .౨ | |
| ౧౮౯౧ | ౪౭.౩ | ౫౧.౧ | .౨ | |
| ౧౯౦౧ | ౪౬.౬ | ౫౧.౬ | .౩ | |
| ౧౯౧౧ | ౪౪.౮ | ౫౨.౭ | .౩ | |
| ౧౯౨౧ | ౪౩.౩ | ౫౪.౦ | .౩ | |
| ౧౯౩౧ | ౪౩.౦ | ౫౪.౯ | .౪ | |
| హెచ్చుదల + తగ్గుదల — | —౫.౬ | +౪.౮ | +.౨ | |

హిందువుల సంఖ్య తగ్గుటవలన వారి ప్రాముఖ్యమెట్లు క్షీణించుచున్నదియు పైసంఖ్యలు తెలుపగలవు. ౧౮౮౧-వ సంవత్సరమున పంజాబులో నూరింట ౪౧ హిందువులును, ౭ శిక్కులును ఉండిరి. కాని ౧౯౩౧-వ సంవత్సరమున హిందువుల సంఖ్య ౨౭ మాత్రమే; శిక్కులసంఖ్య ౧౩ వరకు పెరిగినను, మొత్తము హిందువులు శిక్కులును కలసి నూరింట ౪౦ మంది మాత్రమే యుండిరి. ౧౮౮౧-వ సంవత్సరమునం దన్ననో శిక్కులును హిందువులును చేరి నూటికి ౪౮ మంది యుండెడివారు. అనగా మహమ్మదీయులతో కొంచె మించుమించు సమానప్రాముఖ్యము గలిగియుండెడివా రన్నమాట. ౧౮౮౧-వ సంవత్సరమున నూటికి ౫౨ నుండి ౧౯౩౧-వ సంవత్సరమునకు నూటికి ౫౭ వరకును మహమ్మదీయుల సంఖ్య పెరిగినది; మహమ్మదీయులు నిస్సంశయముగా నధికసంఖ్యాకులైనారు. బెంగాలులో పరిస్థితులు కూడ ఈతీరుననే మారినవి. ౧౮౮౧-వ సంవత్సరమున నూరింట హిందువులు ౪౯, మహమ్మదీయులు ౫౧; ౧౯౩౧-వ సంవత్సరమునం దన్ననో హిందువులు ౪౩, మహమ్మదీయులు ౫౫, ఈ సంఖ్యల ప్రాముఖ్యమును గూర్చి వేరుగా చెప్పనవసరము లేదు; అది సువిదితము.

మిగిలిన రాష్ట్రములలో ౧౮౮౧ మొదలు ౧౯౩౧-వ సంవత్సరములోగా

* ౧౯౨౧-వ సంవత్సరమునకు పూర్వము ఢిల్లీ కూడ ఇందు చేరియున్నది.

కలిగిన మార్పులు క్లుప్తముగా నీ ౮-వ పటికలో నీయబడినవి.

౮-వ పట్టిక.

| రాష్ట్రము | ౧౮౮౧ నుండి ౧౯౩౧ వరకు హెచ్చుదల +, తగ్గుదల — (నూరింట) | | |
|---|---|---|---|
| | హిందువులు | మహమ్మదీయులు | క్రైస్తవులు |
| బీహారు, ఒరిస్సా ... | —౨.౦ | + .౮ | +.౬౩ |
| బొంబాయి ... | +౧.౩ | +౨.౦ | +.౭౨ |
| మధ్య పరగణాలు బీరారు ... | +౩.౩ | + .౫ | +.౨౨ |
| సంయుక్తరాష్ట్రములు (యు.పి.) | —౧.౯ | +౧.౮ | +.౩౧ |
| అస్సాము ... | —౫.౫ | +౫.౦ | +౨.౨ |

కాబట్టి ఒక్క బొంబాయిలోను, మధ్య రాష్ట్రములలోను ఏదో కొంచెము తప్ప మిగిలిన ప్రతిరాష్ట్రమునందును హిందువుల సంఖ్య క్షీణించుచున్నది. మహమ్మదీయులయు, క్రైస్తవులయు సంఖ్య మొత్తముమీద ప్రతిరాష్ట్రమునను హెచ్చుచున్నది. ఇట్టి మార్పునకు కారణము మహమ్మదీలును, క్రైస్తవులును హిందువులకంటె ఎక్కువ సంతానవంతులని కొంద రనవచ్చును. అట్టి యూహలో చింతాకంత సత్యముండిన నుండవచ్చును గాని, హిందువుల సంఖ్య తగ్గుటకు ముఖ్యమైన కారణమువారిలో అంత్యవర్ణములవారు స్వమతమును వీడి మహమ్మదీయ మతమునగాని క్రైస్తవమతమున గాని చేరుటయే యని చెప్పకతప్పదు.

ఈ తీరున హిందూమతము క్రమముగా క్షీణించుటయు, హిందువుల ప్రాబల్యము తగ్గిపోవుటయు మన కళ్ల యెదుటనే జరుగుచున్నది; అయినను ఈ సంగతిని గుర్తించి, యందలి సాధక బాధకములను గూర్చి యాలోచించువారు తక్కువగా నున్నారు. జనసామాన్యమున కీ విషయమున ప్రసక్తియే లేదు. విద్యావంతులలో కొందరి కీసంగతి తెలిసినను వారికి ఉదాసీనభావము మెండు. ఇదిగాక మన దేశమునం దిప్పటికిని హిందూమతమే ప్రధాన మగుటచేతను, దానికి బహుళవ్యాప్తి గలిగి, దేశము మొత్తముమీద హిందువుల సంఖ్యయే యెక్కు వగుటచేతను, లోతు తరచి చూచి నఁ గాని తెలియని మార్పు నరయజాలరు... 

హిందూమతస్థుల సంఖ్య క్షీణించిన కొలదిని, హిందువులు సాంఘికముగను, నైతికముగను కూడ తమబలమును గోల్పోవుదురు; అనాదిగ వచ్చుచున్నవారి వ్యక్తిత్వమునకు భంగము రాగలదు. రాజకీయముగ ఈ మతవ్యత్యాసము లెట్లు హిందువులకు కొన్ని తావులయందు కష్టదాయకములగుచున్నవో మనము చూచుచునే యున్నాము. క్రమశః దేశమం దంతటను ఇప్పటి తీరుననే ఆయేటి కాయేడు హిందువుల సంఖ్య తగ్గిపోయినట్లయిన అనతికాలములో హిందువులు లాఘవమునకు పాల్పడక తప్పదు. హిందువులు మతాంతరు లగుటచే హిందూసంఘము రెండు విధములుగ

దెబ్బతినుచున్నది; స్వప్రాబల్య మొకవంక క్షీణించుటయు, అన్యమత ప్రాబల్య మింకొక వంక హెచ్చుటయును జరుగుచున్నది.

హిందూసంఘము యొక్క ఈ పతన మును నిలుపవలయు ననినచో చేయవలసిన పనులు రెం డున్నవి. అందు మొదటిది హిందువులలో కొందరు మతాంతరులగుటకు గల కారణములను పరిశీలించి సాధ్యమగు నంతవరకు వానిని నిర్మూలించుట; రెండవది ఇతఃపూర్వము హిందూమతమునుండి విడి వడిపోయినవారిని తిరిగీ వారు వలయు నన్నచో మన మతమందు చేర్చుకొనుట కవకాశ మిచ్చుట. సరియగు పద్ధతులపై నీ కార్యములు నడుపబడినచో త్వరలోనే హిందూమతము క్షీణించుట తగ్గగలదని చెప్పవచ్చును. ఏనాడు హిందూ మతస్థులు తమమతమును వీడి అన్యమతములయందు జేరుట మానివేయుదురో ఆనాడే హిందూ మతము మరల ఉచ్చస్థితికి రాగలదు.

హిందువుల సంఖ్య క్రమముగా తగ్గ టకు గల కారణములలో మొదటిది "అస్పృ శ్యత." తమతోడివారిని కొందర నస్పృశ్యు లని వేరుపరచి, వారిని న్యూనముగ జూచుట హిందూసంఘమునం దొక గొప్ప దోషము. కులభేదములును, స్పృశ్యతాస్పృశ్యతలును లేని ఇతరమతములు వీరి నాకర్షించుటలో చోద్య మేమియును లేదు. ఈ అస్పృశ్యత పూర్ణముగ నివారింపబడినచో ఇప్పు డతి సులభముగ క్రైస్తవమతమును, మహమ్మ దీయమతమును స్వీకరించుచున్న నిమ్నవర్ణ ములవా రందరును హిందూమతమునందే నిలిచిపోవుదురని నిశ్చయముగా చెప్పవచ్చును. హిందూమతమునందు వారు పడయుజాల నిదియు, ఇతరమతములు వారి కిచ్చున దియు, సంఘమునందు సమానస్థానము. అనాదినుండియు వా రవలంబించుచున్న మత మునందే ఇతరవర్ణములతోపాటు సమాన మగు సాధారణ వ్యక్తిగౌరవమును వారు పొందగలిగినచో వారికి స్వమతమును వీడ వలసిన యవసరమే యుండదు.

కాని ఇప్పుడున్న, పరిస్థితులలో అస్పృ శ్యతను తొలంగించుట వలన మాత్రమే హిందూసంఘము పూర్ణమగునభివృద్ధి గాంచ జాలదు. గత ఏబది యరువది సంవత్సర ములనుండియు నెందరో హిందువులు స్వమత మును వీడి పరమతముల నాశ్రయించి యున్నారు. అస్పృశ్యతాదోషము నివారింప బడినచో మతాంతరు లైనవారిలో కొంద రైనను తిరిగీ తమ పూర్వపుమతమున ప్రవే శింప నిచ్ఛగించవచ్చును. అంతేకాక అన్య మతములవారుసహితము, హిందూమతము యొక్క విశాలతను గుర్తించి యందు ప్రవే శింప నిచ్ఛగించుచో మన సంఘము వారి కాటంకములను గలుగజేయక వారికి హిందూ మతధర్మముతో సమంజసమగు గౌరవమైన స్థానము నీయవలెను. హిందూ మతమునుండి యన్య మతమున ప్రవేశించిన పిదప తిరిగీ హిందూ మతమునకు రాదలచు వారికిని, అన్యమతమును త్యజించి హిందూమతమున ప్రవేశింపదలచువారికిని అంత విశేషభేద మేమియును లేదని తోచుచున్నది.

ఈవిషయమున మన హిందూ సంఘము మొదట కొంత విముఖత జూపవచ్చును. కొంతకాలమువరకును, సనాతనుల మను కొనువారు కొందరు, హిందూమతము జన్మతః ప్రాప్తించ వలసినదేగాని సంస్కా-

రమువలన లభించదను వాదనతో ఇతరులను హిందూమతమున జేర్చుకొనుటను ఎదు ర్కొనవచ్చును. ఇందులకై చేయబడు ప్రయత్నములు ప్రారంభమున కొంతవరకు 'ఏటి కెదురీత' యగు నని తోచుచున్నది. అయినను హిందూ సంఘము అభివృద్ధి గాంచవలె నన్నచో, పరమతస్థులను మన మతమున జేర్చుకొనుటకు మనము వెనుదీయ రాదు. ప్రత్యక్షముగ గాకపోయినను ఆచార వ్యవహారములందలి మార్పులచేత నైనను హిందువులు కానివారు క్రమముగా హిందూ సంఘమున కలసిపోవుట చారిత్రక దృష్టికి విశదమే. అంతేకాక ఉత్తర హిందూస్థానమున ఆర్యసమాజోద్యమమువలన మతాంతరులైన హిందువులు తిరిగీ హిందూసంఘమునందు చేర్చుకొనబడుటయు, అట్టివారిని సంఘము సాధారణమర్యాదలతో జూచుచుండుటయు నిప్పుడు జరుగుచున్నది.

న్యాయశాస్త్రరీత్యా యోజించినను హిందువులు కానివారు హిందూమతమును స్వీకరించుటకుగాని, మతాంతరు లైనవారు తిరిగీ హిందూసంఘమున సభ్యు లగుటకు గాని ప్రతిబంధకము లేవియును లేవు. కాబట్టి హిందూసంఘాభివృద్ధికి కావలసినది బాధ్య తను గుర్తెరిగిన ప్రయత్నముమాత్రమే.

ఇక ముందైనను హిందువులు నిద్రనుండి మేల్కొని తమ కర్తవ్యమును తెలుసు కొనవలెను; సంఘక్షయము నరికట్టి తమ సంఖ్య నభివృద్ధి పరచుకొనిననే తప్ప ఇప్పటి పరిస్థితులలో వారు తీరనినష్టమునకు పాల్పడ వచ్చును. హిందూ సంఘమునందలి ప్రతి వ్యక్తియు ఈవిషయమై బాగుగా నాలోచించి సరియగు నిర్ణయమునకు వచ్చుట అత్యావశ్య కము.

---

# ప్రబోధము

శ్రీ ఆలపాటి కామేశ్వరరాయ కవి

భృంగమ ! తమ్మితేనెకయి వేసట జెంది తపింతు రాత్రులన్
రంగదభంగసంగతి విలాసిత గాన సుధాస్రవంతికా
చంగవిలాసలాలిత ప్రశస్త కళాకలితంబ వయ్యు నీ
కుంగల విట్టి యాధులు నగుంగద యెట్టి వివేకశాలికిన్.

చక్కగ నీవు పాడుదువు సారస మేమి యెరుంగుఁ బాటలో
ముక్కలుముక్కలై యమృతముల్ దిగజారగ గానసంచయం
బూక్కట జేసిచేసియు సముత్సుకతన్ దరుగాడుచుందువో
యక్కట యిక్కటుల్ కలుగు నయ్యయొ ! రాతిరియుర్వి వియోగమున్.

# కంట్రాక్టరు వీరన్న

శ్రీ చిలుకూరి శేషగిరిరావు

ఆ జిల్లాలో కంట్రాక్టరు వీరన్నను ఎరగనివారు ఎవ్వరూ వుండరని చెప్పాలి. కూలినాలి చేసుకొని చాలీచాలని గంజినీళ్లు త్రాగి ప్రాణాలను నిలుపుకొంటూవుండే ఈ కష్టజీవులనోళ్లలో అతని నామమంత్రం నిత్యమూ జపింపబడుతూంటుంది. P.W.D. లోగాని, డిస్ట్రిక్టుబోర్డులోగాని మరి ఏయితరశాఖల్లోగాని ఏచిల్లరమరమత్తులు వచ్చినా, ముందు కంట్రాక్టరు వీరన్నను పిలవాల్సిందే! కారణం ఏమంటే అతనితో సమానంగా కంట్రాక్టు పాటపాడేవారుండరు. అదికాక ఇతనిపూర్వులు తరగని ఆస్తిని కష్టపడి నిల్వవుంచి పోవటంచేత, యితడు ఆ ధనప్రవాహాన్ని వినియోగించి, యీ చిల్లర దేవతల కందరికీ నిత్యనైవేద్యాలర్పించి గొప్ప పలుకుబడిని సంపాదించాడు. అందుచేత ఏ కంట్రాక్టు వచ్చినా మారుమాటలేకుండా వీరన్న చేతుల్లో పడేది. అలాంటప్పుడు నిత్యమూ తమకు గంజినీళ్లకు దారిచూపిస్తున్న యీ వీరన్న నామాన్ని వాళ్లు జపిస్తూంటా రనటంలో ఆశ్చర్య మేముంది?

అసలు వీరన్న పూర్వులది తూర్పుదేశం. అక్కడ వాళ్లకు కడుపుకు చాలినంతగంజి, వొళ్లు కప్పుకోనేందుకు చాలినబట్టా కరవవటంచేత, యీ తూర్పుగోదావరిజిల్లాకు చేరుకొని, మగవాళ్లు కూలిచేస్తూంటే, ఆడవాళ్లు సంపన్న బ్రాహ్మణగృహస్థులయింట్లో పాచిపనులుచేసి జీవిస్తుండేవాళ్లు. ఇలా వుండగా, రంగంలో కావలసినంతమంది కూలీలు లేరని అక్కడ పని విశేషంగా వుండి కూలి చాల హెచ్చుగా దొరుకుతుందని తెలియవచ్చింది. అప్పుడు ఈ వీరన్న పూర్వులు బుట్టా, తట్టా సర్దుకొని రంగం ప్రయాణం కట్టారు. నిజంగా రంగంలో కష్టపడినవానికి చేతినిండా డబ్బు దొరికేది. కడుపునిండా తిండీ, వొంటినిండా బట్టా కట్టగా వాళ్లు రూకలు మిగిలేట్టుగానే వుండేది. ధనార్జనయందు ఆశయున్నవాళ్ళు దానికోసం ఎన్నిపాట్లనో పడతారు. మన వీరన్న పూర్వులు వొళ్ళువంచిపనిచేస్తూ పొదుపుగా సంసారం చేసుకొంటూ వొకపదివేల కరకు రూపాయలను కంటజూచి స్వగ్రామాన్ని జేరుకున్నారు. ఆధనంతో వీరన్నతండ్రి భూమిపుట్రా కొని వ్యవసాయంచేస్తూ మంచి మోతుబరిరైతని పేరుపొందాడు.

వీరన్నకు సుమారు నలభై ఏళ్లుంటాయి. మనిషి మంచి జవాను. ఆరడుగుల పొడవుండి పొడవుకు తగ్గ దేహపుష్టిగలిగి చూచుటకు గంభీరంగా కనిపిస్తుంటాడు. పూర్వం, రాజులూ, వెలమదొరలూ మీసం మీద నిమ్మకాయలను నిలబెట్టేవారని చెబితే అసలు మీసంలేని జొద్దింకమీసాలకు అలవాటుపడ్డమనం వెటకారంగా నవ్వుతాం. కాని ఈవీరన్న మీసాలు చూశాక నిమ్మకాయలే కాదు నారింజకాయలు కూడా నిలబెట్టవచ్చని ఒప్పుకుంటాము. అతడు చిన్నతనంలో ఘట్టుఘోరం ఆనర్సుచదివినా యీ పెద్ద వుద్యోగస్థుల ప్రాపకం వచ్చాక నాలుగుబోస్లేరు యింగ్లీషుముక్కలు కూడా మధ్యమధ్య విసరటం నేర్చుకున్నాడు. ఆఫీసర్లతో మాట్లాడేటప్పుడు మామూలు వేషం దర్జాకు లోటని సిల్కుషర్ట్లూ, బూటూ హేటుకూడా వేయటానికి అలవాటుపడ్డాడు. ఈ కంట్రాక్టులలో నాలుగురాళ్లు మిగిలాక యింజనీర్లతో సమానగౌరవం సంపాయించాలని ఫోర్డుకారొకటి కొన్నాడు. మునుపు వీరన్న అని పిలుస్తుండేవా రంతా యిప్పు డతనిని వీరన్న దొరగా రని పిలుస్తుంటారు.

౨

అది ఏప్రెలునెలలోని కడపటిరోజులు. డిస్ట్రిక్టుబోర్డువారి రోడ్డును బాగుచేయిస్తున్నాడు కంట్రాక్టరు వీరన్న. ఆడవాళ్లూ, మగవాళ్లూ కలసి సుమారు వొందమంది పనిచేస్తున్నారు. కొందరు మగాళ్లు గునపాలతో రోడ్డునుత్రవ్వుతోంటే మరికొందరు

కంకరను జల్లివేస్తున్నారు. ఆడకూలీలలో కొందరు చెట్ల చాలీచాలని నీడలో కంకరను బ్రద్దలుకొడుతుంటే మరికొందరు డ్రమ్ములలోని నీటిని బిందెలతో నింపి రోడ్డును తడుపుతున్నారు. మరికొందరు ఆడవాళ్లూ, మగవాళ్లూ కలిసి పాటపాడుతూ రోలరును దొర్లిస్తున్నారు. సూర్యుడు నడినెత్తిమీద కాస్తూ తీవ్రంగా ప్రకాశిస్తున్నాడు. పాపం! ఆకూలీలు, క్రిందకాళ్లూ, పైన మాడూ మాడుతూ చెమటలుకారుస్తున్నా, చెట్టుక్రింద నీడలో కూర్చుండి చుట్టకాలుస్తూ అకారణంగా బండబూతులు తిడుతూ మధ్యమధ్య చేతి దూలచే చింతబరికెతో అమాయకుల వీపులమీద బాదుతుండే మేస్త్రీని చూచి గడగడలాడుతూ చురుగ్గా పనిచేస్తున్నారు. చెట్లకొమ్మలకు కట్టియున్న తొట్టెలలోని బిడ్డలు పాలకోసం 'క్యారు, క్యారు' మని ఏడుస్తున్నా! పాపం! ఆతల్లులు ప్రత్యక్షయముడైన మేస్త్రీని చూచి మనస్సు పిల్లలమీదకు లాక్కొపోతూండగా తప్పనిసరిగా పనిచేస్తున్నారు.

సాయంత్రం అయిదుగంట లవుతుంది. అప్పుడే సూర్యుడు కొంచెం శాంతపడి అలసట తీర్చుకోటానికి యింటికి పోతున్నాడు. ఫర్లాంగుదూరంలోంచి వీరన్న కారు హారను చప్పుడు 'బొం, బొం' మని వినిపించింది. అంతవరకూ పొగచుట్టను కాలుస్తూ, ఓకూలీదాన్ని బూతులుతిడుతూన్న మేస్త్రీ, హారన్ చప్పుడు వినంగానే కంగారుపడుతూ నోటిలోనిచుట్టను పారేసి ఒకసారి తలపాగా, కోటూ సర్దుకొని కూలీలందరకూ చురుగ్గా పనిచేయాలని వార్నింగ్ యిచ్చిచేతులు కట్టుకొని కంట్రాక్టరు రాకకోసం ఎదురుచూస్తూ నిలుచున్నాడు.

కంట్రాక్టరువీరన్న కారు దిగి స్పెన్సరుసిగరును కాలుస్తూ చేతిలోని **Hand stick** ను వూపుకొంటూ వచ్చాడు. మేస్త్రీ, అతివినయంతో నమస్కరించి ఆరోజు జరిగిన పనినంతా చూపిస్తున్నాడు. ముందు గునపాలతో రోడ్డును త్రవ్వుతోన్న కూలీలదగ్గరకు వచ్చారు. కంట్రాక్టరువీరన్నను చూడంగానే కూలీలలో భయమూ, చురుకూ పుట్టింది. గునపాలను ఎత్తి 'ధక్, ధక్' మని రోడ్డును త్రవ్వుతున్నారు. ఆరోజుకి వారు త్రవ్విన ప్రదేశం చూపించివాడు, పని చాలా చురుగ్గా జరిగిం దని మనవిచేసుకున్నాడు మేస్త్రీ. వీరన్న మందహాసం చేస్తూ మరి నాలుగడుగులు ముందుకేశాడు. ఆడాళ్లూ, మగాళ్లూ కలసి కంకరను గంపలతో ఎత్తి రోడ్డుమీద పోస్తున్నారు. వీరన్న, పనంతా చురుగ్గా జరగటం చూచి మేస్త్రీని మెచ్చుకుంటూ కొంచెం ముందుకు నడిచాడు. అక్కడ మరునాటికి నీళ్లు నిలవయుంచటానికై పెద్దపెద్దడ్రమ్ములు పాతిక వున్నాయి. ఆప్రదేశానికి రెండుఫర్లాంగుల దూరములోనున్న చెరువునుంచి ఆడవాళ్లు బిందెలతో నీళ్లు తెచ్చి ఆడ్రమ్ములలో పోస్తున్నారు. వీరన్న సిగరుపొగను రింగురింగులుగా వొదుల్తూ దూరంనుంచి నీళ్లబిందెలను తెస్తూన్న కూలివాళ్లకేసి తదేకదృష్టితో చూస్తున్నాడు.

ఆ ఆడకూలీలు దూరంనుంచే వీరన్నను చూచి భయంతో చురుగ్గా నడుస్తూ వొచ్చి నీళ్లను డ్రమ్ములలో దిమ్మరించి ఏమాత్రం ఆలస్యం చేయకుండా వెళ్లిపోతున్నారు. మనవీరన్న దృష్టి అందులోని ఒకమంచి పడుచుదనంలోయున్న యువతిపై సోకింది. ఆయువతికి సుమారు యిరవై ఏళ్లుంటాయి. చంద్రబింబంలా గుండ్రమైన మొహం. అటు తెలుపూ యిటుపసుపూ కాకుండా దోరజామిపండులా నుంటుంది శరీరపుఛాయ. అంతలావూ, మరీసన్నమూ కాకుండా వయస్సుకు తగ్గ కండపుష్టిగలదేహం. అప్పుడే ఆమెలోని యౌవనపుష్పం పరిపూర్ణంగా వికసించుతూండటంచేత శరీరమంతా పరిపూర్ణయౌవనపుశోభచే మిలమిలలాడుతోంది. కొద్దికొద్దిగా నొక్కులుదీరిన తలకట్టుకు తైలసంస్కారము లేకపోవుటచే ముంగురులు చెదరి ముఖంమీద చిరుగాలికి చిందులు త్రొక్కుతున్నాయి. అన్నిటికన్నా ఆమె నెత్తిమీద బిందె పెట్టుకొని మందగమనంతో వయ్యారాన్ని వొలికిస్తూ నడచి వొస్తూంటే వీరన్న యీ దివ్యమంగళవిగ్రహాన్ని చూచి మోహపరవశుడైపోయాడు. సిగరెట్టు... మీసాన్ని వడివేస్తూ తదేకదృష్టితో ఆమెకేసి చూస్తున్నాడు. ఆ యువతి నీళ్లను డ్రమ్ములో వొంపేసి వీరన్నకేసి చూసింది. అలా చూడటంలో ఆమె కొంచెం భయంతో కంపించిపోయింది. ఇంద్రనీలమణుల కాంతులను మించు ఆనేత్రద్వయంలోంచి భీతిని, జాలిని వెలి

క్రక్కు చూపును చూచినంతనే వీరన్న హృదయం జలదరించిపోయింది. ఆమె తక్కినవారితో కలసి నీరు తేవటానికి వెళ్లిపోయింది.

వీరన్న దేహంలోని ప్రతి అణువూ, ఆమెలోని దివ్యామృతాన్ని గ్రోలాలని విజృంభించి అతడిని తల క్రిందులు చేస్తున్నది. అతడు తనకారులో కూర్చుండి తన వెంటవచ్చి చేతులు కట్టుకొని నిలుచున్న మేస్త్రీని చూచి "ఏమోయి! యిందాక నీళ్లు తెస్తున్న ఆ అందమైన పిల్లను గురించి ఏమైనా చెప్పగలవా?" అని అడిగాడు. అప్పుడే ఆపిల్లమీద వీనికన్ను పడిందని పసికట్టాడు మేస్త్రీ. అతడు చేతులు నలుపుకొంటూ "చిత్తం అది వెలమలపిల్లండి. ఇక్కడకు మైలుదూరంలోనే వుంది దానియిల్లు. అదీ దాని మొగుడూ యిద్దరూ మనదగ్గరే పనిచేస్తున్నారు. చాలా అందమైంది. ఒళ్లొంచి కూలికితగ్గ కష్టంచేస్తుం"దన్నాడు. వీరన్న ఆనందంతో పరవశు డైపోయాడు. మెల్లగా మేస్త్రీ చెవులో ఏదో వూది కారు ఎదర నిలుచుండి ఏదో రిపేరు చేస్తున్నట్టు నటిస్తున్నాడు.

మేస్త్రీ కూలీలదగ్గరకు వచ్చాడు. మామూలుగా ఆడవాళ్లు నీళ్లుమోస్తున్నారు. మేస్త్రీ ఆ ఎర్రటి యువతిని పిలిచి "లక్ష్మీ! దొరగారి కారులో నీళ్లయిపోయాయట. ఒక బిందెడునీళ్లు పట్టుకెళ్లి పోసిరా" యని హుకుం యిచ్చాడు. లక్ష్మి నీళ్లు పట్టుకొని బయల్దేరింది. రోడ్డు మరామత్తులో వుండటంచేత రెండువందల గజాలదూరంలో వీరన్న కారు ఆగింది. నిజానికి కారులో నీటిఅవసరం లేకపోయినా ఆమెతో మాట్లాడాలనే వుద్దేశ్యంతో యిలా అన్నాడు. పాపం! లక్ష్మికిదంతా తెలియదు. ఆమె మెల్లిగా నడుస్తూ కారు దగ్గరకు వచ్చింది. వీరన్న నలుప్రక్కలా ఒక్కసారి చూచి ఎవరూ లేనట్టు కనిపెట్టాడు. అతడుచుట్ట కాలుస్తూ అదేపనిగా కోరచూపులతో ఆమెకేసి చూస్తున్నాడు. అతడలా చూట్టం లక్ష్మికి సిగ్గేసి మొహం వంచుకుంది. వీరన్న మందహాసం చేస్తూ ఆమెతో యిలా మాట్లాడాడు.

"నువ్వు చాలామంచిదానివనీ, కష్టపడి పనిచేస్తావనీ మేస్త్రీ చెప్పగా విని చాలాసంతోషించాను. ఇన్నాళ్లనుంచీ పనిచేస్తున్న నిన్ను చూడక గొప్పపొరపాటు చేశాను. ఈకారు ఎంత అందంగా వుందో చూశావా? ఎప్పుడన్నా యిలాంటికార్లో ఎక్కావా?" అని అడిగాడు. కాని లక్ష్మి మాట్లాడలేదు.

"అబ్బా! ఎంత అందంగా వున్నావు! రంభలా గుండేదానివి నీకీ మాసిన బట్టలేం బాగున్నాయి? మాలాంటివాళ్ల యిళ్లలోనయితే నగలూ, సిల్కుచీరలూ, సెంట్లూ, పువ్వులూ ఎంతోసుఖంగా దర్జాగా వుండవచ్చు." ఆమెకేసి తీక్ష్ణంగా చూశాడు. పాపం! లక్ష్మి సిగ్గుపడింది. ఇతనిమాటలవల్ల ఆమెకు భయం వేసింది.

"చూశావు! ప్రపంచంలో నీలాంటి అందమైన ఆడది యింకొకతె వుండదు. అలాంటప్పుడు ఆముష్టి వెధవను చేసుకొని వాడితోపాటు ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ కూలి చేసుకొంటూ అర్ధాకలితో బాధపడటం ఏమీ బాగాలేదు. నామాటవిని ఆ వెధవని వదిలేసి నాదగ్గరకు వచ్చేయి. నిన్ను మహారాణిని చేస్తా" నన్నాడు.

ఈమాటలు వినంగానే లక్ష్మికి చాలా కోపం వచ్చింది. అందులో అతడు తనభర్తను నిందించంగానే చాల బాధపడింది. ఆమెకోపంతో "కారుకి నీళ్లుకావాలన్నారుట. ఎక్కడపోయాలో చెబితే పోసి వెడతా"నంది. అందులకు వీరన్న వెకిలినవ్వు నవ్వుతో "కారుకు నీరూ నిప్పూ అక్కర్లేదు. నీ దర్శనంకోసం యిలా రప్పించాను. ఇద్దరమూ కార్లో కూర్చుండి కొంచెంసేపు అలా తిరిగివద్దాం రా!" అని ఆమెచేయి పట్టుకొని కార్లోకి లాక్కోబోయాడు. కాని లక్ష్మి కోపంతో చురచుర చూస్తూ ఆ బిందెలోని నీరు క్రిందకు వొంపేసి ఖాళీబిందెతో వెళ్లిపోబోయింది. కాని వీరన్న ఆమెను అడ్డగించి ఆమెను బలవంతముగా కౌగలించుకొనబోయాడు. కాని మానాభిమానములుగల లక్ష్మి రౌద్రంతో పెనుగులాడి వీరన్న గూబకు తెత్తెడు ఘాటైన చపేటాను తగిలించింది. ఇంతలో దూరంనుంచి ఎవరో వస్తూండటం చూచి వీరన్న లాభములేదనుకొని గూబ తడుముకొంటూ కారుచక్రాలకు బుద్ధిచెప్పాడు. హృదయభారంతో ఖాళీబిందెను పట్టుకొని తక్కినవారిని జేరుకొంది లక్ష్మి.

## 3.

సహజంగా ఆడువారిచేతులు మెత్తనివే అయినా మొదటినుంచీ లక్ష్మి కూలినాలి మొదలగు కాయకష్టపు లగు పనులకు అలవడుటచేత ఆమెచేయి కొంచెం గట్టి పడిందనే చెప్పాలి. దీనికితోడు ఆమెయందు తీవ్ర మైన క్రోధాగ్ని రగుల్కొనటంచేత ఆమె విసిరినదెబ్బ వీరన్నకు మూడునిముషాలపాటు మూడులోకాలనూ చూపించింది. అతడు యింటికి వెళ్లంగానే తనప్రైవేటు రూములో కూర్చుండి చురచుర మండుతోన్న చెంపను అద్దంలో చూచుకున్నాడు. ఆమె అయిదువేళ్లూ శాశ్వ తంగా వుండేటట్లు అతని దవడమీద పుట్టుమచ్చల్లాగు నాటుకొనివున్నాయి. అతీవ్రమైన గాయాన్నీ, పరా భవాన్నీ తలంచుకొనంగానే వీరన్న శరీరంలోని నెత్తురంతా క్రోధదావాగ్నిచే వుడికిపోయింది. వెంటనే తనసామర్థ్యాన్ని ఆమెకు చూపించి తనకసిని తీర్చుకోవాలనుకున్నాడు. కాని కొంతసేపు ఆలో చించి ఏవిధంగానన్నా ఆమెను అనుభవించాలని దృఢ నిశ్చయపర్చుకున్నాడు. ఆగాయం నలుగురికంటా పడుతుందనే భయంతో వీరన్న రెండురోజులపాటు లోకం కంట పడలేదు.

ప్రతి ఆదివారం కూలీలకు బట్వాడా యిస్తారు. అందుచేత మేస్త్రీ డబ్బుకోసం వీరన్నదగ్గరకు వచ్చాడు. వీరన్న ఆనాడు తనకు జరిగిన పరాభవాన్ని కప్పిపుచ్చి ఆమె తనమాట వినలేదనీ, ఆమెను ఏవిధం గానన్నా వొప్పించి తనకు చేకూరుస్తే మంచి ప్రతి ఫలం ముట్టచెబుతాననీ మేస్త్రీకి ఆశ చూపించాడు. డబ్బుఆశ చూపితే ఆమె తప్పకుండా లొంగుతుం దనీ అందువలన తనకు మంచిలాభం రాక మానదనీ తలంచి మేస్త్రీ బ్రహ్మానందభరితుడైపోయాడు.

ప్రతివారం వీరన్నే స్వయంగావచ్చి బట్వాడా చేస్తుండేవాడెంచేతో ఆరోజు ఆపనిని మేస్త్రీకే వప్పజెప్పాడు. ఆరోజు ఏదో మిష పెట్టుకొని బట్వా డా ఆలస్యంగా యివ్వటం ప్రారంభించాడు. ముందు మగాళ్లందరికీ కూలీ లిచ్చేశాడు. సూర్యాస్తమానం అవంగానే క్రమంగా కారుచీకటితెరలు లోకనాటక రంగాన్ని కప్పుతున్నాయి. తరువాత మేస్త్రీ ఆడ వాళ్ల నొక్కొక్కరినే పేరెట్టి పిలిచి వారికూలీ యిస్తున్నాడు. ఆరోజు బట్వాడా చాలా ఆలస్యంగా అందటంచేత కూలీలంతా గబగబా యిండ్లకు పోతు న్నారు. ప్రతిసారీ లక్ష్మిపేరు మొదట్లో వచ్చేది. ఆరోజెంచేతో చివరదాకా వుండిపోయింది. పాపం! లక్ష్మిపడ్డే ఆరాటానికి అంతులేదు. ఆమె భర్తవొంట్లో కుస్తీగా వుండటంచేత రెండురోజులనుంచి అతను కూలికి రావటంలేదు. ఇంట్లో యింకా దీపమన్నా వెలిగించలేదు. తాను వెళ్లి బజారునుంచి వెచ్చం తెచ్చి గంజి కాచిపోసేదాకా ఇంట్లో రెండోదిక్కు లేదు. అసలు తానూ కూలికి రావటం మానివేయవలసిందేగాని, ఆరోజు కూలికి రాకపోతే రెండోవారంలోగాని తమ కూలి నియ్యరు. పైగా పనితొందరగా జరగాలని వీరన్న తొందరపడుతున్న సమయంలో కూలికి వెళ్లటం మానేస్తే మేస్త్రీ మళ్లీ కూలిలోకి రానియ్యడేమోయని భయం.

ఆరోజు ఆమె ఎంతత్వరగా యింటికి వెళ్లాలను కొందో అంత ఆలస్యమూ అవుతోంది. తనతో సాయం వచ్చేవాళ్లెవరూ లేరు. అందరూ కాశీవేపు వెడితే తాను రామేశ్వరంవైపు వెళ్లాలి. ఎప్పుడూ మొదట్లో తన్ను పిలిచేవాడు ఆవేళ పిలవకపోవటంచేత కంగారు పడింది. కాని పేర్లను చదివేతొందరలో మేస్త్రీ తనపేరును పిలవటం మరిచిపోయాడనుకొంది. మేస్త్రీ ప్రతివాళ్ల పేరూ చదివేటప్పుడు తనపేరుకూడా చదువుతాడేమో యని ఆత్రుతతో అగ్నిజ్యోతిని వెలిగించే చూపులతో ఎదురు చూస్తోంది.

మేస్త్రీ కూలీలందరికీ బట్వాడాయిచ్చి లక్ష్మిని చూడనట్లు లేవబోతున్నాడు. ఇహ వూరుకుంటే లాభం లేదనుకొని లక్ష్మి వినయంగా "బాబుగారూ! నా మాట మరచిపోయారు. మా యిద్దరికూలీ యిప్పిస్తే యింటికి పోయి గంజి కాచుకొంటా"నంది. అందులకు మేస్త్రీ సంభ్రమాన్ని నటిస్తూ — "అయ్యో! ఎంతపొర పాటు పడ్డాను. పాపం! నీకు చాలా ఆలస్యమైనట్టుంది. అయితే రామన్న రెండురోజులనుంచి కూలిలోనికి ఎందుకు రావటంలేదు?" అని ప్రశ్నించాడు.

అందులకు లక్ష్మి కొంచెం విచారంతో "అతగాడికి నాలుగురోజులనుంచీ వొంట్లో సుస్తీగా వుండీ! అలాగే రోజు గడవ దనేభియంతో కూలికి వస్తుండేవాడు. రెండు రోజులనుంచి బొత్తిగా వొంట్లో వోపిక లేకపోవటంచేత కూలికిరావటం మానుకున్నాడు. ఇంటి కెల్లి గంజి కాచిపోయాలి. మీరు దయయుంచి మాయిద్దరికూలీ యిప్పిస్తే త్వరగా యింటికి జేరుకొంటా" నని జాలిగా పలికింది. ఇదేతగినసమయ మనుకున్నాడు మేస్త్రీ. ఆమెయందెంతో ఆదరాన్ని చూపిస్తున్నట్లు నటిస్తూ "అలాగా పాపం! ఆ సంగతి ముందే చెప్పియున్నట్లయితే! ముందు మీయిద్దరి కూలీయిచ్చి పంపివేసి యుండేవాణ్ణి. అయితే లక్ష్మీ! నీతో ఒకమాట చెబుతాను విను. మొన్న దొరగారు నీతో మాట్లాడినప్పుడు నువ్వు పెంకితనం చేశావంట. అది చాలా పెర్రిపని. దొరగారిలాంటివారు నిన్ను కోరారంటే నువ్వు గొప్ప అదృష్టవంతురాల వన్నమాట. ఆయనకు నీమీద ఎంతో కోపం వచ్చింది. ఏమంటావు! దొరవారితో వప్పుకున్నావని చెప్పనా?" అని అడిగాడు.

ఈమాటలు వినంగానే లక్ష్మి నిశ్చేష్ట రాలైంది. ఈ మేస్త్రీ యింతాకొడుకుకూడా పీరన్న తరఫున మాట్లాడటం చూచి భయపడింది. కాని కొంచెం ధైర్యంతో — "బాబూ! పెద్దలైన మీరుకూడా యిలా చెలపియటం న్యాయమేనా? కట్టుకున్న మొగుణ్ణి విడిచిపెట్టి కోరినవాడితో అల్లా వ్యభిచరించటానికి నేను భోగందాన్ని కాను. మీ రిద్దరూ నావిషయంలో గొప్ప పొరపాటు పడుతున్నారు. ఇహనుంచి ఆ ఆశను వొదులుకోండి. ప్రొద్దుపోతోంది. త్వరగా మా కూలియిప్పిస్తే యింటికిపోతా"నంది ప్రార్థనాపూర్వకంగా.

తనప్రయత్నం ఫలించదేమో యని మేస్త్రీ జంకాడు. అయినా ధనాశ చూపిస్తే లొంగుతుం దనే ఆశ మనస్సులో పీడిస్తోంది— "లక్ష్మీ! నువ్వు పిచ్చిదానిలా గున్నావు. ఆదొరగారిదర్జా, ఆయిశ్వర్యమూ చూడకుండా మాట్లాడుతున్నావు. నువ్వు 'ఊఁ' అని నీ అంగీకారాన్ని వెలిబుస్తే! నీ శరీరమంతా బంగారం దిగేస్తాడు. వెధవది! రోజుకు పావలా డబ్బుల కూలి కోసం రోజంతా మండుటెండలో మాడటం బదులు ఒక్కసారి అంగీకరించావంటే నిక్షేపంగా యిల్లు కదలకుండా హాయిగా తిని కూర్చుండవచ్చు. ఇంత అందమైనదానివి దొరగారిలాంటివారి ప్రాపకం సంపాదించావంటే అందానికి తగినసుఖం లభించగలదు. మరొకమాట! నువ్వు నీమొగుణ్ణి వొదిలెయ్య నక్కరలేదు. అత డెలాగూ జబ్బుగా వున్నాడంటున్నావు. అతడు పనిలోనికి రాకపోయినా యిద్దరికూలీ ముట్టజెబుతాను. నీవుమాత్రం కూలికి రాక దొరగారి బంగాళాకు వెళ్లి వస్తుండాలె. ఇదేమీ తప్పుపని కాదు. మీకూలివాళ్లలో అంతా మానం అమ్ముకొనేవాళ్లే. పిచ్చిపిచ్చిపట్టుదలలుమానేసి యీఅయిదురూపాయలూ పట్టుకెళ్లు. మళ్లీ ఎంత కావాల్సివుంటే అంతా యిప్పిస్తా" నని అయిదురూపాయలకాగితం అందించబోయాడు. ఈ మాటలు వినంగానే లక్ష్మిశరీరం క్రోధోద్రేకంచేత కంపించిపోయింది. ఆమె యీనిన పులిలాగ కోపంతో "అయ్యా! డబ్బుకాసించి శరీరాన్ని అమ్ముకోటానికి నేను భోగందాన్ని కానని ముందే చెప్పాను. ఆయనకు డబ్బుంటేమాత్రం సంసార స్త్రీల మానాలనంతా కొందా మనుకున్నాడా? ఇలా ఎంతమంది అమాయకులను మోసగించి వారి మానాలను అపహరించారు? మీ వుద్దేశ్యం ఏంటి? లోకంలో ధనవంతులు తప్ప తక్కిన స్త్రీలంతా మానం అమ్ముకొని జీవించే పచ్చిలంజ లనుకొన్నారా? కూలి నాలిచేసుకొని జీవించేవాళ్లకు మానాభిమానము లుండవని మీ సిద్ధాంతమా? తినటకు తిండిలేకపోయినా ఆకలిబాధకు వోర్చుకొని మలమల మాడుతుంటాము గాని తుచ్ఛమైన భాగ్యభోగములకై మానాన్ని అమ్ముకోము. అసలు అన్ని జాతుల్లోనూ వ్యభిచారము పెచ్చుపెరుగుటకు మీ ధనవంతులే కారకులు. అమాయకులగు పేదలకు కపటపుమాటలు చెప్పి, ధనాశ చూపి వారిమానధనాన్ని కొల్లగొట్టుతున్నారు. ఆయన అడగమంటే, అడగటానికి మీకు నోరెలావచ్చింది? ఇవ్వాళ నన్ను మోహించాడు. రేపు మీ పెళ్లాన్నో లేక చెల్లెలినో చూచి మోహించి వప్పచెప్పమంటాడు. అప్పుడు మీచేతులారా మీ పెళ్లాన్ని అప్పగించగలరా? అప్పుడు మీ హృదయం ఎంత దారు

# అసలు సత్యాశ్రయ కందశిలాశాసనం*

పరిష్కర్త: శ్రీ రుక్మిణీనాథశాస్త్రి

### శాసనం దొరికినవిధం

అప్పటికి, నే నింకా ధారాళంగా సిగిరెట్లు తాగుతూన్నాను, మానలేదు. కుతి తీరడానిక్కూ కృత్తిపడడమూ లేదు. ఏరాళముగా వాటిమీద పాటలు రాశి ప్రచురించి ఎడా-పెడా, మెప్పుల్నీ, దెప్పుల్నీ మూట కట్టుకుంటూనే వున్నాను. కొమ్ములు తిరిగిన భావకవికింద చెలామణీ ఔతున్న రోజులు అవి. నాలో నాకే వేదన, నాలో నాకే సంతోషం, నాలో నాకే దిగులు, నాలో నాకే తబ్బిబ్బు. అల్లాంటి ఉపద్రవకరమైన రోజులు అవి. మా యింటికి పక్కయింటికి ఎదటి యింట్లో వొ భాగాన ముసలి వెధవ అవ్వగారున్నారని నన్నెరిగిన ప్రతివాడికీ తెలుసు. ఆ అవ్వగారిపేరు ఆ అంధరితోపాటు నాకు తెలీదు. కాని మా ఆవిడా, నా మరదలూ, మా పాప (మూడేళ్లున్నర ఈడు మా పాపకు) అంధరూ అన్నట్లు నేనూ ఆవిణ్ణి అవ్వగారంటున్నాను. ఆ అవిడా ఆవిడ చెల్లెలికొడుకూ [పేరు పార్థసారథి, చెట్టంతమనిషి, మంచివాడే, పాపం ఆయనకు పడుచుదనంలోనే భార్యపోయింది. మళ్లీ సమ్మంధాలు రానూ లేదు. ఆయనా సంసారం జంజాటం, రొంపి అని పెళ్లిచేసుకోలే దంటాడు! దాసీ అంకమ్మని బాహాటంగానే ఉంచుకొన్నాడు! మందులు [వశ్యౌషధాలు] కక్కించడం ప్రధానవృత్తి. బైరాగుల్తోటీ జంగాల్తోటీ తిరుగుతాడు. బైరాగుల కుండే అన్ని ఛండాలపుగుణాలూ ఉన్నై.] యిద్దరూ రోజూ వొచ్చేట్టుగా, మామూలుగా, రాత్రెళ్లు భోంచేశాక వొచ్చే పెత్తనాలకు వొచ్చారు. వొస్తూనే వొకథ ఎత్తుబడిచేసి మరీవొచ్చాడు. వాడిదుంపతెగా, వన్నెలు చిన్నెలుగా, పూసగుచ్చినట్లు ఏం రంజుగా చెప్తాడనీ కథల్ని. పక్కనుండి వింటూంటే—ఇల్లా మనం రాస్తే... అని అనిపిస్తుంది. వాడు వెళ్లిపోయాక తీరాచూస్తే అందులో ఏమీవుండదు. వొచ్చి మాఅంధరితోటీ కథాకేళి జరిపి, కబుర్లు చెప్పి వెళ్లిపోయాడు. వాడు యివాళ చెప్పిందాంట్లో వొక కొత్తవిషయం వుంది. పెదపెంటపాట్లో బైరాగు లుంటారట. వాళ్లు త్రికాలవేదులట. ఆపన్నార్తిప్రశమన ఫలు లని.

రాత్రి పదింబావు అవుతుంది అప్పటికి. బైరాగి విరాగిశబ్దభవం. 'వ' కు, 'బ' వొచ్చింది. సరళానికే గసడదవా ఒఒదేశం. వృద్ధి. వైరాగ్యం, బైరాగ్యం కాలేదు. వైరాగ్యం, విరాగి మాటలు ప్రసవించిన విచిత్రరూపం; అని నాలో నేను తెలీకుండా యింతభాషా చర్చ చేసుకున్నాను.

మావాడు యింతలో యాడవడం, మాఆవిడ వేళకు తగ్గట్టుగానే భోంచేస్తూండడమూ, నన్ను కాస్త సముదాయించ రాదా

* నా దగ్గర ఉన్న శాసనపాఠాన్ననుసరించి.

అని కోప్పడ్డమూ నా ఆలోచనకు వాక్యూం బ్రేక్ వేశినై.

తెల్లార్లూ పెంటపాడూ, బైరాగులూ, పెంటపాటి మఠాలూ, లోకసంగ్రహార్థం రాగ ద్వేషాదుల్ని చంపుకున్న, సన్య సించిన, ప్రత్యక్షగోస్వాములూ, హరనాథ బాబాలూ, గౌరాంగులూ, అవీ థగ ఆలోచించాను. కునుకు పట్టలేదు. కృష్ణ శాస్త్రి అన్నట్లు—

పానుపంటని వేడినిదర

వేగించాను. తెల్లారఘట్ట అవ్వగారు భూపాల రాగచ్ఛాయగా:

"కేశవా యని నిన్ను
వాసిగా భక్తాలు
వర్ణింపుచున్నారు లేరా...
వాసవవందితా,
వసుదేవనందనా,
వైకుంఠపురవాస లేరా..."

అని పాడుతూ పేడ వేటకు బయలు దేరారు. రైలు కూతేశింది. ఆవిడ మా యింటిదగ్గరకు వొచ్చేప్పటికి—

"మేలుకో ఆకాశగంగా
మేలుకో శివకాశి గంగా
మేలుకో శంభూనిరాణీ
మేలుకోవమ్మ
గంగా
మేలుకో!"

అంటున్నారు.

ప్రబోధం అయింది. వెంఠనే ఆవిణ్ణి కలుసుకున్నాను. పెంటపాటి సంగతి ఆరా తీశాను. "యిప్పుడా? ఆ సంగతి-" అంటూ కొంచం నసిగి చెప్పింది గొడవగా.

మళ్లీ అవ్వగారు

మేలుకొనవే రాజహంసా
మేలుకొను చైతన్యమా...
మేలుకొనవే శుద్ధనిలయా
మేలుకొనగదవే...
శివా
మేలుకో...

అంటూ సందు తిరిగి వెళ్లిపోతున్నారు! నాచెవుల్లో, నాలో "మేలుకో" రింగురుమం టోంది. తేలిన పర్యవసానం: పెదపెంటపాడూ, చినపెంటపాడూ అని రొండూవున్నైట. రొండుచోట్లా బైరాగు లుంటార్ట. పెదవేగీ చినవేగీ అని రెండూ వున్నట్లు. విశ్వనాధ సత్యనాణగారి వేగీక్షేత్రంపద్యాలు గుర్తు కొచ్చినై. నాలో నేనే అలవాటుగా గనక చదువుకున్నాను. ఆపద్యాలు రాశేప్పుడు అక్కడ సత్యనాణగారు ఎంత ఉత్సాహంగాఠో..

అక్కడి రసవాద,ధాతువాద,శిలావాద కాష్ఠవాదు లుంటారని థగవుత్సాహిస్తోంది మనస్సు.

నన్నయ్యకు పూర్వపువీ, దగ్గరవీ శాసనాలు కొద్దిగానే దొరికినై. మన మో రొండు మూడు చులాగ్గా సంపాయించి పబ్లిష్ చేస్తిమా, భాషాసేవ ఆసైడ్నించి కూడా చేసినట్లౌతుంది. ఉబ్బితబ్బిబ్బౌత లూగు తున్నాను.

చేతులో దమ్మిడీ లేకపోయినప్పటికీ అప్పుచేసి[2] పెంటపాడు బయలుదేరాను.

2. కాబూలీవాడు అప్పు యివ్వకపోతే, ఈ శాసనాల సంచారం అప్పట్లో పడేదీకాదు, యిటు వంటి శాసనాన్ని నేను సంపాయించేవాణ్ణీ కాను. భాషాసేవ జరిగేదీ కాదు. అందుకని మీరంతా నాతో పాటు, ఆ కాబూలీవాడికి, అప్పు యిచ్చినందుకు కృతజ్ఞత చూపడం మర్యాద.

అక్కడ బైరాగుల్ని కలుసుకుని, తిండీ తిప్పలూ లేక, వేళాపాళా లేక, వరసా వావీ లేని ఆ బైరాగుల్ని ఆశ్రయించి మొత్త మ్మీద నాల్గోనాడు పెదపెంటపాట్లో శాస నా లుంటా యని గ్రహించాను. కన్యా శుల్కంలో బైరాగి, విశాఖపట్నం తీర్థపు రాళ్ల రేవున, కొన్ని నిలువలలోతున, కంచు శివాలయం వుందని చెప్పినట్లుగా, శ్రీ భిక్షా నందగిరి [నాకు శాసనాల భోగట్టా తెలిపిన సద్గురిని దీక్షానామం] వారు, చూచాయగా, పుకారుగా, మబ్బులో దోబూచిగా మాట లలో మాటగా, ఊరికి వుత్తరప్పక్కని శాస నాలుంటా యని అన్నారు. వుండలేక అప్పుడే బయలు దేరుదా మనుకుని, గురువుగారి కెక్కడ కోపంవొస్తుందో అని ఆ పూటకు అక్కడే రేవిణీవేశి, మర్నాడు పొద్దున బైలుదేరాను. ఎంత వెతికినా శాసనాలు ఏవీ నాకంటి క్కనబడ లేదు. శాసనాలు ఛట్టున కనిపిస్తాయా? ఎంతకష్టపడాలీ? గిరాం మ్మూర్తీ, మానవల్లి రామకృష్ణకవి, కొమ రాజు లక్ష్మణ్రావుగార్లు, ఎంతెంత కష్టపడి సంపాయించారో గదా, శాసనాల్ని. కొంత దూరం పోగా, పోగా, తులిశికోటలూ, [శ్మ శానం కాదూ మరి] వోచిన్న గుంటా, దాంటో పసరెక్కిన నీళ్లూ, పక్కని యేట వాలుగా, చాక్షగా, బట్టలు వుతుక్కోడా నికి వీలుగా, వోఎర్రనిరాయీ, కనబడినై...

తిరిగి తిరిగివున్నా నేమో, ఛాలివొస్తోంది. చేతులో ప్రయాణపుసంచీ, వైతాళికులూ (కవిత్వం పక్కన వుండకపోతే, బతగ్గలనా) ఆ రాతిమీదపెట్టి, అట్లాగే ఆరాతిమీద తిష్ఠవేశి, యింత అలసట తీర్చుకున్నాను.

—యింతలో సిగిరెట్టు దమ్ములు కాశిని తీసి, యిహా లేచిపోదా మనుకుంటూండగా, ఆ సాయింత్రం సూర్యుని బక్కకోపపు కిర ణాలు ఆరాతిమీద పడ్డై. అంతదాకా తుమ్మ ల్లో పొద్దుకూకిన ట్లుండే ఆరాయి అకాస్తకే, ఛర్రుమని ధగాధగా మెరిసింది. చూశాను. యింకేం? లిపీ సంజ్ఞలూ గోచరించినై. అమ్మ!

తీరా చూస్తే, వోనిలువుగీతా, (సన్నం గా) వోఎర్రటిపీడూ (రాయిబహుపొద్ది. శాస నం చెక్కినవాడు అశ్రద్ధగా చెక్కివుంటాడు, పీడిదుంప తెగా) కనిపించినై.

కాకతీయులకు వరాహముద్రా, విజయ నగరపురాజులకు చిక్కిరిబిక్కిరి అక్షరాలతో శ్రీవిరూపాక్ష, అనీవుంఫై. అటువంటి దేమో అని చూచాను. కాదు. ఏదో ఏదో సింబా లిజం!

ఐతే, యేమిటీ- ఈసింబాలిజం?

నాకేం బోధపళ్లేదు.

జయంతి రామయ్యపంతులు, రాళ్లభండి సుబ్బారావు, భావరాజు కృష్ణరావు, మల్లం పల్లి సోమశేఖరశర్మగార్లకు తెలీచేస్తే— వాళ్లు చులాగ్గా తేల్చేస్తారు. భావకవినైనంత మాత్రాన, నా మనస్సౌందర్యం చూడక, మాలకాటణ్ణి చూశినట్లు చూశి, యద్దేవా చేస్తే...

ఛీ, నామర్దా.

కుర్రకారు హిస్టోరియన్స్, మారేమండి రామారావు, పుట్టపర్తి శ్రీనివాసాచార్యు లకు తెలీచేస్తే—అసలు వోకమిటీనివేస్తే...

భేష్!

ఏముటీభేషు?, ఆకనిటీ వోఅయిదారు నెల్లుతాత్సారంచేస్తూ, చివరికి-"రాయి బహు పాతది. అక్షరాలు తెలీటంలేదు. లోని విష యం బ్రహ్మభేద్యంగా వున్నై. తత్వం బోధ పడ్లేదు. ఏంచేస్తాం ఇప్పటికి దొరికిన ప్రెమా ణాల నుబట్టి చూస్తే—రాయిమాత్రం బహు దొడ్డది" అని తీర్మానించి సీల్లు నమిలితే— మళ్లీ నామెడని యీచట్టుబండ తప్పదామె.

ష్చ్!

వాళ్లు మటుక్కు నాకంటె హేమా హేమీలా ? ఎల్లా ఓఅల్లా నేనే తంటాలు పడదా మనుకున్నాను.

మళ్లీరాతిదగ్గరికి పోయి చూశాను. అల్లాగే వుంది. ఆలోచించగా, చించగా, స్ఫురించింది. దానకాలాన్ని గుర్తించాడు శిల్పి! ఎరటిపేడు కుజగ్రహం. ఆనిలూపాటి సన్నగీత, అనూరాధ, లేదా, విశాఖ. ఆ గ్రహం ఈతారను వేధించిన సమయం. ఆ మహాపుణ్యసమయాన. అని యింత అర్థా న్ని సింబలైజ్ చేశాడు శిల్పి! వీడమ్మకడుపు కాలా! శాసనాన్నితూచి బరువు నిర్ణయించ డం భారతిలో ఏశాసనం విషయంలోనో చదివాను. సోమశేఖర శెర్మగార్ని అడుగుతే, లోహశాసనాలు అల్లాతూస్తారని, తద్వారా, శాసన కాలికతను గుర్తించొచ్చనీ, వోసారి అన్నట్లు గుర్తు. వెధవ వైదీకబ్బుద్ధి. అప్పుడే శిలాశాసనాల విషయం అడిగానుకాదు.

పోనీ, దీన్నికూడా తూయ కూడదా అనిపించింది ఆ తొందర వుత్సాహంలో. చుట్టుపక్కల తక్కెడ లేదు. ఉజ్జాయింపుగా అన్నా, చూద్దామని ఎత్తాను ఊతం చేసు కుని. అమ్మో. ఆముక్తమాల్యద (మహా కావ్యం)అంత బరువూ వుంది.

—నేను కెమేరా తీసుకు పోలేదు. చెప్పొద్దూ నాకు ఫోటోలుతీడం చాతకాదు. పోనీ యింత కాటుక మషి, మసి, తీసుకు పోలేదు. మారేడుకాయను చేసి ప్రింటు (Print) తీసుకోడానికి.

ఉత్త ఎర్రిబాగొడ్డి వెళ్లానేగాని, ఏం ఏం తీసుకెళ్లాలో గుర్తులేదు. నలుగుర్నీ కనుక్కొని ఐనా వెళ్లలేదు. నా అవస్త చూస్తే నాకే డాన్‌కిక్‌జోట్ గుర్తుకొచ్చాడు.

ఆలోచించి—

గట్టిగట్టి రాగిడిమట్టి—సహం ఎండింది, యింత పట్టుకొచ్చి, దిమ్మగా చేసి, దాన్ని ఆరాతికి అతికించి, దాన్ని పదిలంగా యింకో చోట పెడుతూ, ఆశాసనానికి నకలు ఎత్తు కున్నాను. తరువాత ఆ మట్టిదిమ్మలకు మసి పూసి, దాన్ని కాగితంమీద అద్దుకుని, దాన్ని ఫొటో (Photo) చేశి, ఆ ఫొటో కాపీలు (Photo copies) ఆ రాతి దగ్గరకు తీసికెళ్లి సరిచూసుకుని, పరిష్కరించ దలు చుకున్నాను.[3]

తరువాత వివరణలూ, సవరణలూ రాసిపెట్టుకుని, కిందటిసారి మద్రాసు వెళ్లి నప్పుడు, మల్లంపల్లి సోమశాఖరశెర్మగారి ద్వారా నాసంధేహాలు తీర్చుకుని, యిప్పుడు ప్రచురించుతున్నాను. నాకు శాసనం ఎలా

3. ఈశాసనాన్ని, కదిపి, కుదిపి, దులిపి, శేపి, ఊపి, దూర్చి, మార్చి, యథాయోగ్యలేగల మాటలతో తగుపాటలతో సంస్కరించి, పరిష్కరించి, ఆవిష్కరించుతూన్నాము.

దొరికిందో తెలీపర్చాలంటే యింతగ్రంథం వుంది.

ఆదిలో మా ముసలవ్వగారి చలవ, కదా, యింతలాభం తెలుక్కే చేకూర్చింది. అంచాత ఆవిడవర్ణన చెయకతప్పింది కాదు.

శాసనం—

శాసనం వోమూల కోసుగా తెగి, విరిగి పోయింది. రాయి బహుపాతదని అనేకదాఖలాలు వున్నై. శాసనంచెక్కిన సన్నాసి, చాలా అశ్రద్ధగా చెక్కాడు. వోవేళశ్రద్ధగా చెక్కినా, చాలకాలం కాడంచాత రాయి పేటురేగిపోతోంది. యింకా డజను సంవత్సరాలు దానికేశి ఎవ్వరూ, యీదృష్టితో చూడకపోతే, చాలాచాలాశిథిలమైపోయేదే. ముసిలవ్వ రూపేణా భగవంతుడు, నాకీ సద్బుద్ధి పుట్టించాడు. నయం.

లిపి—

యిప్పటి లిపి కానేకాదు. ఎట్టా వొస్తుంది? మనం రాసే లిపే వేరు, ఈలిపే వేరు. అక్షరాలు పొంకంగా లేవు. ఆరవీటిరాజుల కాలపుపద్ధతీ కాదు. కాకతీయులనాటి పద్ధతీ కాదు. రేనాటిశాసనాల పద్ధతీకాదు. గాంగరాజులపద్ధతీ కాదు. చాళుక్యుల పద్ధతీకాదు. రాష్ట్రకూటులపద్ధతీ కాదు. ఐతే ఎప్పటిపద్ధతీ అని నన్ను రొక్కాయించకండి. నాకుమట్టుకు ఏంతెలుసు? తెలీలేదు గనక, ఎంత తెలియదో అంత ప్రాచీన మని వూహిస్తున్నాను.

తలకట్లు ఏటవాలుగా వున్నై. అక్షరాలు కుదిమట్టంగా లేవు. చ, ఛ, చి, ఛీ లు స్పష్టంగా కొట్టొస్తున్నై. ససపలూ, శవర్ణమూ, ఇణీ, పులుముడుగా వున్నై. ఱ, డ, హాలూ, మకారమూ, ఎబ్బెట్టుగా వున్నై.

అచ్చులో: ఎత్వ ఐత్వ ఔత్వాలు మరీ గరినాసిగా వున్నై.

కొన్ని అక్షరాలు నాకు యిప్పటికీ చాలా సందేహాస్పదంగా వుంటే—వాటిని కుండలీకరణంలో వేస్తూ, నామార్పులు Foot Notes లో సూచిస్తో, చచ్చి చెడి, సహాళమైన ఇబ్బందులూపడి, అడ్డమైన గడ్డీకరిచి, యీశాసనాన్ని యీమట్టుకు తేగలిగాను.

భాష—

ఈశాసనంలోని భాషయేభాషో తెమలడంలేదు. నామట్టుకు నేను 'తెలుగు' అని నమ్మి పరిశోధనలు సాగించాను. అందులో శాసనం అంథా సాంకేతికం. 'వ' అంటే వర్జ్యమో, వారమో, తేలదు. 'వి' అంటే విషయమో, విశాఖానక్షత్రమో, తెమలదు. 'వృత్తులు'అన్నమాటకు అపభ్రంశరూపమైన 'విర్తులు' ఏమో అనీ అనుమానం.

"చాలాకాలంనించీ బట్టలరాపిడి ఎంత వున్నా, శాసనంలోని విషయం ఉతకేయబడినా, అదేంమహాత్తో,

"స్వదత్తాం పరదత్తాం
యో హరేత వసుంధరాం
షష్టిర్వర్షసహస్రాణి
విష్ఠాయాం జాయతే క్రిమిః"

అనే వ్యాసగీతలు నా మనస్సులో కొట్టొచ్చేటట్టు మెరుస్తున్నై, యింకేం. అక్కడక్కడ దుర్గమంగానూ, దుర్జ్ఞేయంగానూ వుంటంచాత అనేక భ్రమ ప్రమాదాలకు లోను కావలసి వొచ్చింది.

ఉర్దూభాష యేమో అనీ, బ్రాహ్మీలిపి ఏమో అనీ, అన్నందు కేందుకూ...

గాసింది, చిత్తచివరకు—ఖరోష్ఠీ లిపి అని తెలుంగుభాష అని నిశ్చయం చేసుకున్నాను.

లక్ష్మణారావుపంతులుగారు, విజ్ఞానసర్వస్వంలో రాశిన 'అక్షరాలు' అనే వ్యాసం చదివి, ఈ శాసనంకేశి చూతునుగదా- హా-య్యో లక్ష్మణారావుపంతులుగారు యీ శాసనాన్ని చూచివుంటే బావుండునే... అని అనిపించింది. దిగాలుపడి గుండె రాయిచేసుకుని పరిశోధనకు మళ్లీ వుపక్రమించాను.

కాలం—

శాసన "అక్షరకర్త" ఎవరో అని ఎంత భోగట్టా చేశినా, దీంతస్నలమందూ, ఇంత వరకూ ఎవరూ చెప్పలేకపోయారు.

డా. హుల్షు,రైస్, బర్నెల్ వేణుగోపాల చెట్టి, వొక్కళ్లయినా, యిది ఇట్టాంటి దని అన్నవాళ్లు లేరే? వంగతి? 'వ' అని వుంది. ప్రకరణం కవికీ, వారానికీ సరిపోతోంది. ఎటూ తేల్చలేక ఉక్కిరిబిక్కిరై, పోతున్నాను. పొంకమైన మీసాల్తో, 'శాసనం' అంటే మాటలా? అని నవ్వుతూ, గెంగురెడ్డి వీథిలోంచి వొస్తూ సోమశేఖరశర్మగారు కనిపిస్తున్నారు మనోనేత్రానికి. అంచాత, నేను దక్కిస్తూ, ఆయన్ని గౌరవించడానికి 'వడ్డవార'మని, గ్రహిస్తున్నాను. అట్లాగ్రహించడం ఫిరంగిపురంశాసనంలోనూ, రెండో తైలపదేవుడి ఆరోశాసనంలోనూ వొస్తుంది. పోతే, కవి ఎవరో తేలలేదు. ఎక్కాల పుస్తకంలాగా, అపౌరుషేయ మేమో అనీ అనుకుంటున్నాను.

శాసనకాలాన్ని కవినిబట్టి తెలుసుకో వీలు చిక్కలేదు. కాలాన్ని బట్టి కవినీ పోల్చుకో లేకపోతున్నాను. వొక్కపద్యం రాశి, పేరోపేరో అని ఏడుస్తామే—ఈ కుకవిగాడు తన పేరు పోరుపెట్టకుండానే గుటుక్కుమన్నాడు, వీడి తాడు తెగా. ఇందాక, విశాఖనో అనూరాధనో కుజగ్రహం వేధించినసమయం అని అన్నానే అది నిజంకాదు, నాభ్రాంతి. ఐనా ఆముహూర్తాన్ని కూడా పరిశీలిద్దామని అనుకున్నా, జ్యోతిషంలో, "మీనమేషా చతుర్దండీ గోకుంభే చతురర్ధకం" దాటితే నాకు రాదు. జ్యోతిర్వేత్తలయిన నాస్నేహితుల్ని కలుసుకుందామన్నా శ్రీనివాస శిరోమణి (జ్యోతిషం తెలిసిన స్నేహితుడు నాకు ఇత నొక్కడే) ఆ దుక్కుమాలినచన్నపట్టణం వీధుల్లో, ఊకకూరిన చవకరకం సిగరెట్లు దహిస్తూ విధికి, ఎదురు, నిలువు ఈత ఈదుతూన్నట్లు నడుస్తాడేగాని, యిల్లాంటి మంచిపని అంటే కలిశిరాడు. పైపెచ్చు, నిరుత్సాహపరుస్తాడు. పోనీ ఏలాగైనా టోపీవేద్దామన్నా తప్పుడుసమన్వయం చెబ్తాడుకూడాను. (అతనికి ఇదోపాడిదుర్గుణం. తిక్కరేగితే, మంచిగానే వుంటాడు. ఇప్పుడు రేచిక్కలో వుంనాడు. పైగా రీసర్చి ద్వేషి అయ్యాడు. మొన్న లజ్ దగ్గర కనిపిస్తే నిలేసి అడిగాను. కరవొచ్చాడు. ప్రాలుద్ధం.)

పోనీ ఇంకోరికిచూపిద్దామాఅంటే వారు ఈఆధారాన ముక్కట్టుక్కూచ్చుని, ముందు దీన్ని (**Publish**) చేసి కీర్తిని కాజేస్తే — ఎన్నింటికని ఇదవం? అంచాత జ్యోతిస్సూ పనికిరాలేదు.

దానకర్తనుపట్టి, ఛందస్సునుపట్టి తేలుద్దామనుకొంటూన్నాను.

ఇంతవరకు మనకు లభించిన ప్రాదెలుగు ఛందఃశాసనాలలో, అద్దంకిశాసనం ప్రాచీనం.

తరువాోజలోవుంది, మూడవ భీమమహారాజు శాసనం సీసంలో వుంది. రాజరాజకూతురు సోమల్దేవిశాసనంకూడా సీసంలో వుంది. దీర్ఘాసిశాసనం కూడా మనకు వొత్తాసి వొస్తోంది.

ఇది 'కంద' శాసనం. మీాద చెయ్యేయ గానే, చెయ్యిచెయ్యంతా వోటేదురద. తప్ప కుండా 'కంద' ఐతీరాలి.

దానకర్తను గురించి తేలుద్దా మను కుంటే —

'సత్తైశ్స్రశ్' అన్నట్లు కనబడు తోంది రాతిపేడు. భారతంలో పేరుకొన్న సత్యాశ్రయుని నాటిభాష ఇదికాదు గనుక, వాడితాత సత్యాశ్రయునిదిగా స్వీకరిస్తు న్నాను. 'సత్యాశ్రయుడు' అనేదానికి 'సత్తై శ్ళ్' ప్రాచీనపూర్వపదంగా భావించటం మహాపాపం కాదు.

శాసనంలో 'తెఱెయ్' అనివుంది చూ డండీ: కన్నడభాషలోని 'తెఱె' అని దానికి, వికృతపు తెలుగురూపం. కన్నడంలో తెఱె అన్నగా పన్ను, 'యు' సముచ్చయార్థకం. 'యు'క్లుప్తరూపం 'య్'.'తెఱెయ్' ఇలియట్ గారు సంపాయించిన అహదనకర తామ శాసనంలోనూ, కొద్దిమార్పుతో వుంది. ఫ్లీటుగారు ఏం మాట్లాళ్లేదు ఇక్కడ.

'కవిశెంకు' అని యింకోమాట వుంది శాసనంలో, నేటి భాషలోకి అది మార్చా లంటే 'కవియమునకు' అని ఔతుంది. కవియమునకు సత్యాశ్రయమహారాజులుం గారు దానం యిచ్చారు అనిగదా తేలింది.

'అరిడగు' అని యింకోమాట.

ఈ రెండు మాటలనూ, కొంచం వివరిస్తాను—

యమశబ్దభవం జమ. అత్యానికి ఎత్వ మై జమ జెమ అయింది. ఇంకోవిధంగా చూస్తే దేవశబ్దానికి, తెలుగు జేజె. దానిలోని ఏకదేశం జే. దానికి మహదర్థకంలో, డుబు. జేడు. శ్రుతికటువుగా వుంటంచాత, తస్మాత్ సాదృశ్యమునుబట్టి, రామాత్ అయినట్లుగా తస్యసాదృశ్యమునుబట్టి, రామస్య అయినట్లు గా, దేముడు సాదృశ్యాన్నిబట్టి, జేముడు, దాంతరవాత జెముడు అయివుండవచ్చు నని తోచుచున్నది. దేముడు శబ్దంబు సుప్ర సిద్ధంబు.

"దేముడశ్లే లోన
తిరుగుతున్నా డేటొ."

—దొంకిపాటలు.

పోతే, కుప్రత్యయానికి పూర్వం నగా గమం రాకపోడంలో, శాసనప్రాచీనత తెల్ల పడుతోంది.

ఇది సత్యాశ్రయునితాత ఐన అసలు సత్యాశ్రయుడు (అసలు తామరమందు అన్నట్లు) నాటిది గనుక, ఆనాటిభాష యిల్లాగే వుంటం ప్రాచీన శాసనపరిష్కర్త లగు బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిల వారుప్రభృతులకు తెలీంది కాదు.

అరిడగు అంటే: అరి అంటే భూమి పన్ను. పైరు పండింతరవాత చెల్లించాల్సిన భూమిపన్నుకు అరి అనిపేరు. అహదనకర తాంరశాసనంలో ప్రభాకరశాస్త్రిలవారు ఈ అర్థబలాన్నే స్వీకరించారు. డగు అనగా తరుగుదలకై ఇచ్చేడిపన్ను.

కొన్ని కొత్తమాటలు—

సెల్లు, నేలె, బౌణ ఇత్యాదులు.

అద్దంకి శాసనంలో "త్రిభువనాంకుశ బాణనిలిపి" అని వుంది. 'బాణ'కు సరియైన అర్థం తేలలేదని శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు అన్నారు. ఇందులో 'బౌణ' అని వుంది మరి. దీంతెగ్గోయ్యా. ఇదియు శాసన ప్రాచీనతకు తార్కాణ. మంగి యువరాజు లక్ష్మీపుర శాసనంలో : 'నేలు' అని వుంది. మంచన, మంచెన; మాచమ, మాచెమ; అయినట్లు నేల, నేలెకు కొత్తరూపం కా వొచ్చేమో? వీణ వీణె వీణియ వీణ్య అనే రూప పరంపర ఈ ఊహకు ప్రోద్బలం.[4]

పౌణ అని యింకోమాట వుంది. బాణకు, బౌణ. బౌణకు పౌణ. పూర్వపూర్వరూపము లేమో అనుకోడానికి అత్తే వీలుచిక్క లేదు. చాలా గత్తిదాఖలా లున్నాయి.[5]

శాసనప్పంక్తులు అన్నీ, వ్యాసగీతలతో సహా పక్షైనిమిది. శాసనం ప్రెతిబింబం ఇస్తే బ్లాకులు చేయించడం కష్టం. పంక్తులు ఇస్తే, మీరు సరిపెట్టుకుంటారా? నేనేదో మార్చా ననీ, దూర్చాననీ, ప్రతిబింబం చూపితే — రాయి చూపమనీ, అది చూపితే, ఛెస్, ఇం తేనా? అనీ కాకిగోల చేస్తారు.

పైగా, సంధులూ కీళ్లూ, కారకాలూ, అవీ ద్రావిడభాషా సంప్రదాయానుగుణంగా వున్నాయని రామకృష్ణయ్యగారూ, కాదు— ఎంతటి తెనుగుమాటైనా, (పీనుగలు (తె) పిణై + గళ్, పిణైగళ్, పిణైగ + ళ్ = పిణైగళ్ పీనుగ + లు : యిల్లా), ముందు సంస్కృతం తర్వాత ప్రాకృతం తరువాత తెలుగు అంటూ నారాయణరావుగారూ, అబ్బే — అల్లా కాదు, తెలుగుమాటలు చాలా Sanskritise చెయ్యబడినై (గోరు + అంటు = గోరంటు = కురంటక యిల్లా) అంటూ ప్రభాకరశాస్త్రిలవారూ, మళ్లీ ముగ్గులోకి వొచ్చి, కీచులాడుకుని బాధపడతారు.

ఎల్లా మరి?

అహదనకర తాంరశాసనం అంతపనీ మళ్లీ గిరాంపథంలో జరుగుతుందని ఝడిసి, శాసనప్రతిబింబం యివ్వక సంతేపిస్తు న్నాను. నిజం దాచడ మెందు కని మా అంకమ్మా, మాబావమరిదీ (వాడు ఇప్పుడు అయిదోక్లాసు చదూతూన్నాడు) అంటు న్నారు. కాని మా ముసిలవ్వగారు, నువ్వు రాయి, కాని యేమైనా, అయినవాళ్లకూ కానివాళ్లకూ చూపద్దని కేకలేస్తున్నారు.

నన్ను మీరు తిట్టినా, దుమ్మెత్తినా, దీవించినా, యాగీచేసినా నేను శాసన ప్రతిబింబం యివ్వను. ననేమిరా అంటున్నాను. ఇహ నేను వాళ్లమాట వింటానని జయంతి రామయ్య

4. బిన్నయ్యసూరి మహాఅన్నీ తనకు తెలిసినట్లు కోస్తాడుగానీ, బాలవ్యాకరణం అరవైమూడు పక్కపుటలో, ఇరవైయెామాత్రం ఔతలిపేజీలోని విషయం అంతా శుద్ధబోకు. ఈ శాసనాంతమున ఈ విషయం విపులంగా చర్చించగలవాణ్ణి, మా ముసిలవ్వగూడా నిజం అంటే నిజం అంటోంది.

5. శాసనం అంతా పాతతెలుగులో వుంది. శాసనాన్ని చూస్తే చాకిరేవుబండగానూ, లిపిచూస్తే బష్మ్రాతగానూ, భాష ఎలికల యేనాదిభాషగానూ వుంది. ఐనప్పటికీ— తెలుగుశిలాశాసనం గనక, మనకు మన తాత మెల్లకంటి కోడిరెప్పవలె సర్వదా

పంతులు, మల్లంపల్లి సోమశేఖరశర్మగార్లని మీరు బాతిసిపెట్టించినా నేను ఈవిషయం లో స్థితప్రజ్ఞుణ్ణి గనక, వాళ్ల మాట వినను. శ్రీనివాసశిరోమణికి ఆచోకే చెప్పను. అతను, నవగ్రహాల్నీ పన్నెండుగళ్లల్లోనూ కట్టేసి నిజం లాగవొచ్చు. అమ్మయ్యో-దేవాంతకుడు!

మరోమాట:

ఫ్లీటుదొరా, హుల్ష్ ప్రభృతులు, దీని కాపీలు తీయించి, లండన్ పంపివుంటారని అనుకునేరు. లేదు. పాతానికి సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్ వెతికేరు. దండగ.

ఆరాయిమీద నే, షది పన్నెండేళ్లనించీ బట్టలు వుతికే చాకెత 'ద్యగ్గి' అనే ఆమె నన్ను యిల్లా అంది:

"యెక్కడిగుడ్డి మా రాజువయ్యా? నాకు గ్యానం వొచ్చినకాణ్ణుంచీ ఇది చాకలి రాయేగాని చదువులరాయి కాదయ్యా, యేం తంటాలు పడతావయ్యా బ్యాంబడా" అని. రావుబహదూర్ హోసకోట కృష్ణశాస్త్రిగారుకూడా, నాతో, ఈ విషయమే చెప్పారు. ఇప్పటికీ నిండైన వారివిగ్రహాం కళ్ల కట్టిన ట్లవుపడుతోంది.

సత్యప్రమాణ పూర్తిగా, గాయత్రీ సాక్షిగా, త్రికరణశుద్ధిగా, పోట్లాటలు పెంచడం అయిష్టంచాత విశ్వశ్రేయహ్కాంక్షినై యీశాసనాన్ని ప్రతిబింబాల్తో ప్రచురించను. పంక్తులయినా యివ్వను.

నేను యిప్పుడు సిగిరెట్లు తాగడం మానేశాను. అయినప్పటికీ, అగ్నిసాక్షిగా (కౌండ్టానాదగ్గర లాండ్రీలో నిప్పు మండుతోంది. యిదుగో నేను మనోనేత్రంతో చూస్తున్నాను.) నేను ప్రతిబింబంతో శాసనం చూట్టానికైనా యివ్వనని శపథంచేస్తున్నాను.

నేను రుషితుల్యుణ్ణి గనక (ఏమన్నా అనుమానం వుంటే మా మునిమాణిక్యం నరశింహారావుని అడగండి; అతను 'స్వార్థం' కళ్లు కప్పకపోతే, చాలా మంచివాడు.) నా మాట వినండి. కేవలం దురుద్దేశంతో శాసన ప్రతిబింబాలు ఎగెయ్యడంలేదు. యిహ నేను దస్త్రంకట్టిపెడుతున్నాను. కథకూడా 'కంచి'కి పో టిక్కెట్ కోసం ఎగ్మూరు స్టేషనుకు వెళ్లింది.

---

## కుమారి సుజాత



ఆంధ్రయువతి భరతనాట్యమున ప్రావీణ్యం గడించి, బొంబయిలో నాట్యప్రదర్శనాలిచ్చి ఖ్యాతి గడించింది. త్వరలో తన నాట్యబృందంతో ఆంధ్రదేశం పర్యటన చేయనున్నది.

# ఎవరికెఱుక

శ్రీ మేడిచెర్ల ఆంజనేయమూర్తి

ఈ రసమయ ప్రపంచ సంసారలీల
జాలువారెడి సెలయేటి కాలువలుగ
చీలి యీనవహృదయ విశాలజలధి
జేరి నిండినపరిణామ మేరి కెఱుక.

ఈ విచిత్రోదయాస్తమయావకుంఠ
నాంతరుత్ఫుల్ల హృదయసంక్రాంతిశిల్పి
వెల్లివిరిసిన పూవిచ్చు చెల్లమర్చి
కూరుచున్నట్టి శుభకాల మేరి కెఱుక.

ఈ నవోష్మల గ్రాగి కంఠాన మ్రోగి
ప్రళయసమయాబ్ద గర్జానస్వభావ మెఱిగి
ప్రేలు హృద్దుందుభిజ ఘోరాభీలఘోష
మెంత యర్థానుషక్తమో యెవరి కెఱుక.

ఈ మనోహరలోకయాత్రామహస్సు
లాత్మసౌభాగ్యవర్ధనఖ్యాతి కన్వ
యించుకొను గర్వియీ హృదయశరధి
ధీరభాషిత మేమియో యేరి కెఱుక.

ఈ వినిర్మలభావనేచ్ఛావిహంగ
పాళికాంకితవిపులసంశీలహృదయ
గగనసీమల బాడము నాకాశవాణి
నూరిపోసెడి దేమియో యేరి కెఱుక.

ఈ నిరంతరతీవ్రవేగానుబద్ధ
విద్యుదస్పందవలయసంవేద్యహృద్య
హృదయచక్రమ్ముచలనసంపదల నొదుగు
ధార కున్నట్టి మధురిమ లేరి కెఱుక.

ఈ నవోదితభావమం దానిలప్ర
చాలితాకంపితాధికాందోళిత మగు
నీ నిరాధారహృదయఘంటానినాద
పూరరససిద్ధిసారము లేరి కెఱుక.

---

# సహజసిద్ధమైన పదార్థము యొక్క అద్భుతప్రభావము

14-వ లూయీ రాజు పరిపాలనలో ఫ్రాన్సు చాల అభివృద్ధి గాంచి, సిరిసంపదలతో తులతూగుచుండెను. యూరపు అంతా దీనిని చూచి ఆశ్చర్యపడుచుండెను. రోముకు చెందిన సెంటుపీటర్ మాత్రము వీరి ప్రయత్నములను ప్రతిఘటించుచుండెను. రోమునగరము చుట్టు గట్టి గోడ లుండెను. గోడల చుట్టు బురదనేల యుండెను. రోమునగరముపైకి దాడి వెడలి వచ్చినవా రందరు దీనికి గురి యగుచుండిరి. మలేరియా వ్యాధివలన సైన్యమునకు ఎక్కువ నష్టము కలుగుచుండెను.

ఈ బాధను లక్ష్యపెట్టకుండా లూయీ తన సైన్యమును రోము నగరముపైకి పంపెను. తగిన పరాజయము పొందెను. మలేరియాతో సైనికులు పెక్కుమంది చనిపోయిరి. మిగిలిన కొద్దిమందిని రోము సైనికులు ఓడించిరి. మలేరియా జ్వరములకు క్వైనైన్ గుణ మొసంగు నని అప్పటికే రోము పౌరులకు తెలియును. దీనిని వాడినందున ఫ్రెంచిసైన్యములో కొందరు మిగిలి యుండిరి. జేసూట్ కార్డినల్ డి లూగో ఈ మందును బీదవారికి, అనాథలకు పంచిపెట్టుచుండెను. అందుచే దీనికి "జెసూట్సు పౌడరు" అని పేరు వచ్చినది. ఈ పేరు చాలకాలము వాడుకలో నుండెను.

ప్రస్తుతము మలేరియా వ్యాధివలన ప్రపంచమున వివిధప్రాంతములందు ప్రతి సంవత్సరము 80 కోట్లమంది బాధపడుచున్నారు. వీరికి క్వైనైన్ దేవతాప్రసాదము. ఇది సహజసిద్ధమైనది. మలేరియా వ్యాధి రాకుండ కాపాడుటకు గాని, వ్యాధి నివారణకు గాని ఇది అమోఘముగా పని చేయును.

మలేరియా వ్యాధి చెలరేగిన దినములలో వ్యాధి రాకుండుటకుగాను అందరు దినమునకు 6 గ్రెయినుల వంతునను, రోగికి మొదటి 5–7 దినములు 15–20 గ్రెయినుల వంతునను క్వైనైన్ యొసంగవలె నని నానాజాతిసమితి మలేరియా కమీషన్ వారు సలహా యొసంగుచున్నారు.

M. 69

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు

శ్రీ వడ్లమూడి వెంకటరత్నము

(గతసంచిక తరువాయి)

నిఘంటువులో నొక్కొక్క శబ్దమునకు పెక్కు అర్థము లుండును గనుక కావ్యమున సందర్భమునకు దగిన యర్థము చేసికొనుటయు నొక్కొక్కపుడు సుకరముగాక యుండును. అట్టియెడ నుపసర్గలకున్న యర్థములను వేఱుగను, శబ్దములకున్న యర్థములను వేఱుగను వ్రాసినచో సామాన్యుల కర్థనిర్ణయము దుష్కరమగును. శబ్దమునకున్న యే యర్థముతో ఉపసర్గకున్న యేయర్థము చేరినచో సందర్భోచితముగా నుండునో ఆలోచించుట సామాన్యులకు దుర్లభము. ఒక్కొక్కమాఱు రెండుపసర్గలు, మూడుపసర్గలుకూడ చేరవచ్చును. అవి వివిధార్థములలో చేరియుండవచ్చును. అప్పు డర్థనిర్ణయము కష్టము గాదా? ఉపసర్గార్థములను, శబ్దార్థములను జూచి, జోడించి సందర్భోచితములను నిర్ణయించుటకంటె ఏయర్థమును జూడక నిఘంటువునే చూడక సందర్భోచితార్థము నాలోచించుకొనుటయే సులభతరముగా నుండును. పరామర్శకు లనునట్లు ఉపసర్గలు, శబ్దములు వేఱువేఱుగ నున్నను ఉపసర్గపూర్వకశబ్దములన్నియు నున్నట్లే యని యంగీకరించినను అది నూఱుసంవత్సరముల క్యాలెండరువలె నుండును. దానియందు తేదులు, వారములు, ఇతర విశేషములు కూడ నుండవచ్చును. అయినను వానిని తెలిసికొనవలయునన్న సామాన్యులకు తలకు మీఱినపని. ఆక్యాలెండరు తన నిర్మాతయొక్క బుద్ధి వైభవమును జాటవచ్చును. అయినను సామాన్యులు దాని నుపయోగింపక ఆవిషయములు వివరముగ—నెలవారిగ—నున్న క్యాలెండరునే వాడుచుందురు. ఇట్టి నిఘంటువులు పయిత మటులనే యగునేమో యని సంశయము.

నిఘంటువులో లేవని నే నన్న పదముల యొక్క పట్టికలో గ్రంథనామములనే యిచ్చితినిగాని ఆశ్వాసమును, పద్యసంఖ్యను వ్రాయలేదు. శాస్త్రిగారు ఇది మిక్కిలి యన్యాయ్యమనుచు ("ఎడగర"ను గూర్చి) "పదు నెనిమిది పర్వముల మహాగ్రంథములో వీనాలుగక్షరములపద మెక్కడ నున్నదో తెలిసికొనుట యెట్లు? ఇట్టి వానిని వెదుకవలయునన్న చాలకాలము పట్టును. ఐనను నేను వీని నన్నిటిని వెదకినాడను. తత్తత్పదముల యొద్ద తత్తత్పద్యములను వాని సంఖ్యాదులను జూపియే సమాధాన మిచ్చెదను చూడుడు." అని తమ పటుతా ప్రకటనపూర్వకముగా వ్రాసియున్నారు. ఇపుడు వీరింత శ్రమ పడకుండ ఏపద మెచ్చటనున్నదో తెలిసికొనుటకు వీరి కవకాశము లున్నవని తలచిరే నే నాశ్వాసాదుల నుదాహరింపలేదు. నిఘంటు పీఠికలో "వాఙ్మయ మంతయు గ్రొత్తగా జదివి యర్థసహితముగా నొక్కొక్కశబ్ద మొక్కొక్క కాగితపు ముక్కమీద నెత్తివ్రాసి పిదప నీముక్కల నన్నింటిని గలిపి యక్షరక్రమముగా విభజనముచేసి" అని వ్రాసియుండుటచే ఆశ్వాసాదుల నీయలేదు. నిఘంటుకర్తలాపదము లెక్కడ నున్నవో తెలిసికొనుట యొక లెక్కలోనిది గాదు. శాస్త్రిగారు చెప్పినమాట తెలియనివారి కబ్బురము గొలుపవచ్చును. పరామర్శకులు 'ఈపదములకొఱకిప్పుడు చదివినా'మని చెప్పుచు పీఠికలో నున్న "ఒక్కొక్కశబ్ద మొక్కొక్క కాగితపు ముక్క మీద వ్రాసి" అన్నమాటలపై సందియము గలిగించునట్లున్నారు. మొదటనట్లే వ్రాసియున్నచో నీ రిప్పుడు ఒకపదము ఎచట నున్నదో తెలిసికొనుటకు మరల చదువనేల? తమ సామర్థ్యమును ప్రకటించుకొననేల? ఈయుభయవాక్యములలో నేది సత్యము?

ఉమ్మసలారన్:—

(ఒకప్పుడు పెద్దవఱపు గల్గినది. అప్పు డొక పాము దప్పికచేత తహతహలాడుచు చేరువనున్న

యొక నాటిలో కప్పల బెకబెకలు విని సంతోషముతో దానిని సమీపించెను.)

క. మండూకనినాదము విని
నిండిన సంతసముతోడ నీ రుండనిచో
నుండవ విని యచట నుదకము
లుండెఁగఁబోలు నని మేన నుమ్మసలారన్.

మ. కదియం జయ్యన వచ్చి నాగ మచటన్
గాంభీర్య సంపత్తికిన్
సదురై యుండెడి నూయి గాంచి మదిగో
ర్కుల్ హెచ్చఁడు నేకూఱుబో
వుదు వాత్స్యాయ్న బుధుక యిప్పుడ పెనం
బుత్తున్...:

—కేయూరబాహుచరిత్ర ౩. ౧౭-౧౯.

ఇచట 'ఉమ్మసలారన్' అను పదమునకు తాపము తఱుగగా అనుట న్యాయ్యమా? తాపము పెరుగగా అనుట న్యాయ్యమా? ఉమ్మసలారుటకు పై కందపద్యమునందలి పూర్వ వృత్తము కారణ మగును గదా! మండూకనినాదము విన్నయంతనే అపరిమిత సంతోషము గలిగినది. నీ రుండక కప్ప లుండవు గాన నచట నుదకము లుండునని యనుమానముచే నిశ్చయించినది. అట్టిస్థితిలో నావఱకున్న తాపము తఱుగునా? పెరుగునా? సంతోషము తాపమును పెంచుటకు హేతు వగునా? సంతోషాతిశయమువలన సంతాపాతిశయము కొంత చల్లారు నని చెప్పుట సరసముగాదా? అయినచో శాస్త్రిగారు చెప్పినట్లు ఉమ్మ అసలారన్ = తాప మతిశయింపగా నని చెప్పుట భావ్యమా? "ఉమ్మసలు = తాపాతిశయము (బహువచన మతిశయార్థద్యోతకము) ఆరన్=తగ్గగా అని చెప్పుట భావ్యమా? రసికులు దేని నభిలషింతురో! ఉమ్మసఅనునది తాపార్థమున నిఘంటువులలో గలదా? యని యనవచ్చును. లే దనిరే గదా! నే ననుచున్నది! ఉమ్మస్సు, ఉమ్మసు అను పదములు వ్యవహారములో నున్నవి. తలబిరుసు, అహంకారము నను నర్థములలో వాడబడుచుండును. ఇచట తాపార్థమున వాడబడినదని నేనూహించుచున్నాను. ఈశబ్దమును అకారాంతముగా గ్రంథకర్త ప్రయోగించెనో! లేక ఉకారాంతముగా నే ప్రతిలోనేని పాఠము గలదో! ఇక 'చల్లారగా' ననునర్థమున ఆరన్ అనునది లఘు రేఫముతో గలదా యన్న కలదు. అప్పకవీయమును, సర్వలక్షణ సారసంగ్రహమును ఆపదము రెండు రేఫలతోను వాడదగునని సోదాహరణముగా చెప్పియున్నవి. శాస్త్రిగారు నన్నిచట వెక్కిరించి నందువలన వారికి భావ మసలు తోచనే లేదేమోయని నే నూహించుచున్నాను. తోచినచో తమ యన్వయమును సమర్థించుకొని యుండెడివారుగాని పరులను హేళనచేసి యుండెడివారుకారు. నాభావము ఆలోచింపదగినదిరైన కావచ్చునుగాని అపహసింపదగినది మాత్రము కాదు. ఆంధ్రభూమిపత్రికాధిపతులు శ్రీయుతులు అంద్ర శేషగిరిరావుగారు (బి. ఏ.) కేయూరబాహుచరిత్రమును గద్యమున వ్రాసినారు. ఈసందర్భమున వారు వ్రాసినది చూడుడు.

"నీరుండనిచో గప్ప లుండవు కావున నిచ్చట నీ రుండితీరవలె నని నిశ్చయించి నిండిన సంతసమున ప్రాణములు లేచిరా భయదర్శకము నూపమును గదిసెను." (౫౩-వ పుట)

ఈ 'ప్రాణములు లేచిరా' నమపదము 'తాపము కొంత చల్లారగా' నన్ననా యభిప్రాయమునకు చేరువగా నుండునో! 'తాప మతిశయింపగా' నన్న శాస్త్రిగారియభిప్రాయమునకు చేరువగా నుండునో సహృదయు లాలోచింతురుగాక!

ఏకభోగము:—

"ఇక్కడ 'ఏక' 'భోగ' శబ్దములకున్న యర్థముకన్న విశేషార్థ మేమియును లేదు" అని శాస్త్రిగా రన్నారు. చూడుడు—

గీ॥ ఏకభోగంబుగాఁగ నే లేలుఁగరుసు
గడలిసీమయు గౌతమీగంగ మేర
కప్పురపుఁగ్రోవి కాశ్మీరఖండ మవధి
యేలె విశ్వకుటుంబి భీమేశ్వరుండు."

—భీమ. ౫-౧౦.

దేవేంద్రుడు భీమేశ్వరునకు గొంత ప్రదేశమును దానముచేసి శాసనము వ్రాయించినాడు. ఆఘట్టములోని పద్య మిది.

ఈ ప్రదేశమొక 'యగ్రహారముగా' నిచ్చినట్లు గ్రంథకర్త వెల్లడించినాడు. చూడుడు—

"...దేవభర్త, ధరణి భీమేశ్వరున కిచ్చె ధార పోసి."
—భీమ. ౫-౮౭.

"...ఇచ్చితిని ధారపోసి భీమేశ్వరునకు."
—భీమ. ౫-౭౧.

"...ఇట్లిచ్చి ధర్మశాసనంబు వ్రాయించె."
—భీమ. ౫-౭౫.

ఈయగ్రహార మెటువంటిదో యీ యేకభోగ పదము చెప్పును. దానవిమయక పదజాలములో 'ఏకభోగము' అనునది యొక పారిభాషికపదము. ఒకప్రదేశము నెట్లనుభవింపవలయునో యీపదము తెలుపును. బాలభోగము, దేవభోగము మొదలగుపదము లీపదజాలములోనివి. ఏక, భోగశబ్దములను వేఱుచేసి యర్థము చెప్పినందువలన నీ పారిభాషికపదము ప్రకటమగునా?

ఈపదమును బ్రౌణ్యము గ్రహించినది చూడుడు.

"ఏకభోగగ్రామము:— **A village held by one owner or tenant,"**

ఈ పదము సమగ్ర నిఘంటువున కవసరము గాదా?

అఘప్రపంచము:—

"ఇది యపశబ్దమో సుశబ్దమో విమర్శకులు గ్రహింపలేదు. ఏల యన 'అఘస్' అనుదానిలో తవర్గ చతుర్థ వర్ణమే కాని ద్వితీయవర్ణము లేదు. కనుక వీరు తవర్గద్వితీయవర్ణముతో నిచ్చుట తప్పు." అన్నారు శాస్త్రిగారు.

'ఘ' వ్రాయుటకు మారు ముద్రితపాకమునుబట్టి 'ఘ' వ్రాసినానని శాస్త్రిగారు నాపై గినిసినారు; ధిక్కరించినారు. నా వ్రాతయందు లోపములు లేవనిగాని, ఉండవనిగాని నేను సమర్థింపబూనుటలేను. నాకాయహంకారముగాని, విశ్వాసముగాని లేదు. అయినను ఇంత చిన్న భేదములనుసయితము పరుల వ్రాతలలో గమనించుచుండు శాస్త్రిగారు తమ యీపరామర్శ వ్యాసములలోనే —

"స॥ నేడు రణభూమియందు నర్జునుం డొండె"

"నేడు రణభూమియందు అర్జునుడో..."

"అనగా అర్జునుడు..."

అని యిట్లు అర్జునుడు అర్జునుడు అనివ్రాయుటనే మనవచ్చునా? మాబోంట్ల ప్రమాదమువలన లోకమునకు నష్టము లేదు. శాస్త్రిగారు మావంటి సామాన్యుల తెగలోనివారు కారు. వారు సమగ్ర నిఘంటువును రచియించుచున్న సాహిత్య పరిషత్తులోని పండితులు. వారివ్రాత లోకమునకు ప్రమాణమగును.

"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే"

అని గదా భగవద్వచనము. 'అయినను 'అర్జునుడు' అని శాస్త్రిగారు వ్రాసినరూపము తప్పు అనుటకు నేను జంకుచున్నాను. ఏ తాటాకుల ప్రతిలో నున్నదో! నేను వారి నిఘంటువులో వెదకినాడను. ఆరూపము కానబడలేదు. ప్రమాదమున విడువబడినదో! మఱి యేదేని శబ్దమునొద్ద చూడవలయునో!

ఆదికపి :—

"ఉ. ...విరించినందనుఁడు... కనియెక్...
సంచిత సత్కృపారసవశంవదు నాదికపిన్ వృషాకపిన్" —పాండు ౨-౧౯౦.

"ఇక్కడ 'ఆదికపి' శబ్దము 'వృషాకపి' శబ్దమునకు విశేషణము గనుక ఆదిశబ్ద కపిశబ్దములు చూచికొనిన నిది గతార్థ మగును." అన్నారు శాస్త్రిగారు.

వృషాకపి యన్న శబ్దమునకు విష్ణువు, శివుడు, అగ్ని మొదలగు నర్థములు గలవు. ఆదికపి యన్న శబ్దమునకు నన్ని యర్థములు చెప్పుకొనవచ్చునా? ఆపద్యములు నిచట శివు డనియే చెప్పవలయును గాని పెక్కర్థములు చెప్పరాదు గావున ఆదికపి యన్న శబ్దమునకు శివు డనియే చెప్పవలయు ననవచ్చును. అప్పు డది యొక్కరికే యన్వయించు యోగరూఢ మగును గదా! అట్టి యోగరూఢపదములు సమగ్రనిఘంటువులో నుండ నక్కఱలేదా? అది యందఱకు నన్వయించు విశేషణ సామాన్యము గాదే! అది [illegible]

వానివంటిది. ఒక్కరికే యన్వయించునది! అట్టి పదముల నీయవలదా? నిఘంటువులో 'ఆదికవి, ఆదికావ్యము' అను శబ్దముల నిచ్చియున్నారే. ఆదికపి శబ్ద మంతకంటె సులభ మనియా?

ఇంతియ కాక కపి యనగా పెక్కర్థములు గలవు. కోతి, సూర్యుడు, ఏనుగు మొదలగునవి. ఇందులో శివుని కన్వయించునది మొదటికోతి యని యా? మొదటిసూర్యు డనియా? మొదటియేనుగని యా? ఎట్లు తెలియును? ఇట్టి యసామాన్య విశేషణములు సమగ్రనిఘంటువునకు గ్రాహ్యములుగావా?

అయ్యలదొడ్డి:—

ఇట "ఎట్టి విశేషార్థమును లేదు. అయ్యశబ్ద దొడ్డిశబ్దములు చూచుకొనిన వానిలో గతార్థమగును." అన్నారు శాస్త్రిగారు.

దొడ్డిశబ్దమునకు శబ్దరత్నాకరములో ౧. పసులు మేయుకంచె, ౨. పసులకొట్టము, ౩. పెరడు అను నర్థములు వ్రాయబడియున్నవి.

"...ఫలపూప పాయసా
హారములం దనుందెలచు నయ్యల దొడ్డికి వేల్పుగిడ్డికై.
—పాండు. ౨-౯౭.

ఈ పదము తెలియకపోవునా యని గాని, ఇంత మాత్రమూహించుకొనలేరా యనిగాని తలంపక పాండురంగమాహాత్మ్యములో కఠినపదముల కర్థము లిచ్చిన లఘుటీక ఈ పదమునకు—

"అయ్యలదొడ్డికిన్ = ఉత్తమజనుల సమూహమునకు" అని యర్థము వ్రాసినది.

ఇక సమగ్రనిఘంటు వేమి తెలుపునో చూడ వలసియున్నది.

అంజలికము :—

ఇది యాంధ్రభారతమున ప్రయోగింపబడి యున్నది. ఈ యంజలిక వర్ణనము సంస్కృతభారతమున కర్ణపర్వము ౯౦-వ అధ్యాయమున ౨౫ నుండి ౬౦ శ్లోకములదాక నున్నది.

వాచస్పత్యముకూడ దీనిని గ్రహించి "అంజలికా: స్త్రీ: అంజలిరివ కాయతి ప్రకాశతే, కై-కటాప్." అని వ్రాసియున్నది. తెనుగుభారతములో అభిమన్యుడు—"వ. విజృంభించి భల్లాంజలిక క్షురప్రహార్ధచంద్ర నఖర ప్రభృతి బాణశ్రేణికా వితానంబుల నెగడుపఱచిన..." —ద్రోణ. ౨-౩౯.

మఱియు క్రీడి—

"పులిత ప్రస్ఫురజాపహాసనవిభా
గుచ్ఛంబులం గల్గి యా
కలిమైవచ్చు కృతాంతువక్త్రమన ను
గ్రంబై మరారాతిరు
ద్రులచక్రంబును శూలమున్ దెగడుచున్
క్రూరంపు టొప్పారునం
జలికంబైన మహాస్త్రముం దొడివి క
ర్ణంబుబ్బునం జేయుచున్"
—కర్ణ. ౩-౩౫౮.

అని సోమయాజి ప్రయోగించియున్నాడు. ఈ పదము నేతరగతిలో జేర్చినారు శాస్త్రిగారు? అనావశ్యకములలోనా? గృహీతములలోనా? ఇది నిఘంటువులో జేరుట కయోగ్యమైనదా? లేక అనుబంధములో జేర్చియుంచినారా?

అహంకరణము:—

దీనిని తిక్కనసోమయాజి తనమహాభారతమున జేర్చియున్నాడు.

"నెరవరిగాక వీడు కురు
వీరులకుం బొడసూపువాడె యె
చ్చెరు వొకమ్రాని పేరనిట
నేరఁగవచ్చుచు నున్నవాఁ డహం
కరణమ కాని యొండొకటి
గానఁడు.............."

—విరాట. ౪-౯౧.

ఈ యహంకరణము ఆంధ్రమహాభారతమున నున్నను నిఘంటువులో జేరదగ దని కాబోలు మానినారు. ఇది గృహీతమా? అనావశ్యకమా? లేక అపశబ్దమా?

అబ్దికము:—

"వనములందును బంధ్రెండు వత్సరంబు
లలయ కజ్ఞాతవాస మేకాబ్దికంబు..."
—అరణ్య. ౪-౯౭.

అర్థికము ఇచట బహువ్రీహిగాగాని స్వార్థమున కప్రత్యయముఁజేర్చిగాని ఈ రూపమును జెప్పవచ్చును. అజ్ఞాతవాస మెంక్కసంవత్సరకాల మని తెలియనివా రుండరు గనుక నీపదము నిఘంటువులో నక్కరలే దందురారేమి శాస్త్రిగారు ?

అసిపట్టిక:—

"వాదరఁజిక్కిన యెముకతునుకలు గోఁడదొడల కైవడిఁ గలిగి రుధిరానులేపనంబున నాభీలం బగునసి పట్టిక ఘోరాకారయైనరాక్షసి పగతురఁ గీటడఁగించు టకుఁ దనకుం దోడువచ్చిన తెఱంగున..."

—సౌప్తిక. ౧-౭౭.

ఇట అసిపట్టిక యనగా పెడల్పయినకత్తి యను, నర్థ మిచ్చుచున్నదిగదా! నిఘంటువులో అసియొద్దను, పట్టికయొద్దను జూచినచో నేమగునో చెప్పగలరా ?

అకాలకౌముది:—

ఈపదమున కర్థము అ యొద్దను, కాలయొద్దను, కౌముదియొద్దను జూచిన సులభముగా తెలిపోవు నని శాస్త్రిగా రందురు. చూడుడు.

"అనుపమరాజ్యవిభూతిం
దనరి జగద్విజయకాంతు దైత్యులకు ముదం
బొనరఁగ నకాలకౌముది
యను నుత్సవ మొప్పఁజేసి రగణితబలులై"

—ఆది. ౧-౯౯.

అకాలకౌముది యనున దొక యుత్సవ మని యిందు స్పష్టముగా నున్నదిగదా! వేఱువేఱుపదముల యొద్ద జూచినచో నీయర్థము ప్రకటము కాగలదేమో? శాస్త్రిగారు సెలవీయగలరా?

అధోనీవి:—

"...ధర్మరాజు సమ్మతంబున కు వెలిచి యశోకమలి ప్రాతికామికి పిలుంద నేకవస్త్రయు, నధోనీవియు, నవిరళగళితనయ నోదకబిందు సందోహ పరిషిచ్యమానస్తన పరిధానాంతరయు నగుచు..."

—సభా. ౨-౨౧౨.

"ఏకవస్త్రా హ్యధోనీవీ రోదమానా రజస్వలా"

—సంస్కృతభారతము, ద్యూత. ౯౦అ. ౩౧శ్లో.

నిఘంటు గృహీతములగు నిందలి పదములను బట్టి అధోనీవి యనగా నేమో శాస్త్రిగారు తేల్చి చెప్ప గలరా? లేక యీపద మనావశ్యకమందురా ? వివరణ నభిలషించునిట్టిపదములు సమగ్రనిఘంటువున కనవ సరములా?

అంగవంచనము:—

"క్రమ్మఱంగదిసి పలకలుపలేయలు గావించి యలుగుల వొడ్డనంబుల నంగవంచనంబులను ప్రేటు పోటుల నవదరింపకుండ గాచికొనుచునోజ మెఱయు చుండి విన్నాణంబు తగులున పేసులు మెరసిన మల్ల యుద్ధప్రకారంబగు పెనంకువకుం జొచ్చిరి"

—ద్రోణ. ౪-౨౬౨.

(సాత్యకిభూరిశ్రవుల యుద్ధసందర్భమున.)

ఇట అంగవంచన మనగా 'లాఘవముతో డిమేని యొడుపు' అనునర్థము సరసముగా దోచుచున్నదిగదా! వ్యస్తపదముల యర్థమునుబట్టి ఇట్టిగంభీరార్థము పాఠకు లకు స్పష్టమగునా?

అనుమక్తి:—

అనుమక్తపదము వాచస్పత్యమున నున్నది.
అభిమృత్యము.
అభివిష్టము.

ఈపదముల యర్థము తెలిసికొనుటకు ఏయేపద ములయొద్ద జూడవలయునో సామాన్యుల కేమిత్రోవ చూపినారు శాస్త్రిగారు?

పోనిండు. ఈయీ యుపసర్గలమీదనున్న యీ యీ యక్షరములు ఈయీవిధముగా మాఱుచుండును గనుక నీయీ యక్షరములయొద్ద జూచుకొనునది యని యేని సూచించినారా? అదియు లేదు. మఱి యెట్లు? ఆమార్పు వ్యాకరణము చెప్పవలయును గాని యది చెప్పవలసినది నిఘంటువుగాదు అందురు. ఆవ్యాకరణ రూపములు తెలిసినవారికే తప్ప నన్యులకు నిఘంటు వుపయోగకరముకాదా?

అనవిత్త్వము:—

"సత్త్వాశ్రయమునఁ బురుషుఁడు
దత్త్వాశ్రయమునను సత్త్వతత్త్వముల విశే

కీర్త్యాలేపత్వము లన
విత్త్వము జిత్త్వంబునొందు విశ్వాధారా."

—అను. ౪-౨౨౭.

ఇందలి యనవిత్త్వమున కర్థము తెలియుటకు విద్యార్థులే యేపదములు చూతురో!

అగ్నిదైవత్యము:—

"నాటంగోలె కృత్తికలార్వురు వగ్నిదైవత్య మనంబరగు నక్షత్రంబై దివంబున వెలింగిరి.

—అరణ్య. ౫-౨౪౫.

అనుపోష్యుడు.

అనుజాతి.

అవసాదితము.

"నాదయిన యాశ్రితత్వము
- - - నన్నవ
సాదిత సమ్మోహుంగాఁ బ్రసాదింపు తగదె."

—అరణ్య. ౪-౨౬౩.

ఈపదముల యర్థములను నిఘంటువులో భిన్నభిన్న పదములయొద్ద జూచి తెలిసికొనుటకు సాధ్యమగునా?

ఉపసర్గాదులు మొదటనున్న పదములను బ్రత్యేకముగా గ్రహింపనక్కరలేదు. దీనియొద్దను దానియొద్దను జూచిన తెలియును అనువారు ఈక్రిందిపదములను నిఘంటువులో నేల యిచ్చిరో?

అక్షమ, అకృత్యము, అశోకుడు, అరుచి, అరసికుడు, అయోగ్యము, అయథార్థము, అమర్యాద, అనదినము, అనుజుడు, అభిముఖము, అభియానము, అరపలము మొదలగునవి ఏమియు విశేషార్థకములు కావే. వీని నీయవలసిన యవసర మేమి కలిగినదో?

ఇక శాస్త్రిగారు అపశబ్దము అని 'ఎడగర'ను గూర్చి వారు చేసిన చర్చను ఒకింత తఱచి చూతము.

ఎడగర అపశబ్దమా?

"మాకు నీపూన్కి సమ్మతమేము దీనికి
నీతోడివారము నీవు దన్ని
యున్నవాడవు నిద్రయును లేక యున్ననీ
వెడగరపడిరొ దీయడవిలోన
నెమ్మి దప్పి దేల నిద్రించి...అడరిన
నరిగణంబు గెలుతు వశ్రమమున."

—భార-సౌప్తి. ౧-౬౦.

అని వావిళ్ల, ఆనందప్రతులలో నున్నది.

'వేగిరపడిరొయిద నేలయింత' అను పాఠాంతరము వావిళ్ల, ఆనందప్రతులు సూచించుచున్నవి. ప్రాతము ద్రితప్రతులలోను, భారతము లక్ష్మీపతి సోమయాజులుగారి వ్యాఖ్యలోను ఈకడపటిపాఠమే యున్నదట! "ఈ పాఠమున నఖండయతి నంగీకరింపవలెను. కవిత్రయములో నిట్టి యఖండయతి లేదనియే పాఠముల బరిశీలింపగా దేలినది. కనుక నీపాఠము మంచిది గాదనుట స్పష్టము." అని శాస్త్రిగా రనుచున్నారు. కాని భారతమునందును అఖండయతి యున్నదని కీ. శే. మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు, కింక వీంద్రదత్త్యాది బిరుదాంచితులు చెళ్లపిళ్ల వేంకటేశ్వరకవిగారు మున్నగు పండితవర్యు లభిప్రాయపడి తమ తమ యభిప్రాయములకు ప్రబలకారణములు చూపియున్నారు. ఆ విషయమును శాస్త్రిగారు వేరుగ జర్చింపవచ్చును. ఎడగర ప్రస్తుతాంశ మగుటచే ఆవిషయమును నేను వదలివైతును.

'తాళపత్రగ్రంథములను బరిశీలింపగా,

"నిద్రయును లేకయున్నెని వెడఁగురుపడిరొ దీయడవిలోన' అను సాధుపాఠము గాన్పించినదట! ఇట 'వెడఁగురు' అనునదియే సరియగు రూపమనుటకు హరివంశములోని

"...వెడఁగురువడ్డమోముఁ బటువేదనఁ గందిన యంతరంగముల..." (పూర్వభాగము. ౭-౧౫౫) అనుపద్యము, పండితారాధ్యచరిత్రములోని "వెక్కువీగక వెడఁగురువడక" (దీక్షా. ౯౧ పొరట) అను పాదము ఈ మొదలగు సాధకప్రయోగములు కలవట! ఇవి యెంతవరకు సాధకములో చూతము.

భారతమున 'వెడగురు'శబ్దము ప్రయుక్తమగుటకు తాళపత్రప్రతులు సాధకములు గావచ్చునుగాని

యితరగ్రంథము లెట్లు సాధకము లగును? వెడఁగురు శబ్దమితరకవులు ప్రయోగించిరనుట కాప్రయోగములు సాధకము లగును. కాని సోమయాజి తనభారతమున 'ఎడగర' ప్రయోగింపలే దనుటకు హరివంశాదులు సాధకము లగునా?

వెడఁగురుశబ్దమే సరియగురూప మనుటకు వీరు హరివంశములోని యొకపద్యము నుదాహరించినారు. ఆపద్య మిది.

"ఉడుగక కన్నునీరఁ గడు
నొప్పఱి చాయలు చెడ్డ కన్నులన్,
వెడఁగురు వడ్డమోముఁ బటు
వేదనఁ గందిన యంతరంగమున్"
—హరి-పూర్వ. ౮-౧౫౫.

వావిళ్లప్రతిలో నీపద్య మిట్లున్నది.

"ఉడుగని కన్నునీరఁ గడు
నొప్పఱి చాయలు చెడ్డకన్నులన్,
వెడగఱ వడ్డమోముఁ బటు
వేదనఁ గుందిన యంతరంగమున్"
—౧౯౨౬-వ స. ముద్రణము.

ఇచట 'వెడగఱ' అని కలదు గాని 'వెడఁగురు' అని లేదు. 'వెడఁగురు' శబ్ద మున్నదని తెలియమినో, ఆశబ్దమున కర్థము తెలియమినో, లేక యది సంస్కరోచితము కా దనియో వావిళ్లవారిపండితులే దానిని దిద్దియుందు రని శాస్త్రిగారి సంశయమా? కాక పూర్వపాఠములలో నొకపాఠ మట్లుండియుండును. అని తలంతురా?

> ౧౯౩౩-వ సం. ముద్రితమయిన శబ్దరత్నాకరమున 'కఱ' అను శబ్దార్థవిచారమున 'కఱ—వై—వి. నలుపు' అని యర్థము వ్రాసి పైపద్యముచే
>
> "వెడకఱవడ్డమోముఁ బటువేదనఁ గందినయంతరంగమున్, బడుగయియున్న మేను..."

అని యుదాహరింపబడియున్నది. 'వెడగఱ' అన్నది యేకపదము కాదనియు, 'వెడ', 'కఱ' అను రెండుపదములు చేరిన సమాసమనియు నీపాఠమునుబట్టి మనకు తెలియుచున్నది. కానిచో రెండు పదములను వేఱుచేసి 'కఱ'కు ప్రత్యేకముగా నర్థము వ్రాయవలసిన యవసరము లేదుగదా! కనుక శాస్త్రిగారు తమయభిప్రాయమునకు సాధక మని తలచిన యీప్రయోగము ఇట్లు నిష్ప్రయోజన మగుచున్నది. హరివంశములో 'వెడఁగురు' శబ్దమున్నది గనుక తిక్కనసోమయాజి తనభారతములో వెడఁగురుశబ్దముచే ప్రయోగించినాడు అని సాధించుటయేగాక శాస్త్రిగారిమీద మఱి యొకబాధ్యతగూడ పడుచున్నది. ఏమన హరివంశమునందు వెడకఱ, వెడగఱ శబ్దములు కాక వెడఁగురు శబ్దమే ప్రయోగింపబడ్డ దని నిరూపించుట. ఇప్పుడు శాస్త్రిగారు సంపాదించిన పాఠము ఎచ్చటిదో తెలిసికొనవలసియున్నది. తాటియాకుల ప్రతులలో నట్లున్న దందురా? (మా యొద్ద తాటాకుప్రతులు లేవు.)

మఱి శబ్దరత్నాకరమున 'వెడఁగురు' శబ్దము లేదా యన్న లే కేమి? కలదు చూడుడు.

'వెడఁగురుపడు ద్వ. అ. క్రి. జడత్వము నొందు' అని యర్థము వ్రాసి

> 'ఎడపక నాజ్ఞాతు లిప్పుడు నన్ను
> విడిపించుకొనలేక వెడఁగురుపడిరి.'
> —ద్విప. భాగ. ౮ స్కంధము.

అని లక్ష్య మీయబడియున్నది.

ఇట్లు శబ్దరత్నాకరము వెడఁగురు శబ్దమును గ్రహించియు పై భారతప్రయోగమును గాని, హరివంశప్రయోగమును గాని యుదాహరింపలేదు. కనుక శబ్దరత్నాకరకర్త భారతమునందలి శబ్దము 'ఎడగర' గాని 'వెడఁగురు' కాదని తలంచినట్లు మన మూహింపవచ్చును. వారికి దొరకిన పాఠమున 'ఎడగర' యే యుండియుండును.

శబ్దరత్నాకర మీ 'వెడఁగురు' శబ్దమును వైకృతదేశ్య మిశ్రపదముగా దలంచియున్నది. పరిషన్నిఘంటు వేమితలంచినదో! అది యేకపద మనియా సమస్తపద మనియా? సమస్తపద మయినచో వైకృతదేశ్య మిశ్ర మనియేనా? అయినచో వైకృతాంశ మేది? దేశ్యాంశ మేది? కాక యేదియు నిర్ణయింప

జాలక వదలివైచినదా? అదియే సరియగు రూప మన్నారే గాని యెందువలన నదియే సరియగురూపమో శాస్త్రిగారు చర్చింపలేదు.

ఇంతకును 'ఎడగర' అపశబ్దమనుటకు శాస్త్రిగారేమికారణము చెప్పినారు? ఈశబ్దము నింకెవరును ప్రయోగింప లేదనియేనా?

'ఎడగర' యేకపదముగాక సమస్తపద మనియు, నందువలననే యితర ప్రయోగములు కానరాకున్న వనియు నా యభిప్రాయము.

ఎడ + కర అనగా హృదయమాలిన్యము, డెందమున తేటలేమి అని యర్థము.

ఈభావమే సంస్కృతభారతమున

"చిరంతే జాగ్రతస్తాత! స్వప తావన్నిశామిమాం,
విశ్రాంతశ్చ వినిద్రశ్చ, స్వస్థచిత్తశ్చ మానద."

అను శ్లోకమున గలదు.

జడత్వము నొందు అను నర్థముగల (శ. ర.) జెడఁగురుశబ్దమునకంటె నీపదమే సముచితముగా నుండును. అయినను ఇచట నొక సంశయము గలుగవచ్చును. నలుపు అను నర్థమున లఘురేఫముతోడి 'కర' శబ్దము గలదా? అని.

ఎరఁగు, ఎఱఁగు; తొరఁగు, తొఱఁగు మొదలగుశబ్దము లుభయరేఫములుగా ప్రయోగింపబడుచున్నవని చెప్ప నక్కరలేదు. ఇదియు నా తరగతిలో జేర్పదగినదా? మఱియు కమ్మరులు వాడెడు నొక యినుప పనిముట్టు అను నర్థము నిచ్చు కరవాయి అను నొకమాట గలదు. ఇందలి 'కర' శబ్దమే నల్లని అనునర్థము నొసగుచు 'ఇనుము'నకు సూచకముగా నుండవచ్చును.

వర్ణవిహీనమైన కెంపుఱాయి అనునర్థము నొసగుకరపక్కు అనునొకమాట గలదు. (ఈరెండు పదములును శబ్దరత్నాకరమున గలవు.) ఇందలి వర్ణవిహీనమయిన అను నర్థమును 'కర' అనుపద మిచ్చు నని నా యుద్దేశము. ఈవిషయమును పండితు లాలోచింతురు గాక!

లేక 'ఎడగఱ' అని శకటరేఫముతోడ నేమేని పాఠము గలదో!

ఎటులయినను 'ఎడగర' పాఠముతో సరసముగా నర్థము కుదురుచుండగా దీని నపపాఠ మననేల? దీనినే యెవరో జెడఁగురుగా దిద్దియుండరు గదా! ప్రస్తుత పద్యమున నిద్రలేకయున్నచో నీవు జడత్వము నొందుదువు ('జెడఁగురు'నకు శ. ర. బట్టి) అనుట మేలో, నిద్రలేకయున్నచో నీ మనస్సు తేటగా నుండదు (ఎడగర పాఠమునుబట్టి) అనుట మేలో రసికు లాలోచింపనగును.

దీనినిబట్టి 'ఎడగర' అపశబ్ద మనుట కవకాశము లేదుగదా! అది యపశబ్ద మని శాస్త్రిగారు సాధింపలేదు.

జెడఁగురు పాఠాంతర మొప్పికొన్నను ముద్రిత ప్రతులనుబట్టి 'ఎడగర' శబ్దముతో చదువుకొను భారత పాఠకులకు సమగ్రనిఘంటువేమి తోడుపడగలదు? అది సమస్తపదము గనుక గ్రహింప నక్కరలేదందురా? నిఘంటువున నెన్ని సమస్తపదములు లేవు?

కనుక నెటులైనను ఈపదము నిచ్చుటయే మేలని విస్పష్ట మగుచున్నది గదా!

(సశేషము)



# వలసపోయిన వృషభవాహనాలు

శ్రీ రంగారావు నిప్పాణి

౧౯౩౮-వ సంవత్సరం అక్టోబరు భారతిలో వలస రాజ్యాల శిల్పకళ అమరావతీకళననుసరించి యున్నదనియు, ప్రప్రథమంలో ఆంధ్రులే ఈ దేశాలనూ, ద్వీపాలనూ పరిపాలించి రనియు చెప్పియుంటిని. కాని ఇటీవల యం. యస్. రామస్వామిఅయ్యరుగారు బర్నిణద్వీపపు (Borneo) పురాతన వస్తువుల ఆధారమువల్లవచ్చు ఏ సాక్ష్యమూ లేకయే వట్టి భాషాసామ్యమునుబట్టి * ఆద్వీపమును తమిళసోదరు లాక్రమించి రని వ్రాశారు [1]

నాపరిశోధనవల్ల బోర్నియోద్వీపాన్ని ఆంధ్రులే ఆక్రమించి రని నమ్మకం కలిగినది. ఆంధ్రులు వలసరాజ్యాలను శాంతియుత మార్గాలతో ఏనాడు పరిపాలించిరో ఆనాడే హిందూమత మక్కడ ప్రసరించినది. అక్కడి ప్రజలు లెక్కలేని దేవాలయాలను నిర్మించి విగ్రహారాధనము సల్పుచుండెడివారు. జావాలోని చండిమెందూతు, చండిశెవు, ప్రంబానాలోను, సయామునందలి అంకారుతాం, అంకారువాత్ దేవాలయాలునూ, అన్నాం ప్రాంతంలో వుండే మెయిసాన్, డువాంగు దేవాలయాలునూ అప్పటిలాగే ఈనాటికినీ నిలచియున్నవి. వలస రాజ్యాలలో శైవమత సంబంధమైన దేవాలయాలు మెండు. అచటివారు అగస్త్యుని భట్టరగురు లేక వెలేంగు అని పిలుస్తారు.

జావా దేశస్థులు ప్రస్తుతం మహమ్మదీయ మతావలంబు లైనప్పటికీ హిందూసంప్రదాయాలను విడువలేదు.

౧౯౨౫-వ సంవత్సరమున బోర్నియో ద్వీపమందలి 'రత'నది ప్రాంతంలోని శిథిల శివాలయంలో వాలిపీఠము, గౌరి పట్టలేని యొకలింగము, దీపపీఠము, నందివాహనమూ ఇత్యాదులు లభించినవి[2].

అదేప్రాంతంలో కోంబెంగుదొరగారికి మరికొన్ని విగ్రహాలు దొరికాయి. అవి యేవన:—

౧. నిలుచున్నట్లున్న మహాకాల విగ్రహం.

---

* అసలు 'బోర్నియో' శబ్దము 'బ్రూనేయి'నుండి పుట్టినదనీ, ఆబ్రూనేయి తమిళ భాషయందలి నాయకుడనే యర్థముగల 'పీరాన్' లేక పిరాన్ శబ్దపు అపభ్రంశరూపమనీ యం. ఎస్. రామస్వామిఅయ్యరుగారి నమ్మకం. వా రీవిషయాన్ని సమర్థించుకోడానికి అనేకకారణాలను చూపిస్తారు.

1. In a Sunday Edition of the "Hindu" 1938.

2. Midden Oost Borneo Expedite - 1925. Utigave. van het Indisch, Coniete voor Wetenschappelijke On der Zoekingen - G. Kolff & Co. Wellervreden -1927 pp. 391-423.

౨. కూర్చున్నట్లున్న కార్తికేయ గణేశుల విగ్రహాలు.

౩. బ్రహ్మతల.

౪. తలలేని అగస్త్యవిగ్రహం.

౫. నందివిగ్రహం.

జావాలోనిచండీ బెనాక్, ప్రంబానన్ దేవాలయములందును, సిలోను దేశపు పోలన్నరువ యందును, హేగ్గుడచ్చి మ్యూజియము నందును ఉన్న నందివిగ్రహాలు ప్రసిద్ధి కెక్కినవి. (క. గ. చ. జ. చిత్రముల చూడుడు.)



చ. సిలోను పోలన్నరువానంది.



క. జావాచండీబెనాక్ నంది.



జ. హేగుమ్యూజియం నంది.



గ. జావాప్రంబానన్ నంది.

దక్షిణ హిందూదేశంలో ముఖ్యమైన నందివిగ్రహాలు ఈక్రిందిచోట్ల కలవు: లేపాక్షి, శ్రీశైలం, బళ్లారిజిల్లా కురుగోడు, మైసూరుచాముండి, తంజావూరు పంచనాలికులం, మహాబలిపురం.

నందివిగ్రహాలు రెండురకాలు: ౧. మెడపైకెత్తుకొని వుండేవి. ౨. మెడపై కెత్తుకొనకుండావుండేవి. హేగుమ్యూజియంలోని జావాదేశపు నందివిగ్రహమూ, పంచనాలికులంలోని నందివిగ్రహము[3] మొదటిరకానికి చెందినవి. లేపాక్షి, శ్రీశైలం, ప్రంబానన్, చండీబెనాక్ నందివిగ్రహాలు రెండోరకానివి. ఈ విగ్రహాల ఆకారం, కళాసంప్రదాయంపట్టి ఏకాలంలో చేయబడినవో చెప్పడానికివీలవుతుంది. మహాబలిపురం నందివిగ్రహమును

3. O. C. Gangooly - South Indian Bronzes - 1915. Plate - LXXXVI.



తంజావూరు పంచనాలి కులం నంది.

పల్లవచక్రవర్తియైన మహేంద్రవర్మ నాటి కాలంలో నిర్మించిరని తెలియుచున్నది.[1] పంచనాలికులంనంది చోళులకాలంలోనూ, ప్రం



బోర్నియొ కోంబెంగ దోర నంది

బానన్ చండీబెనాన్ నందులు శ్రీవిజయ మజ్జాపహిత్ కాలంలోనూ, పోలన్నరువా నంది సింహళ కళింగులకాలంలోనూ నిర్మింపబడినవని చరిత్రమూలకంగా తెలియుచున్నది. వివిధ దేశాలలో వుండే నందివాహనాలు సరిపోల్చి వాని నేకాలంలో నిర్మించిరో, ఎవరు స్థాపించిరో ఆయాదేశాలకూ మన దేశానికీ ఎట్టి సంబంధం వుండెనో తెలిసికొనవచ్చును.

సాధారణంగా నందివిగ్రహాలు కూర్చుని యున్నట్లుండును. ఎడమమోకాలు మడతపడి ఆ కాలిగిట్ట వెనుకటి కాలిగిట్టతో తగులుచుండును. కుడిమోకాలు కొంచెం సాగి గిట్ట భూమిని తగిలీతగలనట్లుండును. తదేక



మైసూరు చాముండినంది.

దృష్టితో గుడిలోని ఈశ్వరునియుత్తరువు కోసం నిరీక్షిస్తున్నట్లు చెవులు నిక్కబొడుచుకొని యుండును. గంటలు, గొలుసువరుసలను మెడా, గంగడోలుమీదను, "వీపు వస్త్రిపు"



శ్రీశైల నంది.

క్రింది కొనలనుండి పిరుదులమీదనూ, తోక క్రిందుగనూ శిల్పి నిర్మించియుంచును. నంది

1. Vincent Smith's "Early History of India" p. 425.

వాహనము శివుని యుత్పత్తిశక్తిని ధర్మమును సూచించునని కొందరి యభిప్రాయము.[5]

డా. జోస్సుగారు బటేవియా మ్యూజి యంలోని మహాదేవ (Fig-103 F), నందీశ్వర (Fig-103 G) విగ్రహాలునూ, బోర్నియో ద్వీపములో మెయిడర్ణవ్రూప్త వారికి దొరికిన విగ్రహాలునూ శిల్పమునందు సమానముగా ఉన్నవనియు, జావా దేశీయులే బోర్నియోను ఆక్రమించి రనియు, ఆ దేశములోనివిగ్రహా లను జావాహిందువులే నిర్మించిరనియు, హిందూ దేశానికీ బోర్నియోకూ ఏలాటి సంబంధం లేదనియూ నిర్ధారణ చేసిరి. కాని బోర్నియోవిషయక వృత్తాంతం వాయు పురాణం ౪౮-వభాగం, ౧౨,౧౫ శ్లోకాలలో కలదు. పైగా కొంబెంగునంది విగ్రహాలవంటి వాటిని ఆంధ్రదేశంలో అనేకచోట్ల నేను చూశాను. ఇక మహానది ప్రాంతంలో దొరికిన నందివిగ్రహమూ, లేపాక్షి, శ్రీశైలాల నందివిగ్రహాలూ అన్నీ వకే మాదిరిగా వున్నాయి. ఎట్టినిదర్శనాలు లేకయే శ్రీరామస్వామి అయ్యరుగారు బోర్నియోను తమిళులు ఆక్రమించిరని చెప్ప సాహసించినట్లు



లేపాక్షినంది.

ఆంధ్రులవలస రాజ్య మని చెప్పజాలను కాని ఈ నందివాహనాల సంప్రదాయం చూస్తే అతిప్రాచీనకాలంనుంచీ ఆంధ్ర దేశానికీ బోర్నియోకూ రాకపోక లుండె నని తెలియుచున్నది. ఆంధ్ర తేజముతోటి ఈవృషభ వాహనాలు వలసపోయా యని నా నమ్మకము.



5. E. B. Havell, "Ideals of Indian Art., Page. 76.

"అఖిలభారత కళాపరిషత్తు"కు

# సూ చ న లు

౧౯౩౯ నవంబరు భారతిలోని శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావుగారి 'అఖిలభారత కళా-విజ్ఞాన పరిషత్తు-దాని ఆవశ్యకతా' అనే ఆకర్షణీయమైన వ్యాసమూ, దానిమీద వచ్చిన డిశెంబరు 'భారతి' లోని సూచనలూ శ్రద్ధగా చదివాను. శ్రీ రాయప్రోలు సుబ్బారావుమహాశయులు సూచించిన శాఖ అవసరమే. ఇంకా, యువక రచయితలకూ, శిల్పులకూ కావలసిన ప్రోత్సాహమంతా ఈ 'పరిషత్తు'నుంచి ఆశించవలసినదేను.

నేటి భారతప్రజా నాయకులు కోరుతూన్న ప్రజాపరిషత్తు (Constituent Assembly) రాజకీయ భారతదేశానికెంత అవసరమో, అల్లాగే, కళా-విజ్ఞాన పరిషత్తు, విజ్ఞాన-సారస్వత వ్యవహారాలకి అంత ముఖ్యం. భారతప్రజా రాజకీయార్థిక, దేశీయ-విదేశీయవ్యవహారాలు 'ప్రజాపరిషత్తు' ఏ విధంగా నిర్వహింప సమకట్టినదో, అలాగునే, మన కళా-విజ్ఞాన పరిషత్తు మన దేశీయ సారస్వత కలాపాలలో మనకి నూతనరీతిని జూపుతుంది. కాక, ఈ ఏర్పడబోయే, కళా-విజ్ఞానపరిషత్తు ఈ క్రింది ఆశయాలతో కూడా ఉండాలని నా సూచన:—

(౧) ఈ పరిషత్తు కళా, విజ్ఞాన, సారస్వత విషయాలలో భారత భాగ్యోదయ చిహ్నముగా (Symbol of Indian Renaissance) ఉండాలి. దేశంలోని సాహితీ విజ్ఞానపరులనీ, ఆదర్శవాదులనీ (Idealists), కళానిష్ణాతలనీ ఒక కొలికికి తెచ్చే యత్నంలో ఈ పరిషత్తు నియోగింపబడాలి.

(౨) The Indian P. E. W. Centre వంటి సంస్థలసహకారంతో, జాతీయ విజ్ఞాన సమ్మేళనా (National Cultural Unity) నికి పాటుపడాలి. ప్రగతి సాహిత్య (Progressive Literature) నికి ప్రోద్బల మియ్యాలి. జానపద సారస్వతాన్ని సేకరించి ప్రచురించాలి.

(౩) దేశంలోని వివిధ సారస్వత, కళాసంస్థల సహకారమూ, మన్ననా పొంది, తన జాతీయ కళా ప్రయత్నాలను సఫలం చేసుకోవాలి.

(౪) ఈ పరిషత్తు నిర్ణయాలని, అన్ని పత్రికలూ, ప్రభుత్వమూకూడా శిరసావహించాలి.

(౫) ప్రతిఏటా, దేశంలోని అన్ని భాషలలోని రచయితల, అన్ని ప్రాంతాలలోని కళాశీలుల, వివరాలతో ఒక సమగ్రజాబితాను పత్రికలు ప్రచురించుచుండవలెను.

(౬) టాగోరు, ఇక్బాల్, శరత్, బంకింబాబులు, హరీంద్రనాథ్, ప్రేమచంద్, క. మా. మున్షీ, మున్షీపతి, సుబ్రహ్మణ్యభారతి, విశ్వనాథ సత్యనారాయణ, ఉన్నవ లక్ష్మీనారాయణ, బుద్ధదేవ వసువు, ప్రేమానందమెయిత్రా మొదలైన ఉత్తమ రచయితల అనువాదాలు వివిధ మాతృభాషలలోకి అనువదింపజేసి ప్రచురించాలి. అందువలన, భారత సాహితీపరులంతా గర్వించే జాతీయసారస్వతం కరతలామలక మవుతుంది.

(౭) 'కథాకళి' మొదలయిన దేశీయకళారీతులకి ప్రోత్సాహ మివ్వాలి.

(౮) టాగోరు, సరోజనీ, రాధాకృష్ణన్, హరీంద్రచట్టోపాధ్యాయ, ఉదయశంకర్, డా. కాళిదాస్ నాగ్ వంటి విజ్ఞానదూత (Cultural Ambassadors) ల వలన సుస్థిరపడిన భారతవిజ్ఞానప్రతిష్ఠ విదేశాలలో నిలిచే సర్వప్రయత్నాలూ చేయాలి.

ఈపరిషత్తుగూర్చి నిశ్చితప్రయత్నంజరిగి, కొంత రూపం ఏర్పడాలంటే, కొందరు ఉత్సాహపరులు ఒక (Provisional Committee) గా ఏర్పడి, దేశసంచారంచేసి ఉపన్యసించి, సాహితీ-కళాపరుల సానుభూతిని సంపాదించాలి. ఈలోగా పత్రికలు తమ విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించాలి. ౨, ౩ నెలల ఎడ తెగని పత్రికా...

పరిషత్తు ఏర్పడడానికి వైతాళికులు గానంచేశారన్న మాట. ఒక దేశాభాషా పత్రికలే కాకుండా, ఇంగ్లీషు దిన, వార, మాస పత్రికలు కూడా పూను కోవాలి. అప్పుడే నిజమైన ప్రచారం అవుతుంది. అప్పుడే సర్. యస్. రాధాకృష్ణన్, డా. పి. గుహ ఠాకూర్దా, డా. కాళిదాస్ నాగ్, శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు, బాబూ అతులానంద చక్రవర్తిగార్ల స్వప్నాలు యథార్థాలు కాగలవు! తథాస్తు.

—ఓగిరాల పద్మరాజుశర్మ.

సంపాదక మహాశయా!

తమ కార్తికభారతిలో ప్రచురింపబడిన శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావుగారి (అఖిలభారతకళా విజ్ఞానపరిషత్తూ—దాని ఆవశ్యకతా) అనే ఆకర్షణీయమైన వ్యాసం చదివాను. ఈమధ్యను మరెచ్చటయినా ఇంత సూతనోద్దేశపూరితమైన వ్యాసం చదివినట్లు జ్ఞప్తిలేదు.

ఇట్టి భారతీయకళావిజ్ఞాన పరిషదావశ్యకత ప్రస్తుతంకంటె ఎక్కువగా ఎన్నడూ గుర్తింపబడి ఉండదు. ఏవిధంగా ఆలోచించినా, ఇట్టిపరిషత్తు మనకు చాలా ఆవశ్యకము. దాన్ని సాధించడానికి నేటికి సారస్వతకళానిష్ణాతు లందరూ నడుముగట్టాలి. డా. కాళిదాస్ నాగ్, M A.,D. Litt., అతులానంద చక్రవర్తి, శ్రీమతి సోఫియావాడియా, కీ॥ శే॥ కొంపెల్ల జనార్దనరావుగార్లు చేసిన, చేస్తూఉన్న ప్రయత్నాలు స్తవనీయాలు. డా. పి. గుహఠాకూర్దా, శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావుగార్ల స్వర్ణస్వప్నాలు ఫలించి పరిషన్నిర్మాణం జరిగిన రోజుల, మనము నిజంగా గర్వించవచ్చును. అంతర్జాతీయ విజ్ఞాన సభలలో, భారత సభ్యతనూ, భారత విజ్ఞానౌన్నత్యాన్నీ వేనోళ్లచాటాలి. సభ్యజగతిలో మన కళౌన్నత్యాన్ని సంస్థాపించాలి.

అఖిలభారత ప్రాచ్య విద్యాపరిషత్తు (తొమ్మిదవ సమావేశము!) మార్చి నెలాఖరున తిరుపతిలో

సమావేశం కానున్నది. అందులో ఈముఖ్యవిషయం గూర్చిన తీర్మానం కాబోతున్నదట! ఈసభవారు దేశంలోని విజ్ఞుల, సంస్థల అభిప్రాయాలు కొంత గ్రహించి, ఈ పరిషన్నిర్మాణము ఆలోచిస్తున్నారని విన్నాము. ఈసభవాటికి తగినవిధమైన చర్చ జరిగి, సంస్థాస్థాపనకు దారిదీయునుగాక అని కోరుతున్నాను.

ఈ పరిషత్తు దేశంలో కళా, విద్యాప్రదర్శనాలు ప్రతి యేటా ఏర్పాటుచేసి దేశీయుల హృదయాలలో కళా, విజ్ఞానతృష్ణా, మనప్రాచీన సంస్కృతికి గర్వమూ కలిగించడానికి పూనుకోడం ముఖ్యమని నా సూచన. గ్రంథాలయాలూ, **Touring Lectures**కూడా ఉండాలని అనుకుంటాను.

శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావుగారు సకాలములో 'భారతి'ద్వారా పునశ్చరణచేసిన ఈమహద్విషయం గూర్చి ఇంకా చర్చలు జరిగి త్వరలో ఈసంస్థ నిర్మింపబడవలెనని కోరుతున్నాను. ఆఉద్దేశంతో ఉన్న అందరి ప్రయత్నాలు ఏకోన్ముఖంగా కావాలనీ, 'భారతి' వాటికి దోహద మిస్తుందనీ విశ్వసిస్తున్నాను. అవసరమైనయెడల ఈనాలేఖను తాము ప్రకటించ గోరెదను.

—బాహుబలేంద్రుని సీతారామరాజు.

---

# పుస్తకసమీక్ష

## జాతకరాజము

సింగయార్యప్రణీతము. ఆంధ్రవ్యాఖ్యాతలు: శ్రీధర వెంకయ్యసిద్ధాంతి, శ్రీధర విశ్వనాథ శాస్త్రిగార్లు. ఇది తెనాలి దైవజ్ఞగ్రంథమాలా ప్రథమప్రచురణము. ఈ గ్రంథము ౧/౮ క్రౌన్ సైజున ౨౮౮ పేజీలు: దీని వెల ౨-౦-౦.

ఈ గ్రంథము కూర్పులోనూ, టీకాతాత్పర్యాలు రచించడములోనూ శ్రీ వేమూరి రామగోవిందశాస్త్రి గారున్నూ, శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి గారున్నూ ఆంధ్రవ్యాఖ్యాతలకు సర్వవిధములా సాయపడినారు. జైమినీయమతాన్ని అనువదిస్తూ, తదావిష్కరణమునిమిత్తము రచించిన అనేకస్వతంత్ర గ్రంథాలలో ఈ జాతకరాజ మొకటి.

జైమినిపంథా, పారాశర్యాది మార్గాలకంటె సర్వాత్మనా విశిష్టమయినదీ, విలక్షణమైనదిన్నీ. దృష్టినిర్ణయము, కారకవిషయము, దశాకల్పనము, ఫలనిర్ణయార్థము గ్రహించిన విధానము—వీటి అన్నిటి లోనున్నూ ఒక ప్రత్యేకత ఉన్నది.

అటువంటి విశిష్టపద్ధతికి చెందిన "జాతకరాజ" గ్రంథానికి ఆంధ్రములో అర్థ తాత్పర్యాలు రచించి శాస్త్రాభివృద్ధికి పాటుపడ్డ ఆంధ్రవ్యాఖ్యాతలకు ఆంధ్రులు కృతజ్ఞత చూపవలసి వున్నది.

అయితే, ఇటువంటి నూతన మార్గానికి స్వతంత్రముగా గ్రంథరచన చేస్తూవున్న సింగయార్యుడు, అసలు మతానికి—కొన్నిఘట్టాలలో - విభిన్నముగా వ్రాసివున్నాడు. అటువంటి అర్థాన్ని కల్పించటానికి మూలమాత్రాలలో వున్న పదాలు భ్రమపెట్టినా, పరంపర అంగీకరించదు. ఇంతేగాకుండా ఇతరమతాలలో వున్న కొన్నికొన్ని విషయాలను కూడా గ్రంథములో చొప్పించివాడు. ఇది ఎంతవరకు విశేషముగా గ్రహించ తగినదీ అంటే, అది అన్యత్ర చర్చనీయము. గ్రంథములో అనేక పునరుక్తాలవంటివీ, ఉక్తవ్యాఘాతాలవంటివీ ఉన్నవి.

పండితులు వెంకయ్యసిద్ధాంతిగారున్నూ, వారి పుత్రుడు విశ్వనాథశాస్త్రిగారున్నూ జైమినీయ మతానువాదితమయిన గ్రంథానికి వ్యాఖ్యానము వ్రాసినారంటే మూలములో వుండే క్లిష్టతను తొలగించి సులభగ్రాహ్యము చేసివుంటారనే ఆశ అంకురిస్తుంది. కాని గ్రంథము చదివి చూచిన తర్వాత కొంత ఆశాభంగము కలుగకపోదు. కాని జాతకరాజమూల గ్రంథములో ఉన్న ౮౨-౮౩ శ్లోకాలవల్లను, వాటికి ఆంధ్రవ్యాఖ్యాతలు వ్రాసిన అర్థ తాత్పర్యాలవల్లను పరంపరయా వస్తూవున్న సంప్రదాయానికి వైరుధ్యమున్నూ, అందులో వున్న వాక్యాలనే ఏ విధముగానూ సమన్వయ పరచడానికి వీలులేని క్లిష్టతయున్నూ సంభవిస్తున్నది. సంప్రదాయము తెలిసిన వారు "పశ్యంతి నికటాం త్యక్త్వా పార్శ్వాభిముఖ సంస్థితాన్" అనే పాదాలవల్ల పై శ్లోక భాగాలలో సరియైన అర్థమును ఊహించడానికి అవకాశము ఉన్నది.

తమకు లభించిన మాతృకలలో వున్న మూల పాఠాలకు సరిగానే వ్యాఖ్యానము వ్రాసినామని వ్యాఖ్యాతలు అనేటట్లయితే ఆమాట అట్టే సమంజసము కాదేమో! ఇంత గ్రంథము వ్రాస్తూవున్న సింగయార్యుడు పరస్పర సమన్వయము కుదరని పద్ధతిని రచించి వుంటాడా? కాబట్టి మూలములో కాలాంతరేణా, లేఖకాంతరహస్తాల్లో పొందిన వికారాలను తొలగించి, వాటిని పాఠకులకు విశదపరచవలసిన బాధ్యత పూర్వగ్రంథాన్ని ప్రకటనకు తెచ్చినవారిమీద వుండుట సహజమేకదా!

ఒకప్పుడు దక్షిణదేశసంచారముసందర్భములో అక్కడక్కడ పండితులవల్ల తెలుసుకొని సంగ్రహించిన జైమినిపద్ధతితాలూకు శ్లోకాలు సూత్రాలలో దృష్టివిషయమున ఈశ్లోకాలు ఉన్నవి:

శ్లో. చరా నాగ............

.................ప్రపశ్యంతి పూర్ణం.

గ్రంథాంతరే:—

శ్లో. చరా శ్చరగతాః ఖేటాః స్థిరాన్ స్థిరగతానపి,
స్థిరాః స్థిరగతాః ఖేటాశ్చరాం శ్చరగతానపి.
ద్విస్వభావా ద్విస్వభావాం స్తత్రస్థా స్తత్ర సంస్థితాన్, పశ్యంతి నికటాం స్త్యక్త్వా పార్శ్వాభిముఖసంస్థితాన్.

ఈ శ్లోకాలవల్ల సంప్రదాయానికి ఏమాత్రము న్నూ విరుద్ధముగాని జైమినీయ దృష్టులు ఏర్పడకవి.

ఈ జాతకరాజమందు ఇటువంటి వ్యత్యాసాలు అక్కడక్కడ గోచరిస్తవి. పునర్ముద్రణములో ఇటువంటి లోపాలను తొలగిస్తారని ఆశిస్తున్నాను.

సు. శాస్త్రి.

---



## తత్త్వమీమాంస

దర్శనాచార్య శ్రీరాజా మంత్రి ప్రెగడ భుజంగరాయ ప్రణీతము, ఏలూరు.

"తత్త్వస్పర్శకతన కవిత్వము చల్లబడిపోవును" అని కీట్సు వాకొనినాడు. కీట్సు,మహాకవియే యయ్యు, గ్రీకుకవుల సంప్రదాయమునకు అంజలిఘటించి, ఇంద్రియోద్రేకమునే తనకవితకు ప్రధాననిమిత్తము గావించుకొనినాడు. కాని ఆదర్శకవిత్వము ఆత్మవిభూతికిని, ఆధ్యాత్మికసంపదకును, ఉదాత్తమైన ఆంతరంగికపరిణతికిని సంబంధించినది. ఇట్లని మన ప్రాచీనులు గుర్తించిరి. కావున భారతమహామునుల సంఖ్యనుండియే మహాకవులుదయించిరి. పారమార్థికచింత ఆదర్శకవితకు కన్నతల్లియనుసంశమును పోతనవంటి కొందఱుకవులు మాత్రము గుర్తించిరి. ఆధునికయుగమున వీరిసంఖ్య అత్యల్పము. వీరిలో దర్శనాచార్యులు శ్రీ రాజా

మంత్రిప్రెగడ భుజంగరావుపంతులుగారొకరు. వివిధ శాస్త్రీయమత సారస్వతములను పరిశీలించిన పండిత కవులు వీరని ప్రస్తుతగ్రంథము చాటుచున్నది. వేదయుగమునుండి పారమార్థిక భావము నెట్లెట్లు ప్రసరించుచు వచ్చినదో వీరు పరీక్షించిరి. భారతవైజ్ఞానిక మహోద్యమముల సింహావలోకనముతో, బహుశాస్త్రీయ కాశయముల పరిశీలనముతో ప్రస్తుతగ్రంథ మొప్పుచున్నది. వ్యాసమాని బ్రహ్మసూత్రములలోని గూఢార్థము లెట్లు ఆచార్య పరంపరవలన సువ్యక్త మొనరింపబడినవో, శంకర రామానుజమధ్వాచార్యులభావశబలత యెట్లు ప్రస్ఫుటించినదో దర్శనాచార్యులు వివరించిరి. సగుణాద్వైతము, జన్మకర్మములు, మాయామనస్సులు, తిర్యక్కులు, అహింస, శ్రీరామతత్త్వము, భక్తివైరాగ్యములు మున్నగు శాస్త్రీయాంశములను పరిశీలించుతఱి, పలువు రాడిన మాటలనే తామును ఏకరువుపెట్టక శ్రీభుజంగరావుపంతులుగారు స్వాతంత్ర్య సాహసములను వ్యక్తీకరించిరి. స్వమతమునే పొగడి, పరమతములను తెగడువారికి వీరు దూరస్థులు. సత్యాన్వేషణము వీరి జీవితపరమాశయము కావున నితరమతము లందలి మహత్త్వముపైని మనసుంచి బుద్ధ యేసు మున్నగు మహాప్రవక్తల ప్రబోధములను వీరు హృదయంగమ మొనరించుకొనిరి. బుద్ధుని అహింసను, యేసునిర్మల ప్రేమను ఉగ్గడించిరి. వీరివలె విశాలదృష్టితో సర్వమతములను పరీక్షించువారు అన్యమతాంగణములందు గూడ గోచరించుచో, అచిరములో భారతభూమి స్వర్గభూమికి సహపాఠి వలె గోచరింపక మానదు.

క్లిష్టమైన శాస్త్రీయాంశములను పఠితలకు సుబోధకము లొనరించుటందు వీరి కవితాశక్తి వీరికి మిగుల దోడుపడినది. దృష్టాంత నిర్వచనమువలనను, సాదృశ్య ప్రతిపాదనమువలనను జటిలాంశములు అవలీలగ హృద్గతము లగును. ఈయంశమును గుఱించిన మేటిరచయిత కావున ప్రస్తుత గ్రంథకర్తగారు అర్థాంతరన్యాసాలంకారములను ఉపమాలంకారములను బహుశముగా ప్రయోగించిరి. ఉపమలేని పద్యమును గ్రంథమున కనుగొనుట కష్టము. ఉపమలందు వీరి నైసర్గికప్రతిభ చక్కగ ప్రకాశించినది. జటిలచ్ఛందోనిబంధనములు వీరు చెప్పినట్లు సంచరించినవి కావున వీరి పద్యరచన కడుంగడు చక్కగ సాగినది. గ్రంథము భావప్రదీప్తమై, సౌందర్యసందీప్తమైనదని వచించుట కానందించుచున్నాను. జిజ్ఞాసువు లందఱును ప్రస్తుతగ్రంథమును కంఠస్థము గావించుకొందురుగాక! పావనగుణశోభిత శ్రీశ్రీశ్రీ రాణీ చిన్నమ్మారావుగారి పవిత్రస్మృతికి కృతికర్తగారు తమ గ్రంథము నంకితమొనరించుట ముదావహము.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

---

## మాణిక్యం

కర్త: శ్రీ కప్పగంతుల సత్యనారాయణగారు, ఆంధ్రప్రభ ఆఫీస్, మద్రాస్. వెల నాలుగణాలు.

ఈ పుస్తకంలో ఆరుకథ లున్నవి. మొదటికథ పేరే మాణిక్యం. ఈకథలో మాణిక్య మనే ఇల్లాలు సుబ్బన్నతో చక్కగా కాపురం చేస్తుంటుంది. కొన్నాళ్లు గడిచి ఒకకొడుకు పుట్టినతరువాత సుబ్బన్న జీవితంలో తప్పటడుగు వేస్తాడు. దీనిని గ్రహించి మాణిక్యం మండిపడుతుంది. సుబ్బన్న తనతప్పు దిద్దుకొనకపోవడమే కాక మాణిక్యాన్ని తంతాడు. రోషంతో అర్ధరాత్రివేళ మాణిక్యం కొడుకుతో పుట్టింటికి బయలుదేరుతుంది. దోవలో దొంగ లెదురుపడి మానభంగం చెయ్యడానికి ప్రయత్నిస్తారు. ఆమె పుత్రహత్యకైనా తెగించి మానాన్ని కాపాడుకొంటుంది. భర్త సక్రమంగా ప్రవర్తించనప్పుడు సంసారంలో హైందవనారీమణి పడే కష్టా లిందులో చూపబడినవి.

రెండవకథ 'తల్లిప్రాణం', మూడవది 'పెంపుడుకొడుకు' ఇవి రెండును సాధారణంగానే నడచినవి. నాల్గవదైన 'యోగి-భోగి'లో కవి జీవితంలో లోతులు తడిమాడు. పందొమ్మిదేండ్ల ప్రాయంలో, జీవితంలో మంచీ-చెడూ చూడకుండానే సన్యాసం పుచ్చుకొన్న యోగి సంసారి దినచర్యలో పడే కష్టాలనుజూచి విచారిస్తాడు కాని, మళ్ళీ దినాంతంలో గృహస్థు డనుభ

వించే భోగాలను జూచి ఈర్ష్యపడతాడు. పడకగదిలో నుంచి వచ్చే అగరువత్తివాసనలకు ఉక్కిరిబిక్కిరై పోయి, భోగాలు తనను ఎక్కువమారం ఆకర్షించక మునుపే ఇల్లుదాటి బైటపడతాడు. ఈకథలో యోగిని ఆధారం చేసికొని మానవుని జీవితంలో కష్టసుఖాలను కవి చక్కగా చూపించాడు.

కొంచెం బిగువు తక్కువైనా కథలు సులభంగా పాఠకులను ఆకర్షిస్తున్నవి. స్వభావోన్మీలనం బాగా వున్నది. భాషలో లోప మేమీ కనపడటం లేదు. కొంచెం శ్రమపడితే కథ లింకా రసవత్తరంగా ఉండగలవు.

### పంచవటి

కర్త: శ్రీమాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి గారు, నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరు. వెల అర్ధరూపాయి.

ఇది ఖండకావ్యం. 'పంచవటి'గాక పుస్తకంలో 'రామదూత' 'కవిప్రశంస' అను రెండుచిన్నవిగూడ ఉన్నవి. శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై పంచవటిలో అరణ్యవాసము చేసిన సందర్భము నాధారముగా చేసికొని కవి 'పంచవటి'ని రచించినాడు. పద్యములు రసవంతముగా నున్నవి. భావపటిమ చక్కగా నున్నది. శూర్పణఖ తనను పెండ్లిచేసికొనుమని లక్ష్మణునితో నొనర్చిన సంవాదము ముచ్చటగా నున్నది.

—వెం. శ్రీనివాసమూర్తి.

## పత్రికాస్వీకారము

**ఇది ఇండియనా? (Is it Indian ?)**

'ఒక్కచూపులో ఇండియా, మద్రాసురాజధానులు" (**India and Madras Presidency at a glance**) అను నామాంతరంగల చిత్రపత్రిక. ఇటీవలనే క్రొత్తగా ఏర్పడిన 'మద్రాసు పరిశ్రమోద్యమాల సంఘము' (**Madras Industrial Association**) తరఫున ఆంగ్లభాషలో శ్రీ మాగంటి బాపినీడు

గారి సంపాదకత్వమున వెలువడిన దీప్రచురణము. ఉపర్యుక్తసంఘమువారు గతసంవత్సరం ఆగష్టుమాసంలో 'ది సెంట్రల్ ఇండస్ట్రియల్ మ్యూజియం' అనుపేర ఒక పరిశ్రమోద్యోగప్రదర్శనశాలను స్థాపించి నడుపుతున్నారు. ఇట్టిశాలలూ, సంఘాలూ మనుష్యజీవితానికి వాయువులాగు దేశముయొక్క ఆర్థికసౌభాగ్యవర్ధనానికి అత్యంత ముఖ్యమైనవి. అమెరికా సంయుక్తరాష్ట్రములనూ, యూరోపునందలి సమస్తరాజ్యములనూ ప్రస్తుతం ఇంత మహోన్నతదశలోకి రావడానికి ముఖ్యకారణం ఇట్టిసంఘాలూ, ప్రదర్శనశాలలే. మన దేశంలోకూడా ఇటువంటివి ఎప్పుడో ఏర్పడివుండవలసింది; కాని విదేశీయప్రభువుల రాజనీతివిధానంవల్ల వీటికింతవరకూ వెలుగును చూసేభాగ్యం లభించింది కాదు. ఇప్పటికైనా దేశీయులధ్యానం వీటిపైపు మళ్లినం ముదావహం- ఇట్టివి దినదినప్రవర్ధమానాలై ఒక్కొక్క పల్లెలోకూడా ఏర్పడాలి.

ఈపత్రికలో మొట్టమొదటనే వున్న ఇండియా, యూరోపులసాదృశ్యం కనపరచే చిత్రపటం చూస్తే హృదయంగల ప్రతిదేశీయునికీ కళ్లు చెమ్మగిల్లి అనేక వందల సంవత్సరాలనుండి విదేశీయు లీరత్నగర్భ మీద ఎందుకు కన్నువేసి గ్రసించడానికి ప్రయత్నిస్తున్నదీ బోధపడుతుంది. ఒక్క చూపులో ఇండియా, మద్రాసు లను నామాంతరం సార్థకమైంది. దేశం మొత్తంమీదనేగాక జిల్లాలవారీగా జనసంఖ్య, చదువూ సంధ్యలు, వ్యవసాయం, ఉత్పత్తులు, పరిశ్రమోద్యోగాలు, వర్తకవ్యాపారాలు, వృత్తులు - ఇవీ అవీ ఏమిటి - సమస్తవిషయాలను గురించి ఇచ్చిన లెక్కలు అవి ఏస్థితిలో వున్నాయో తెలియపరచి దేశీయుల మనస్సులలో ఒకవిధమైన విచికిత్సను కలిగిస్తాయి. ప్రవీణులూ, అనుభవజ్ఞులూ దేశహితైషులు వ్రాసిన మొదటిభాగంలోని వ్యాసాలు గమనించదగినవి. పరిశ్రమోద్యోగాల విధానం, వాటి సహకారరీతులు, అడవుల సంపత్తి, గ్రామపరిశ్రమలు, ఖనిజసౌభాగ్యంమొదలైనవి ఇంతవరకు ఎట్టి స్థితిగతులలో వున్నదీ, ఇకముందు ఏలాగు పరివర్తితములై ప్రజాభివృద్ధికి తోడ్పడవలసిందీ ఈ వ్యాసాల లేఖకులు పూర్తిగా చర్చించి నిరూపించారు.

నిజాని కిట్టిపత్రికలు వూరికే పంచిపెట్టవలసినవి కాని ఆర్థికపరిస్థితులనుబట్టి కావచ్చు సాంఘికులు సంచిక వెల రు. ౧-౦-౦ పెట్టారు. ఇట్టి పత్రికలు వారి వారి భాషలలో వెలువడడం మహా అవసరం. సంపాదకులు వాగ్దానం చేసినప్రకారం ఇట్టిది దేశభాషలలో త్వరగా వెలువడునుగాక! 'ది సెంట్రల్ ఇండస్ట్రియల్ మ్యూజియం, ౧౬౬ మౌంటురోడ్, మద్రాసు.

## గ్రంథస్వీకారము

**ఆంధ్రరాష్ట్రము** — గ్రంథకర్త : శ్రీ వారణాసి వేంకటేశ్వరులుగారు. సాహిత్య కుటీరమువారి ప్రచురణము - గొట్టిపాడు, చిలకలూరిపేట పోస్టు. గుంటూరు జిల్లా. వెల రు. ౦-౨-౦.

**కల్పవల్లికా** — గ్రంథకర్త : బొమ్మకంటి నృసింహశాస్త్రి. నృసింహశాస్త్రి గ్రంథమాలలోని మొదటి గ్రంథము. కల్పవల్లిక ఆఫీసు, రామారావుపేట, కాకినాడ. వెల రు. ౧-౮-౦.

**శ్రీ బాలామణీశతకము** — గ్రంథకర్త్రి : శ్రీమతి జబీరు కాంతారత్నంగారు. ముద్రాపకులు : రైతాంగముద్రణాలయం, శ్రీకాకుళము.

**శ్రీ దీనబాంధవ శతకము** — గ్రంథకర్త్రి : శ్రీమతి జబీరు కాంతారత్నంగారు. ప్రకాశకులు : ఉప్పాడ రాజారావుగారు, జలుమూరు. ౦-౨-౦.

**దేశభక్తి** : గ్రంథకర్త : శ్రీవనం శంకరశర్మగారు. పత్తికొండ, కర్నూలుజిల్లా, సరస్వతీముద్రణాలయమున ముద్రాపితము. వెల రు. ౦-౪-౦.

**దయ్యాల పన్గడ** : గ్రంథకర్త : శ్రీ వెల్దుర్తి మాణిక్యారావుగారు. ౧౧౧, సుల్తానుబజారు, హైదరాబాదు, దక్కన్.

**శ్రీ సూర్యప్రభ** : గ్రంథకర్త: శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు-ఆత్రేయాశ్రమం, కాకరపర్రులేక చేబ్రోలు పిఠాపురం పోస్టు, తూ. గో. జిల్లా.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.